THE LARGEST CIRCULATED TELUGU MONTHLY

# చతుర

ఫిబ్రవరి 1999 ★ రూ.7/-



జె.వి. బాబు

# నీడ

మాది చాలా మంచి కుటుంబం...

# నాకు ఎయిడ్స్ ఎందుకు వస్తుంది ?

నిజమే! మీది మంచి కుటుంబమే కావచ్చు. కానీ ఎయిడ్స్‌కు బీదా, గొప్పా, మంచీ, చెడ్డా తేడా లేదు. కలుషితమైన ఇంజెక్షన్ సిరంజీలు, సూదులు, కలుషితమైన రక్త మార్పిడి వల్ల ఎవరికైనా ఎయిడ్స్* రాగల ప్రమాదం ఉంది. మీకూ, మీ ఆత్మీయులకు ఎల్లప్పుడూ గుర్తింపు పొందిన బ్లడ్ బ్యాంకు నుంచి మాత్రమే రక్త మార్పిడికి అంగీకరించండి. గుర్తుంచుకోండి మీ జీవితంపట్ల పూర్తి బాధ్యత మీదే.

**ఎయిడ్స్ ఎలా వ్యాపిస్తుంది**

- సురక్షితం కాని లైంగిక సంబంధం**
- కలుషితమైన రక్త మార్పిడి
- కలుషితమైన మందు సిరంజీలు, సూదులు
- వ్యాధిగ్రస్థ గర్భస్త్రీ నుంచి బిడ్డకు

**ఎయిడ్స్ ఎలా వ్యాపించదు**

- ఎయిడ్స్ వ్యాధిగ్రస్థ వ్యక్తితో స్పర్శ ద్వారా, కలసి జీవించడం వలన, కలసి పనిచేయడం వలన, కలసి భుజించడం వలన ఎయిడ్స్ వ్యాపించదు.
- దోమలు, తదితర కీటకాల కాటువలన ఎయిడ్స్ వ్యాపించదు.

**ఎయిడ్స్ : చికిత్స లేనే లేదు, నివారణ మాత్రమే సాధ్యం.**




**ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఎయిడ్స్ నియంత్రణ సొసైటీ**

*ఏ వ్యక్తి అయినా హెచ్ ఐ వి + అయిన 5నుంచి10 సంవత్సరాల కాలానికి ఎయిడ్స్ లక్షణాలు చూపే అవకాశం ఉంది.

**వివాహానికి ముందు, వివాహేతర లైంగిక సంబంధం, వ్యభిచారులతో లైంగిక సంబంధం; నిరోధ్ (కండోమ్) ఉపయోగించకుండా.

# చతుర ప్రపంచం

## పాలు పసివారికేనా?

"ఇంకా నేనేమైనా పాలు తాగే పసిపాపననుకుంటున్నారా" అంటుందో అమ్మాయి కోపంగా తల్లితండ్రులతో. "ఛీ ఛీ! పాలంటే నాకు వెగటు బాబూ! మంచి బ్రూ కాఫీ ఇస్తే తాగుతాను" అంటారు మరి కొందరు. పాలంటే కేవలం చిన్న పిల్లలకే పరిమితమనీ, కొంచెం ఎదిగితే టీ, కాఫీలు తాగవచ్చని చాలామంది అనుకుంటారు. కానీ పాలు.. ముఖ్యంగా స్త్రీలకు ఎంతో అవసరమంటున్నారు వైద్యులు. శాకాహారులు పాలు తప్పనిసరిగా తీసుకోవలసిన ఆహారమని తెలుస్తోంది.

మిల్క్‌లో రెండు రకాల ప్రొటీన్లున్నాయి. పనీర్‌లో వుండే ప్రొటీన్లకన్నా అది వడకట్టగా వచ్చిన నీటిలోనే అధికమైన ప్రొటీన్లున్నాయి. పాలను విరగ్గొట్టి పనీర్ చేస్తామన్నది అందరికీ తెలుసు. పిప్పిని తీసి నీటిని పారబోస్తారు చాలామంది. కానీ ఈ నీటిని మరొక వంటకం తయారు చెయ్యడంలో వుపయోగిస్తే అందులో వుండే ప్రొటీన్లు వృధాకావు.

పాలలో కాల్షియమ్, ఫాస్ఫరస్ అనే రెండు ముఖ్యమయిన ఖనిజాలున్నాయి. ఇవి ఎముకల, పళ్ళగట్టితనానికి ఎక్కువగా ఉపయోగపడతాయి. ముఖ్యంగా గర్భిణీ స్త్రీకి ఈ రెండు ఖనిజాలూ చాలా అవసరం. ఇవి లోపలి బిడ్డ స్కెలిటల్ నిర్మాణానికి తోడ్పడతాయి. గర్భిణీ స్త్రీ పాలు తీసుకోకపోయినట్లయితే ఆస్టియోమాలేసియా వచ్చి నీరసం, జాయింట్లు నెప్పులు, ఎముకలన్నీ నెప్పులు కలిగి వంగిపోయి చివరికి విరిగిపోయే ప్రమాదముంది.




పెళ్ళయి గర్భంధరించాకనే స్త్రీలు పాలు తాగాలి అని కొందరనుకోవచ్చు కానీ


చతుర ... 3

ఇంట్లో ఒక అబ్బాయి ఒక అమ్మాయివుంటే ఇద్దరికీ పాలు ఇవ్వలేకపోతే అమ్మాయికి మాత్రం తప్పనిసరిగా పాలు ఇవ్వాలంటు న్నారు వైద్యులు. చిన్నతనంలోను, పెళ్ళికి ముందు, పెళ్ళి అయ్యాక, గర్భిణీగా వున్న ప్పుడు ఏ సమయంలోనయినా పాలు తాగడం అవసరం. అలా తీసుకోకపోతే పుట్టబోయే పిల్లల ఎదుగుదల సరిగా లేకుండా వుండే ప్రమాదముంది. స్త్రీల వృద్ధాప్యంలో అయితే ఏ కారణంచేతన యినా గర్భసంచీ తొలగిస్తే వారిలోని ఫిమేల్ హార్మోనులయిన ఈస్ట్రోజన్ లెవిలు పడిపోతుంది. అప్పుడు వారికి ఆస్టియోపో రోసిస్ అనే వ్యాధి సంక్రమిస్తుంది. ఎము కల సాంద్రత తగ్గి ఏ ప్రమాదమూ జర క్కుండానే ఎముక పెళుసుదేరి విరిగిపోవడా నికి ఆస్కారముంది. స్త్రీలలోనే ఈరోగం వచ్చే అవకాశమెక్కువ. కాబట్టి స్త్రీ ఆహా రంలో చిన్నతనంనుంచి, వృద్ధాప్యం వరకు పాలు అత్యంత ప్రధాన పాత్రను నిర్వహిస్తు న్నాయి.

పాలవల్ల ఇంకా ఎన్నో ప్రయోజనాలు న్నాయి. ఇందులో వుండే లాక్టోజ్ అందు లోనే వుండే కాల్షియం, ఫాస్ఫరస్‌లను అరి గేలా చేస్తుంది. పాలను పెరుగుగా మార్చి నపుడు లాక్టోజ్, లాక్టివ్‌యాసిడ్‌గా మారి ఇతర ఆహారపదార్థాలలో వుండే ఐరన్‌ను అరిగేలా చేస్తుంది. బ్లడ్‌లో ఎర్రరక్త కణాలు పెరగడానికి, రోగ నిరోధకశక్తి అభి వృద్ధి చెందడానికి ఐరన్ చాలా అవసరం. ఆకు కూరలతో తయారుచేసిన ఆహారప దార్థం తినేటప్పుడు పెరుగును తప్పనిసరిగా తినాలి. ఆకుకూరలలో వుండే ఐరన్‌ని కరి గేలా చేస్తుంది పెరుగులో వుండే లాక్టిక్ యాసిడ్.

అన్నవాహికలో ఎన్నో సహాయకారక బాక్టీరియాలున్నాయి. ఇవి శరీర నిర్మా ణంలో తోడ్పడతాయి. వీటి పెరుగుదలకు పెరుగులోని లాక్టిక్ యాసిడ్ బాగా పనిచే స్తుంది. కాబట్టి నిత్యం అన్నంలో పెరుగు తినడం అలవాటు చేసుకుంటే ఇది అన్నవా హికలోని సహాయకారి బాక్టీరియా పెరుగు దలకి దోహదంచేస్తుంది. ఎన్నో రకాల మందులవల్ల వచ్చే సైడ్ ఎఫెక్టులను నివా రించడంలో మజ్జిగ సహాయపడుతుంది. అయితే పాలలో ఐరన్ మాత్రం తగుమోతా దులో లేదు. కాబట్టి ఐరన్ కోసం ఆకుకూ రలు, గ్రుడ్లు, రాగులు, వగైరాలన్నీ ఆహా రంలో వుండేలా చూసుకోవాలి.

## మృగాల్లోని మాతృత్వం

పిల్లలు పెరిగి పెద్దవాళ్ళవడానికి తల్లి తండ్రులుపడే శ్రమ అందరికీ అనుభవపూ ర్వకంగా తెలిసిందే. ఒక్క మనుషులేకాక మృగాలు కూడా తమ పిల్లల విషయంలో శ్రమపడుతుంటాయి.

మొసలి ఇసుకలో గుడ్లను పెడుతుంది. గుడ్లు పగిలి పిల్లలు బయటకి వచ్చాక వాటిని తన నోటితో మృదువుగా కరిచిపట్టు కుని నీళ్లలోకి వెళ్ళి వాటికంటుకున్న ఇసుక పోయేలా కడుగుతుంది.

సముద్రపుసింహాలు, జీవితాంతం నీళ్లలో గడిపే ప్రాణులైనా వాటికి పుట్టుకతో ఈతరా దు. వాటి తల్లి పిల్లలకి ఎలా ఈదాలో నేర్పిస్తుంది.

తిమింగలం పిల్లకి ఆకలివేసినప్పుడు దాని మూతిని తల్లి తిమింగలం వక్షం దగ్గర వుంచుతుంది. తిమింగలం అది గ్రహించి సరిగ్గా తన బిడ్డ నోట్లో పడేలా పాలని ధారగా బయటకు చిమ్ముతుంది. ఏనుగు తన పిల్లల ను నది దాటించేటప్పుడు వాటిని తన తొండంతో పైకెత్తి పడిపోకుండా దంతాలమ

ధ్య ఇరికించుకుని ఈదుతూ నీళ్లని దాటుతాయి. అలాగే ఎలుకలు తమ పిల్లల్ని వీపుపైకెక్కించుకుని ఈదుతూ నీటిని దాటుతాయి. ఎలుకకి పెద్దయ్యేదాకా ఈతరాకపోవడానికి ఇదే కారణం.

ఆడసింహాల్లో ఒకటి వేటకెడితే దాని పిల్లలదగ్గర మరో ఆడ సింహం కాపలా కూర్చుంటుంది. వేటాడిన దాంట్లో కొంత భాగం ఇందుకు ప్రతిఫలంగా బేబీ సిట్టింగ్ చేసిన ఆడసింహానికి లభిస్తుంది.

ఐస్‌మీద గుడ్లుపెడుతుంది పెంగ్విన్

వయసులుకల పిల్లలుంటాయి. వాటివాటి వయసునుబట్టి వాటికి తగిన పాలనిస్తాయి అవి. అంటే ఓ నిపుల్ తక్కువ వయసుగల పిల్లలకోసం చిక్కటి పాలని, ఇంకో నిపిల్ ఎక్కువ వయసుగల పిల్లలకి పల్చటి పాలను అందిస్తాయి.

జిరాఫీ పిల్లలు పుట్టగానే కొన్ని అడుగుల ఎత్తు నుంచి కిందకు పడాల్సివుంటుంది. ఇందుకోసం కాన్పుల సమయంలో తల్లి జిరాఫీలు గడ్డి పెరిగిన నేలవద్దకు చేరుకుంటాయి.




పక్షి ఆడ పక్షి వెళ్ళినప్పుడు మగ పక్షి ఆ గుడ్డుమీద కూర్చుని తన పొట్టతో దాన్ని పొదుగుతుంది. ఇలా రెండు నెలల కాలం, తిరిగి ఆడ పక్షి వచ్చి అది పొదిగేదాకా మగపక్షి కదలకుండా గుడ్డుమీద కూర్చుంటుంది. ఆ సరికి అది చిక్కి శల్యమై ఆకలితో నకనకలాడుతూ వుంటుంది. ఆడ పక్షి వచ్చాకకానీ అది ఆహారం కోసం కదలదు.

ఎలుగుబంటి, సీల్‌లాంటి కొన్ని జంతువుల గర్భంలో ఓ స్పేర్ అండం వుంటుంది. వాటి పిల్లలకి ఏమయినా అయితే మళ్ళీ మగజంతువులతో జతకట్టకుండా అవి ఇంకోసారి కంటాయి. కంగారు జంతువులకి అనేక

ముళ్ళపంది కనేటప్పుడు దాని పిల్లల ముళ్ళు తల్లి గర్భంలో గుచ్చుకొని బాధించవు. కేవలం ఆ సమయంలోనే ముళ్ళపంది పిల్లకుండే ముళ్ళు మృదువుగా వుంటాయి. బయటకి రాగానే గట్టిపడతాయి.

కోకిల సంగతి మనకందరికీ తెలిసిందే. దానికి గూడు కట్టుకోవడం చేతకాదు. అందుచేత ఇతర పక్షిగూళ్లలో అది గుడ్డుపెడుతుంది. రెక్కలు రాని ఆ గూటి పక్షులు వాటిని పొదిగి పిల్లలను చేస్తాయి.



# చతుర

సంపుటి: 22 సంచిక: 1 ఫిబ్రవరి 1999

ఆమెను చూస్తే చంద్రకాంతిలో వయ్యారంగా నాట్యంచేసే వెన్నెలకన్య తలపుకు వస్తుందతడికి.

ఉదయం నిద్రలేవగానే ఓ సుందర దృశ్యాన్ని చూడ్డమో, చక్కని సంగీతాన్ని వినడమో జరిగినప్పుడు మనసుకు కలిగే ప్రశాంతత... ఒక్కసారామెను వీక్షిస్తే కలుగుతుందతనికి.

కానీ... ఆమె... పరాయిసొత్తు.

ఆ సౌందర్య నిధికి అధికారి వేరొకరు.

అయినా అనుక్షణవీక్షణలో క్షణక్షణం కళ్లముందు నిలిచే ఆమె సంసార గమనపు ఎగుడుదిగుడులను గమనించి ఓ ఉద్రిక్త క్షణంలో ఆమెను తన ఇంటికి తీసుకు వచ్చేశాడా పక్కింటి యువకుడు. అటుపైన ఆమె కథ... ఎలాంటి మలుపు తిరిగింది? మనసుకు హత్తుకునే సంఘటనలతో... మనుషుల మనోభావాలను... మనోజ్ఞ కథనంతో మలిచిన జె.వి.బాబు రచన 'నీడ' ఈ నెల 'చతుర' సమగ్ర నవల.



సాయంత్రం ఆరు గంటలయింది.

పడమటి దిక్కు తలుపులు తెరిచి సూర్యుని ఆహ్వానిస్తోంది. పగలంతా బతుకు పోరాటంలో అలసిపోయిన పక్షులు గుడ్‌నైట్ చెప్పుకుంటున్నట్టు అరుస్తూ తమ నివాసాల వైపు సాగిపోతున్నాయి.

అతడు కాస్త తలదించి చూశాడు.

రోడ్డుమీద జనం కొందరు ఇళ్లకు చేరుకోవాలనే ప్రయత్నంలో వడివడిగా నడుస్తుంటే మరికొందరు ఫుట్‌పాత్ మీద నిలబడి కబుర్లు చెప్పుకుంటున్నారు. ఇంకొందరు షాపింగ్‌కని దుకాణాలలోకి దూరుతున్నారు. మరోవైపు జనాల మధ్యనుండి వాహనాలు మృత్యుశకటాల్లా వేగంగా పరుగెడుతున్నాయి.

"ఎక్స్‌క్యూజ్‌మీ సార్'

ఎత్తయిన ఆ కమర్షియల్ కాంప్లెక్స్ నాలుగో అంతస్తులో ఉన్న తన ఆఫీసు రూం కిటికీలోనుండి రోడ్డువైపు చూస్తున్న వంశీకృష్ణ తలతిప్పి చూశాడు.

సెక్రటరీ అహల్య లోపలికొచ్చింది.

ఇరవై మూడేళ్లుంటాయామెకు. భారతీయ సంస్కృతి, పాశ్చాత్య నాగరికతలకు మధ్య వారధి కట్టాలని ప్రయత్నిస్తున్నట్టుంటుంది ఆమె వేషధారణ. చీర, బాబ్డ్ హెయిర్, పెదాలకు మరీ ఎర్రగా కనిపించే లిప్‌స్టిక్! అయితే జుట్టున్న ఇల్లాలు ఏ కొప్పు పెట్టినా అందమేనన్నట్టు మనిషి అందగత్తె కావటంతో ఆమె అలంకరణ ఆకర్షణీయంగానే కనిపిస్తుంటుంది.

ఆమె చిరునవ్వుతో అడిగింది. "ఎనీ మోర్ వర్క్ ఫర్‌మీ సార్'

అతడు తల అడ్డంగా ఆడించాడు, " నో! మీరిక వెళ్లొచ్చు''

"థాంక్యూ సార్' ఆమె వెళ్లిపోయింది.

ఆఫీసు లాక్ చేసుకుని తనూ ఇంటికెళ్లిపోతే బాగుణ్ణనిపించింది అతడికి. కాని అంతలోనే ఏదో తెలియని అనీజీనెస్ మనసులో కదలాడింది. ఇప్పుడే ఇంటికెళ్లి ఏం చెయ్యాలి? చేసేందుకు ఏమీలేదు కదా? ఒంటరి జీవితం.

వంశీకృష్ణ కిటికీ కర్టెన్ లాగి ఇవతలికి వచ్చాడు. పొడవైన టేబుల్ వెనుక ఉన్న ఆ చెయిర్‌లో కాసేపు కూర్చున్నాడు. పనిలో మునిగిపోతే ఆలోచనలేవీ దగ్గరకు రావు. పని లేనప్పుడే ఈ ఆలోచనలన్నీ ఒక్కుమ్మడిగా దాడిచేసి అశాంతికి లోనయ్యేలా చేస్తాయి. 'ఊహూం లాభంలేదు. ఇంటికెళ్లిపోవటం మంచిది' అనుకున్నాడు అతడు.

ఆఫీస్‌లాక్ చేసి లిఫ్ట్‌లో కిందికి దిగాడు.

పార్కింగ్ ప్లేస్‌వైపు నడుస్తుంటే సెక్యూరిటీగార్డ్ సెల్యూట్ చేశాడు. అతడు లాక్ తీసి డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాడు. రెడ్‌కలర్ మారుతికారు ముందుకు కదిలి, గేటుదాటి రోడ్డెక్కింది.

పావుగంట తర్వాత ఆ కారు ప్రకాష్‌నగర్‌లో విశాలమయిన ఆవరణలోనున్న రెండతస్థుల బిల్డింగ్ ముందు ఆగింది. అతడు కారు లాక్‌చేసి ఇంట్లోకి నడిచాడు.

హాలులోకి మెట్ల మీదుగా తన గదిలోకి వెళ్లబోతుంటే వెనుకనుండి చక్రాల చప్పుడు వినిపించింది. వెనువెంటనే ఆర్ద్రమైన పిలుపు, "వంశీ..."

అతడికి తల తిప్పకుండానే అర్థమయింది. తలతిప్పి చూస్తే వీల్ ఛెయిర్‌లో కూర్చుని తనవైపే చూస్తున్న కన్నతల్లి కనిపించింది. అతడు చిరునవ్వు పెదాలమీద కనపడేలా జాగ్రత్తపడుతూ అడిగాడు, "ఏమిటమ్మా?"

"ఆఫీసునుండి ఇప్పుడేనా రావటం?"

"అవును''

"సరే, స్నానం చేసి కిందికిరా. మీ నాన్నగారి దగ్గరే ఉంటాను''

అతడు తలాడించాడు. ఆమె వీల్‌ఛెయిర్ చేతులతో దొర్లిస్తూ హాలుకు ఆనుకుని ఉన్న





బెడ్‌రూమ్‌లోకి వెళ్లిపోయింది. అదే క్షణం అతడి పెదాల మీద చిరునవ్వు మాయమైపోయింది. నిశ్శబ్దంగా, నీరసంగా మెట్లెక్కి తన గదిలోకెళ్లి బెడ్ మీద వాలిపోయాడు. ఎంతసేపు గడిచినా లేవాలనిపించడంలేదు. అలాగే పడుకుండిపోవాలనిపిస్తోంది. అయినా తప్పదు. బాధ్యతలు లేవదీస్తున్నాయి.

మరో పది నిముషాల తర్వాత స్నానం ముగించుకుని కిందికి వచ్చాడు. ఆ బెడ్‌రూమ్‌లోకి అడుగుపెట్టబోతుంటే కొద్దిగా భయంలాంటి ఫీలింగ్ కలిగింది. అంతకు మించి బాధగానూ ఉంది. ఆ గదే ఓ బాధామయ ప్రపంచంలా కనిపిస్తుంటుంది తనకెప్పుడూ. వీల్ ఛెయిర్‌లో తల్లి, పెరాలసిస్ స్ట్రోక్‌తో బెడ్‌మీద తండ్రి...

గదిలోపలికి అడుగుపెట్టాడు.

బెడ్‌మీద పడుకుని ఉన్న యాభై ఐదేళ్ల ప్రభాకరరావు అతడిని చూసి ఆప్యాయంగా నవ్వాడు. ఆయన అలా నవ్వుతుంటే ముఖం వంకరపోయింది.

"కూర్చోరా!" అంది వీల్‌ఛెయిర్ మీదున్న పార్వతమ్మ. బెడ్ మీద కూర్చుని తండ్రి భుజం మీద చెయ్యివేశాడు తను. కళ్లూ కళ్లూ కలుసుకున్నా మాటలు కరువయ్యాయి. నోరు విప్పలేని తండ్రితో తనేం మాట్లాడగలడు? మాట్లాడినా ఆయన జవాబివ్వటం ఎలా సాధ్యం.

వంటమనిషి వరాలు కాఫీ తీసుకొచ్చి అతడికి అందించింది. "డాడీకి జ్యూస్ కూడా తీసుకురా'' చెప్పాడు అతడు.

"అలాగే బాబూ'' ఆమె గది దాటి వెళ్లి పది నిముషాల తర్వాత జ్యూస్ గ్లాస్‌తో లోపలికొచ్చింది.

అతడు బెడ్‌మీద ముందుకు జరిగి, తండ్రి తలను ఛాతీమీద ఉంచుకుని చేతిలోని గ్లాస్ ఆయన పెదవులకు తాకించాడు. ప్రభాకరరావు ఒక్కో గుక్కవేస్తూ జ్యూస్ తాగడం పూర్తిచేశాడు. తిరిగి ఆయనను ఎప్పటిలానే బెడ్‌మీద పడుకోబెట్టాడతను.

"అమ్మా! ముఖం కడుక్కుంటావా?" తల్లిని అడిగాడు.

పార్వతమ్మ తలాడించింది. అతడు ఆమె కూర్చుని ఉన్న వీల్‌ఛెయిర్‌ని తోసుకుంటూ బాత్‌రూమ్‌లోకి తీసుకెళ్లాడు. వాటర్‌టబ్ ఆమె ఒడిలో ఉంచి మగ్‌తో నీళ్లు దోసిలిలో పోశాడు. సబ్బు అందించాడు. ముఖం కడుక్కోవడం పూర్తయ్యాక టబ్‌ని దించి టవల్ ఆమె చేతిలో ఉంచాడు. పార్వతమ్మ ముఖం తుడుచుకుంది.

వీల్‌ఛెయిర్‌ని వారి బెడ్‌రూమ్‌లోకి తీసుకొచ్చాక అప్పటివరకూ అక్కడే ఉన్న వరాలుతో చెప్పాడు... "నాన్నగారికి భోజనం పట్రా''

పార్వతమ్మ గిన్నెలో అన్నం కలుపుకుని తినగలదు. కానీ ఆయనే తినలేడు. అందుకే కనుచీకటిపడగానే అతడు తండ్రికి భోజనం తినిపిస్తాడు. ఆ తర్వాత టాబ్లెట్స్ మింగించి పడుకోబెడతాడు.

ప్రభాకరరావుకి బెడ్‌షీట్ కప్పాక అతడు తల్లితోపాటు హాలులోకొచ్చాడు. అప్పటికే వరాలు టేబుల్‌మీద గిన్నెలు సర్ది ఉంచింది. వీల్‌ఛెయిర్ టేబుల్ ముందు ఆగింది. అతడు మరో కుర్చీలో కూర్చున్నాడు.

ఆ తల్లికి తన బిడ్డకు అన్నం వడ్డించి, గోరుముద్దలు తినిపించాలని ఉంటుంది. కాని వీల్‌ఛెయిర్‌లో కూర్చుని వంగి వడ్డించటం సాధ్యంకాదు. అతడు తనే తల్లికి వడ్డించి, ఆప్యాయంగా మాట్లాడుతూ భోంచేసేలా చేస్తాడు. ఆ ఆప్యాయతే లేకపోతే ఆ తల్లి తన స్థితికీ, తన భర్త పరిస్థితికీ కుమిలిపోతూ ఈసరికి మరోలోకం చేరుకుని ఉండేది.

తల్లి భోజనం ముగిసాక ఆమెను హాలుపక్కనే ఉన్న బెడ్‌రూమ్‌లోకి తీసుకెళ్లి, వీల్‌ఛెయిర్‌లో నుండి లేపి బెడ్ మీద పడుకోబెట్టాడు. కాసేపు ఆమెతో మాట్లాడాక "నేనిక వెళ్లి పడుకుంటానమ్మా'' అన్నాడు.

ఆమెకు కొడుకు తనతో మరికాసేపు మాట్లాడాలని ఉంది. కాని అతడి పరిస్థితి అర్థం చేసుకుని తలాడించింది.

వంశీ ఆ గదిలోనుండి ఇవతలికొచ్చి, మెట్లెక్కి తన గది చేరాడు. బెడ్‌మీద వాలితే బాధగా అనిపించింది. ఏదో అనీజీనెస్.. ప్రస్తుత పరిస్థితి తనమీద తనకే జాలి కలిగేలా ఉంది.

ఈ పరిస్థితికి కారణం ఏమిటి?

మూడేళ్లక్రితం నాటి సంఘటనలు అతడి కనుల ముందు కదలాడాయి.



ఆ ఉదయమే వంశీ ఢిల్లీ నుండి ఇంటికి ఫోన్ చేశాడు. పార్వతమ్మే ఫోన్ రిసీవ్ చేసుకుంది.

"అమ్మా! బాగున్నావా?"

"బాగున్నానురా. నువ్వక్కడ ఎలా ఉన్నావ్?"

"నాకేం హేపీగా ఉన్నాను. కాలేజీకి వెళ్లడం, రూమ్‌కి రావటం, చదువుకోవటం... అంతే'

"చదువు సంగతి అడగట్లేదు. యం.బి.ఏలో కూడా నా వంశీ గోల్డ్‌మెడల్ సంపాదిస్తాడని నాకు తెలుసు. నేను అడిగేది సరిగా తినటం, నిద్రపోవడం చేస్తున్నావా అని''

"ఆహా! సుష్టుగా భోంచేసి టైమ్‌కి నిద్రపోతున్నాను. ఆ విషయంలో నువ్వేం దిగులుపడక్కర్లేదు'' అతడు నవ్వాడు. "ఇంతకీ నాన్నగారెలా ఉన్నారు?"

"ఎప్పటిలానే క్షణం ఇంట్లో ఉండడంలేదు. నిద్రలేవడంతోనే ఫైల్స్ చూసుకోవటం, టిఫిన్ కాగానే ఆఫీసుకి పరుగులు, అర్ధరాత్రి వరకూ బిజినెస్ కాన్ఫరెన్స్‌లూ... అదీ ఆయన పద్ధతి. ఈ వయసులో కూడా అంతలా ఆత్రంగా పరుగెత్తడం ఎందుకో నాకయితే అర్థం కావటంలేదు''

అతడు మరోసారి నవ్వుకున్నాడు. తండ్రి గురించి ఎప్పుడడిగినా ఆ తల్లి చేసే కంప్లయింటే అది.

"సరే! నేను పెట్టేస్తాను'' అతడు లైన్‌కట్ చేయబోతుంటే అవతలనుండి వినిపించింది.

"రేయ్ వంశీ! ఉండ్రా... ఒక్క నిముషం"

"చెప్పమ్మా ఏంటి?"

"చెప్పడం మరిచాన్రా! ఈ రోజు నేను మీ మావయ్యగారి ఫ్యామిలీతో కలిసి తిరుపతి వెళుతున్నాను''

"తిరుపతికా?... మరి నాన్నగారు రావట్లేదా?"

"చెప్పానుగా! ఆయన ఆఫీసు వదలరని..."

"సర్లే! ఇంతకీ తిరిగి రాక ఎప్పుడు?"

"రెండు రోజుల్లోనే వచ్చేస్తాం"

"ఆల్‌రైట్ విష్ యూ హేపీ జర్నీ... ఉంటాను'' అతడు ఫోన్ పెట్టేశాడు.





అప్పటికి అతనిది ఆనందకరమైన జీవితం. ఏదో సాధించాలనే తపన తప్ప నిస్పృహాయత అనే పదం గురించి తెలియని పరిస్థితి. జీవితంలో సుఖమే తప్ప దుఃఖం ఉంటుందని తెలియని స్థితి.

మర్నాడు-

"వంశీజీ! ఆప్‌కో ఆంధ్రాసే ఫోన్'

వేకువ ఝామునే హౌస్‌ఓనర్ వచ్చి తలుపు తడుతుంటే తను ఆశ్చర్యంగా తలుపుతీశాడు. అంత వేకువఝామునే తనకు ఆంధ్రానుంచి ఫోన్ చేసేవాళ్లు ఎవరు? అతడు అయోమయంగా హౌస్‌ఓనర్ ముఖంలోకి చూశాడు.

హౌస్‌ఓనర్ ముఖం పక్కకు తిప్పుకుని "ఆయియే'' అంటూ ముందుకు నడిచాడు. అతడు ఆయన వెనుకనే వడివడిగా మెట్లు దిగి కిందికి వెళ్లాడు.

రిసీవర్ అందుకుని "హలో! నేను వంశీని మాట్లాడుతున్నాను'' అన్నాక అవతలివైపు నుండి వినిపించిన మాటలు అతడి నోట మాటరాకుండా చేశాయి. కనీసం రిసీవర్ హుక్‌మీద పెట్టాలన్న ఆలోచన కూడా అతడికి రాలేదు.

శిలా ప్రతిమలా అలాగే నిలబడిపోయిన వంశీని ఆశ్చర్యాందోళనలతో చూశాడు హౌస్ ఓనర్.

ఫోన్ వచ్చినప్పుడే ఏదో జరగరానిదే జరిగిందని అర్థమైపోయిందిగానీ ఏం జరిగిందో అర్థం కావడంలేదు. ఆయన మెల్లగా అతడి భుజం మీద చెయ్యివేసి "బేటా క్యా... క్యా సమాచార్?" అడిగాడు.

ఆ క్షణం అతడు బదులేం చెప్పలేకపోయాడు. నెమ్మదిగా ఈ లోకంలోకి వచ్చి రిసీవర్ హుక్‌మీద ఉంచి ఇంట్లో నుండి బయటకు నడిచాడు.

తన రూమ్‌లోకెళ్లి బట్టలు సర్దుకుంటుంటే వెనుకే అనుసరించి వచ్చిన హౌస్‌ఓనర్ మరోసారి అడిగాడు "క్యాబేటా! కుచ్ బాత్‌భీ నహీ బోల్‌రయా... క్యా హువా?"

అప్పుడు... అప్పుడొచ్చింది అతడికి దుఃఖం. ఒక్కసారిగా బరస్టయి భోరున ఏడ్చేస్తూ ఆ ఏడుపు మధ్యనే చెప్పాడు. "క్యా బోలుం చాచా! మమ్మీకో యాక్సిడెంట్ హువా! వో బాత్ సున్‌కే పితాజీకో పెరాలసిస్ స్ట్రోక్ ఆయా''

హౌస్‌ఓనర్ అతడిని సముదాయించడానికి చాలా కష్టపడవలసి వచ్చింది.

దుఃఖం నుండి తేరుకున్నాక అతడు ఎయిర్‌పోర్ట్‌కి బయలుదేరాడు. హౌస్‌ఓనర్ అతడి వెంట ఎయిర్‌పోర్ట్ వరకూ వచ్చాడు.

మరో మూడు గంటల తర్వాత అతడు హైదరాబాద్ ఎయిర్‌పోర్ట్‌లో దిగి తిన్నగా ఇంటికెళ్లాడు.

అప్పటికే అతడికోసం ఇంట్లో ఎదురు చూస్తున్న ఆఫీస్ మేనేజర్, అకౌంటెంట్ తదితరులు అతడిని తిన్నగా హాస్పిటల్‌కి తీసుకెళ్లారు.

హాస్పిటల్ గదిలోకి అడుగుపెడుతూనే అతడి కాళ్లు వణికాయి. గదిలోపలికెళ్లాక అటు చూస్తే స్పృహతప్పి కిందపడిపోతాననే మోననిపించింది. ఆఫీస్ మేనేజర్ అతడిని గట్టిగా పట్టుకున్నాడు.

పక్కపక్కనే ఉన్నాయా రెండు బెడ్‌లూ! ఒకదాని మీద పార్వతమ్మ పడుకుని మత్తుగా నిద్రపోతోంది. ఆమె ఆ మత్తులోనే లేకపోతే మోకాళ్లవరకూ తీసివేయబడిన తన కాళ్లను చూసుకుని హార్ట్‌ఎటాక్ వచ్చి చనిపోయి ఉండేది. లేదా 'బాబూ! నేనీ అవిటి బతుకు బతకలేను నాకింత విషం ఇచ్చి పుణ్యం కట్టుకో అంటూ చేతులు పట్టుకుని ఏడ్చి ఉండేది.

అతడు మెల్లగా తలతిప్పి తండ్రికేసి చూశాడు. ఆయన మత్తులో లేరు. వంపు తిరిగిన చేయిని, కదపలేని కాలును కళ్లతో చూపిస్తూ పెదాలను పళ్లతో కొరుక్కుంటున్నాడు. ఆయన అలా చూపిస్తుంటే ముఖం

వంకర తిరిగిపోయింది.

వంశీకృష్ణ ఒక్క అంగలో తండ్రి బెడ్ దగ్గరకు వెళ్లాడు. దుఃఖాన్ని కంట్రోల్ చేసుకునే ప్రయత్నం చేసినా 'ఆగను ఆగలేను' అంటూ ఏడుపు తన్నుకొచ్చేసింది.

"ఏమిటిది? ఎలా జరిగింది నాన్నా''

పెరాలసిస్ స్ట్రోక్‌లో కాలూ, చెయ్యితోపాటు నోరూ పడిపోయిన ప్రభాకరరావు ఆ ప్రశ్నకు జవాబు ఎలా చెప్పగలడు? అప్పటికీ ఏదో ఏదో చెప్పాలని ప్రయత్నం, నోరు తెరవాలని తాపత్రయం. అయినా ఊహూ! లాభం లేకపోయింది.

తండ్రి పరిస్థితి అప్పటికి పూర్తిగా అర్థం కావడంతో అతడు ఇక రోదనను ఆపుకునే ప్రయత్నం చేయలేదు.

ఆఫీస్ మేనేజర్ వంశీని పట్టుకుని బలవంతంగా రూమ్ నుండి కారిడార్‌లోకి తీసుకెళ్లాడు. అతడు చాలా సేపటి వరకూ ఏడుస్తూనే ఉండిపోయాడు. అసలు అలాంటి దృశ్యాన్ని చూడవలసి వస్తుందని కలలో కూడా అనుకోలేదు. చాలా సేపటి తర్వాత మాత్రం అతడు ఎలాగోలా ఆఫీస్ మేనేజర్‌ని అడగ్గలిగాడు. "ఇంత ఘోరం ఎలా జరిగిందండీ!"

"ఇప్పుడా విషయాలన్నీ ఎందుకు బాబూ! తర్వాత మాట్లాడుకుందాం. లే..." మరేదో చెప్పబోయాడు మేనేజర్.

"కాదు ఇప్పుడే చెప్పండి. ఇది ఎలా జరిగిందో నాకు తెలియాలి''

మేనేజర్ చిన్నగా నిట్టూర్చి చెప్పాడు. "మీ అమ్మగారు తన తమ్ముడితో కలసి తిరుపతి వెళ్తుంటే వరంగల్ సమీపంలో వేగంగా వచ్చే లారీ కారుని గుద్దింది. మీ మామయ్య కుటుంబం మొత్తం చనిపోయారు. మీ అమ్మగారికి కాళ్లు మోకాళ్లవరకూ నజ్జునజ్జయిపోయాయి. ఈ వార్త ఫోన్‌లో వినడంతోనే మీ నాన్నగారు షాక్ తిన్నారు. ఆయనకు బి.పి. పెరిగి కిందపడిపోవటమూ, చివరికి పెరాలసిస్ స్ట్రోక్ రావడమూ జరిగాయి. ఇక్కడికి తీసుకొచ్చిన వెంటనే డాక్టర్లు మీ అమ్మగారికి మోకాళ్లవరకూ కాళ్లు తీసేయకపోతే ప్రమాదమని చెప్పడంతో ఒప్పుకోక తప్పలేదు''

వంశీకృష్ణ రెండు చేతులతో ముఖం దాచుకున్నాడు. విధివక్రించడం అనే పదం తొలిసారిగా తనకు అనుభవంలోకి వచ్చింది. లేకపోతే ఆనందంగా గడిచిపోతున్న తమ జీవితాలలో ఈ అపశ్రుతి ఏమిటి? ఒక్కరోజు ఒకే ఒక్కరోజులో తమ జీవితాలు ఇలాంటి మలుపు తిరగడమేంటి?

అతడు హాస్పిటల్‌నుండి తన మామగారింటికెళ్లాడు.

ఆ ఇంటి పరిస్థితి మరీ ఘోరంగా ఉంది. ఇంటి వరండాలోనే పడుకోబెట్టబడి ఉన్నాయి మూడు శవాలు. మామయ్య, అత్తయ్య, తన మరదలు.. ఆ ఇల్లు అప్పటికే బంధుమిత్రులతో నిండిపోయి ఉంది.

ఇప్పుడు ఆ శవాలకు దహన సంస్కారాలు జరపవలసిన బాధ్యత తనదే! విధి ఎంత విచిత్రమయింది? హాస్పిటల్‌లో అమ్మానాన్నలు భయంకర పరిస్థితిలో ఉంటే వారిని వదిలి తను మరోచోట తప్పనిసరిగా దహన సంస్కారాలు జరపవలసి రావడం?

దహన సంస్కారాలు పూర్తయ్యాక అతడు తిరిగి హాస్పిటల్ కెళ్లాడు.

ఆ రాత్రి డాక్టర్స్‌ని కలుసుకుంటే వాళ్లు చెప్పారు.

"మీ అమ్మానాన్నలను మరో వారం రోజులలో డిశ్చార్జ్ చేసేస్తాం. వాళ్లు హాస్పిటల్‌లోనే ఉండి ట్రీట్‌మెంట్ తీసుకోవలసిన అవసరంలేదు. ఇంట్లోనే ఉండి టైమ్‌కి మెడిసిన్, సరయిన ఆహారం తీసుకోవడం జరిగితే చాలు. ముఖ్యంగా మీ నాన్నగారికి చక్కని ట్రీట్‌మెంట్ లభించి చక్కగా చూసుకునే వాళ్లుంటే పెరాలసిస్ నుండి త్వరగా కోలుకునే అవకాశం ఉంది. ఏదేమయినా




వాళ్లనిప్పుడు ఒకరు కనిపెట్టుకుని ఉండడం ఎంతో అవసరం.

"అలాగే డాక్టర్" తలాడించాడు వంశీకృష్ణ.

వారం రోజుల తర్వాత అతడు అమ్మానాన్నలను ఇంటికి తీసుకువచ్చాడు.

పార్వతమ్మకు మోకాలిమీద గాయం కాస్త మానాక ఆమెను వీల్ ఛెయిర్‌లోకి మార్చాడు. ప్రభాకరరావు పడక బెడ్‌రూమ్‌లోనే. ఆయన బెడ్ దిగి, కనీసం హాలులోకి కూడా రాలేని పరిస్థితి. ఇక వాళ్లకు కావలసిన మందులు అందించడం, వేళకు తిండి తినిపించడం, ఇతర పనులలో సహాయం చేయడం అన్నీ అతడే చూసుకుంటున్నాడు.

అలా కొద్దిరోజులు గడిచాక ఓ రోజు పార్వతమ్మ అతడితో అంది. "వంశీ! నీ చదువు అర్థాంతరంగా ఆగిపోవడం ఎందుకు? మా కష్టాలు మేం పడతాం. నువ్వు ఢిల్లీ వెళ్లి చదువు పూర్తిచేసుకునిరా"

వంశీ అదోలా నవ్వాడు.

"ఏమిట్రా అలా నవ్వుతున్నావ్?" అడిగిందామె.

"నాన్నగారు బెడ్‌మీద, నువ్వు వీల్‌ఛెయిర్‌లో జీవచ్ఛవాల్లా పడి ఉంటే నేను చదువు పూర్తిచేయగలనా అమ్మా?"

ఏం చెప్పాలో ఆమెకు కొద్ది క్షణాల వరకూ అర్థంకాలేదు. అప్పటికీ "అదికాదురా..." అంటూ ఏదో చెప్పబోయింది.

"ప్లీజ్ అమ్మా..." అతడు చెయ్యి చూపించి వారించాడు. "వద్దు నేను ఢిల్లీ వెళ్లినా, మనశ్శాంతిగా చదువు కొనసాగించలేను. ఇక్కడ మీరు ఏం కష్టాలు పడుతున్నారోనని, ఎలా బతుకు గడుపుతున్నారోనన్న ఆలోచనే నన్ను ఆ చోట నిలువనీయకుండా చేస్తుంది. అదీగాక ఇక్కడ మీకు టైమ్‌కి మెడిసిన్, ఆప్యాయంగా ఆహారం అందించేవాళ్లు ఎవరున్నారు? ఓ నర్స్‌ని అపాయింట్ చేసి నేను వెళ్లిపోతే ఆ నర్స్ మిమ్మల్ని సరిగా చూసుకుంటుందన్న నమ్మకమేముంది? అందుకే..." అతడు కొద్ది క్షణాలు గ్యాప్ తీసుకున్నాక చెప్పాడు, "అందుకే నేనిక చదువు ఆపేయదలచుకున్నాను"

"రేయ్ వంశీ... వద్దురా"

"ప్లీజ్ అమ్మా! ఈ విషయంలో నన్ను వత్తిడి చేయొద్దు"

పార్వతమ్మ కొడుకుకేసి జాలిగా చూసింది.

అప్పటికే అతడు మరో నిర్ణయమూ తీసుకుని ఉన్నాడు. అయితే అతడు ఆ నిర్ణయం గురించి అప్పుడే ఆమెకు చెప్పదలచుకోలేదు. ఆ నిర్ణయం వింటే ఆ తల్లి మరింత క్రుంగిపోతుందని అతడికి తెలుసు.

★ ★ ★

"నీ పద్ధతేం బాగోలేదు వంశీ"

తలెత్తి రేణుక ముఖంలోకి చూశాడు వంశీ. తెచ్చిపెట్టుకున్న కోపమే అయినా ఆమె ముఖం ఎర్రబడి ఉంది. ఆమె కోపం చూస్తే అతడికి నవ్వొచ్చింది. కానీ నవ్వలేదు. తను నవ్వితే ఆమెకు ఉక్రోషం ముంచుకొస్తుందని అతడికి తెలుసు.

"ఏ విషయంలో?" ఆమె ఏ విషయంలో తనను అలా అన్నదో తెలిసినా అడగాలనే అడిగాడు అతడు.

"మరేదో విషయమైతే నేనెందుకింత సీరియస్‌గా మాట్లాడతాను. నేను నీతో సీరియస్‌గా మాట్లాడేది ఒకే ఒక్క విషయంలో" అని ఆగాక అతడి ముఖంలోకి సూటిగా చూస్తూ చెప్పింది "అది నీ పెళ్లి గురించి"

వంశీకృష్ణ కుర్చీలో వెనక్కు వాలుతూ చిన్నగా నవ్వాడు. అయితే జవాబు మాత్రం చెప్పలేదు. చిరునవ్వే జవాబుగా భావించమని ఆ నవ్వుకి అర్థం.

అతడలా చేయడం ఆమెకు మరింత కోపాన్ని కలిగించినట్టుంది. "ఇదిగో ఇదే... ఇదే నేనొద్దనేది. అసలు ఇది నీకు బాగా అలవాటయిపోయిందీమధ్య నేను నీ పెళ్లి

టాపిక్ తీసుకొస్తే చాలు, మౌనంగా నవ్వే స్తావ్. ఇప్పటివరకూ పోనీలే అని నువ్వు నవ్వేస్తున్నా ఊరుకున్నాను. ఇక ఈ రోజు మాత్రం ఊరుకోను. ఏదేమయినా ఈరోజు నీ మనసులోని మాట చెప్పి తీరవలసిందే. ఆ విషయం తేలందే నిన్ను వదలనుగాక వదల ను''

"వాట్ రేణూ! మీ ఫ్రెండ్‌నేదో వదలను గాక వదలను అంటూ నిలదీస్తున్నావ్. అస లింతకీ అతడు అంత పెద్ద తప్పేం చేశా డు?"

వెనుకనుండి వినపడిన మాటలకు వారిద్ద రూ వెనుతిరిగి చూసేంతలో రఘురామ్ వారి ముందుకే వచ్చి వారి ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చున్నాడు.

రేణుక భర్త రఘురామ్. వారి పెళ్లయి ఆరేళ్లయింది.

వంశీ, రేణుక కాలేజీలో క్లాస్‌మేట్స్. అప్పట్లో కాలేజీ స్టూడెంట్స్ రేణుకను కాలేజీ బ్యూటీ అనేవాళ్లు. ఎవ్వరితోనూ సరిగా పలకని వంశీ రేణుకలకు ఎలాగో స్నేహం మొదలయింది. క్లాసెస్ అయిపోయాక వారి ద్దరూ కలసి కాలేజీ ఆవరణలోనే ఏదో ఓ చోట కూర్చుని కబుర్లు చెప్పుకునేవాళ్లు!

స్టూడెంట్స్ వారిద్దరి స్నేహం గురించి రకరకాలుగా చెప్పుకోవడం మొదలయింది. వాళ్ళు ప్రేమలోపడ్డారని, బహుశా పెళ్ళిచే సుకోవడం జరుగుతుందని అనుకున్నా రంతా.

డిగ్రీ అయిపోయాక వంశీ పోస్ట్‌గ్రాడ్యుయే షన్ కోసం ఢిల్లీ వెళ్ళిపోతే ఆమె హైదరాబాద్ లోనే పోస్ట్‌గ్రాడ్యుయేషన్ చేసింది. సెలవులకొ చ్చినప్పుడు అతడు తను యం.బి.ఏ. చేయా లనుకుంటున్నట్టు ఆమెకు చెపితే, ఆమె మా త్రం తనకు ఇంట్లో పెళ్ళి చేయాలని ప్రయ త్నిస్తున్నట్టు అతడికి చెప్పింది. అతడు ఆమెకు 'కంగ్రాట్స్' చెప్పాడు.

రేణుక, రఘురామ్‌ల పెళ్ళి జరిగిపో యింది. వంశీ ఆమె పెళ్ళికి హాజరయ్యాడు. అంతేకాదు, ఆమె అత్తారిల్లు కూడా హైదరా బాద్‌లోనే కావడంతో ఢిల్లీ నుండి హైదరా బాద్ వచ్చిన ప్రతిసారీ వాళ్ళింటికి వెళ్ళేవా డు అతడు.

మూడేళ్ళక్రితం ఆ విపత్తు జరిగి అతడు హైదరాబాద్‌లోనే ఉండిపోయాక ప్రతి ఆది వారం ఆ ఇంటికి రావడం కాసేపు రేణుకతో మాట్లాడడం అలవాటయిపోయింది. వారి స్నేహం తెలిసినవాడు కావడంతో రఘురామ్ కూడా అతడిని ఆప్యాయంగా పలకరిస్తాడు. వీలయితే తనూ వారితో కా సేపు కూర్చుని మాటలు కలుపుతాడు.

రేణుక రఘురామ్‌కి కంప్లయింట్ చేస్తున్న ట్లు చెప్పింది. "ఏమండీ! వంశీ వయసు ఎంతనుకుంటున్నారు? ఇరవై ఆరేళ్ళు. ఇప్ప టికే తన ఈడు వాళ్ళందరికీ పెళ్ళిళ్ళయిపో యాయి. తన పెళ్ళి ప్రస్తావన తీసుకువస్తే చాలు నవ్వి ఊరకుండిపోతాడు. అందుకే ఈరోజు తాడో, పేడో తేల్చుకుని అతడి మనసులోని మాట తెలుసుకోవాలనుకుంటు న్నాను''

అప్పటివరకూ మౌనంగా ఉన్న రఘురామ్ అన్నాడు. "రేణూ చెప్పిన మాట ల్లో చాలా నిజం ఉంది వంశీ! నీ మనసులో ఏముందో నాకూ తెలియదుగానీ, పెళ్ళి విష యంలో నువ్విలా స్థబ్దంగా ఉండిపోవడాన్ని మాత్రం నేను ఒప్పుకోలేను... పోనీ ఈ విషయమైనా చెప్పు. నువ్వెవరినయినా ప్రే మించి ఫెయిలయ్యావా?"

వంశీ నవ్వేశాడు. "భలేవారే సార్! అలాటి వేమయినా ఉంటే నేనే మీకు చెప్పి ఉండేవాడిని''

"మరెందుకిలా?"

ఒక్కక్షణం... కేవలం ఒక్కక్షణంలోనే, తన మనసులోని అనుమానం ఆ అనుమా నంతో తను తీసుకున్న నిర్ణయం వారికి చెప్పేద్దామా అనిపించింది. అయితే వారా అనుమానాన్ని నిరాధారమని కొట్టేసి, తన





మనసును పెళ్ళివైపు మళ్ళేలా చేస్తారు. అది నిజం.

అందుకనే అతడు అన్నాడు. "సార్! ప్రస్తుతానికి నన్ను వత్తిడి చేయకండి. నేను పెళ్ళి ఎందుకు వద్దంటున్నానో, చెప్పే సమయం వస్తే తప్పక చెపుతాను''

రేణుక, రఘురామ్‌లు ముఖాలు చూసుకున్నారు. రఘురామ్ భుజాలెగరేసాడు. "ఆల్‌రైట్ రేణూ! ఓ మనిషి పర్సనల్ ఫీలింగ్స్, చెప్పాలనిపిస్తే తప్ప వత్తిడి చేస్తే బయట కురావు. వంశీ, తనేదో మనసులో మధనపడుతున్నట్టుగా ఉంది. ఆ బాధకు కారణం మనకు తెలియదు. అతడిని ఈవిధంగా ఇబ్బంది పెట్టడమూ సరికాదు...సమయం వస్తే తనే తెలియ చేస్తానంటున్నాడుగా!"

రేణుక ముఖంలో అసంతృప్తి కదలాడింది. అయినా మౌనంగా తలాడించింది. ఆ తర్వాత సీరియస్‌గా వంశీకేసి చూసింది. ఆమె చూపులు గమనించి వంశీ తల తిప్పుకుని మరెటో చూడసాగాడు.

అర నిముషం తర్వాత రఘురామ్ లేచి "నేను పురుషోత్తమ్ ఇంటివరకూ వెళ్ళొస్తాను'' అన్నాడు.

పురుషోత్తమ్ సిటీలో నంబర్‌వన్ కార్డియాలజిస్ట్. రఘురామ్, పురుషోత్తమ్‌లు ఒకే ప్రైవేట్ ఆసుపత్రిలో స్పెషలిస్ట్ డాక్టర్స్‌గా పనిచేస్తున్నారు.

రేణుక తలాడించింది.

"ఆల్ రైట్ వంశీ! మనం మళ్ళీ కలుద్దాం" రఘురామ్ అతడితో చెయ్యి కలిపాక వెళ్ళిపోయాడు.

రఘురామ్‌కు వారిద్దరి మీద నాలుగైదు సంవత్సరాలు ఎక్కువ వయసు ఉంటుంది. అందుకే ఆయన 'వంశీ' అంటూ చనువుగా పిలిచినా వంశీ మాత్రం ఆయనను 'సార్' అంటూ గౌరవిస్తాడు.

రేణుక రఘురామ్ వెళ్ళిపోయిన రెండు నిముషాల తర్వాత కుర్చీలో నుండి లేచి ఇంట్లోకెళ్ళింది. ఐదునిముషాల తర్వాత ట్రేలో బిస్కెట్స్ ప్లేట్, ఫ్లాస్క్‌లో కాఫీ పట్టుకొచ్చింది.

బిస్కెట్స్ తింటూ ఉండగా చిన్నగా నిట్టూరుస్తూ పలికింది. "ఏమిటో వంశీ! మన జీవితాలు మనం కోరుకున్నట్టు సాగితే ఎంత బాగుణ్ణు కదా అనిపిస్తుంటుంది నాకు''

"నిజమే'' బలవంతంగా నవ్వాడు అతడు.

"అందుకేగా అన్నారు తలచినదే జరిగినదా దైవం ఎందులకు? జరిగినదే తలచితివా శాంతి లేదు నీకు?"

ఆమె చిరుకోపంతో అతడికేసి చూసింది "ఈ స్థితిలో కూడా జోకులా?"

"విషాదంలోనే కదా మనిషికి రిలీఫ్ కావలసింది'' అనబోయి, తను ఆ మాట అంటే 'అయితే నీలోనూ విషాదం దాగిఉందన్న మాట' అని ఆమె అనగలదనిపించి పెద్దగా నవ్వాడు "జస్ట్‌ఫర్ ఫన్'

ఆమె మరేం మాట్లాడలేదు. ఇద్దరికీ కాఫీ తాగడం పూర్తయింది.

అతడు లేస్తూ "నేను వెళ్ళొస్తాను రేణూ'' అన్నాడు.

"అప్పుడే ఇంటికెళ్ళి ఏంచేస్తావ్?"

"అమ్మానాన్నలు నాకోసం ఎదురుచూస్తూ ఉంటారు. ఆదివారం రోజయినా నేను వారితో ఎక్కువసేపు గడపాలని కోరుకుంటారు''

ఆమె అతడికేసి జాలిగా చూసింది.

అతడు కారు దగ్గరగా నడుస్తుంటే అనుసరించి వచ్చిన ఆమె అతడితో చెప్పింది. "వంశీ! పెళ్ళి గురించి నీ మనసులోని మాట నాకు చెప్పనవసరంలేదుగానీ, ఒక్కమాట మాత్రం గుర్తుపెట్టుకో. మనం 'సంఘం'లో బతుకుతున్నాం. మనం ఎవ్వరినీ నొప్పించక మన పని మనం చూసుకుంటూ బతుకుతుండొచ్చు. అయినా సరే సంఘం

కళ్ళన్నీ మనమీదే ఉంటాయి. ఆస్తి అంతస్తు అన్నీ ఉన్న వ్యక్తి పెళ్ళిచేసుకోలేదంటే ఈ సంఘం రకరకాలుగా ఊహించుకుంటుంది. అనుమానంగా నీకేసి చూస్తూ, అనేక విధాలుగా అనుకుంటుంది. మనం ఏ పనిచేసినా సంఘాన్ని, సమాజాన్ని మరచిపోకూడదని గుర్తుంచుకో''

వంశీ కారు డ్రైవింగ్ సీట్లో కూర్చుని తలుపేసుకుంటూ అన్నాడు. "నీ మాటలలో నిజం ఉంది. కాదనను. కాని నాదీ ఒక్క మాట- రేణూ! నేను చేయదలచుకున్నది చేస్తాను. నా అంతరాత్మకి నేను జవాబు చెప్పుకుంటాను. ఎట్టిపరిస్థితుల్లో సంఘానికి నేను జవాబు చెప్పను''

కారు డోర్ వేసేసుకున్నాడు. ఇంజన్ స్టార్టయింది. "బై రేణూ! నెక్స్ట్ సండే వస్తాను. గుడ్‌నైట్..." కారు ముందుకు కదిలింది.

గేటు దాటుతున్న కారును కొద్దిక్షణాలపాటు అలాగే చూస్తుండిపోయింది.

కారు కనుమరుగయ్యాక ఇంట్లోకి నడిచింది.

మరో పావుగంట తర్వాత,

కారు తన ఇంటి వీధిమలుపు తిరుగుతుండగా వంశీ అటు చూశాడు. తన ఇంటిపక్కనే ఉన్న, చిన్న పెంకుటింటిలోకి ఎవరో అద్దెకు దిగుతున్నట్టున్నారు. ఆ ఇంటి ముందు సామానుతో నిండి ఉన్న లారీ ఆగి ఉంది. ఇద్దరు కూలీలు సామాను ఇంట్లోకి మోస్తున్నారు.

అతడి కారు లారీని దాటుకుని పక్కనే ఉన్న రెండంతస్థుల మేడముందు ఆగింది.

★ ★ ★

వేకువఝామునే నిద్రలేవడం వంశీకి అలవాటు.

నాలుగింటికే నిద్రలేచి వాష్‌బేసిన్ దగ్గరకెళ్ళి ముఖం కడుక్కున్నాడు. టవల్‌తో ముఖం తుడుచుకుంటూ కిటికీ దగ్గరకు వచ్చి కర్టెన్ పక్కకు లాగాడు. చూపులు అటుగా సాగి, ఆ చోట ఆగి కదలనంటూ మొరాయించాయి.

వంశీ అక్కడే నిలబడిపోయి అటే చూడసాగాడు.

ఆమెకు ఇరవైరెండేళ్ళ వయసు ఉండొచ్చు. చంద్రకాంతిలో వెన్నెలకన్య ఎవ్వరూ చూడని వేళలో వచ్చి ఆ ఇంటిముందు ముగ్గులేస్తున్నట్టే ఉంది.

అప్పటికి ఆ వీధిలో ఎవ్వరూ నిద్రలేవలేదు. ఇళ్ళగోడల మధ్య చీకటి చిక్కగా పరుచుకుని ఉండటం కనిపిస్తూనే ఉంది. అయితే బయట మాత్రం మల్లెపువ్వులు లోకం మీదకు చల్లినట్టు వెన్నెల తెల్లగా పరుచుకుని ఉంది.

అతడు అలాగే కిటికీకి భుజం ఆన్చి ఓ అపురూప దృశ్యాన్ని చూస్తున్నట్టు అటే చూస్తుండిపోయాడు.

వాలుజడ భుజం మీదనుండి నేలకు జారిపోతుంటే, ఆమె తల ఎగరేస్తోంది. ఆమె చేతివేళ్ళ సందులనుండి ముగ్గు సన్నగా జారి చక్కటి గీతలతో నేలతల్లిని అలంకరిస్తున్నట్టుంది.

ఎవరామె?!

అతడు చాలాసేపు అలాగే నిలబడి ఆలోచిస్తుండిపోయాడు. తర్వాత అతడికి గుర్తొచ్చింది నిన్న సాయంత్రం తను రేణుక ఇంటినుండి వస్తున్నప్పుడు, ఆ ఇంట్లోకి లారీలోనుండి సామాను దించి చేరవేయడం! అతడు నెమ్మదిగా తలాడించాడు. కొత్తగా ఈ ఇంట్లోకి అద్దెకు దిగారు కాబోలు అనుకున్నాడు మనసులోనే.

ఆమె ఓ నిముషం తర్వాత లేచి కొద్దిసెకనులపాటు తను వేసిన ముగ్గును పరిశీలనగా చూసుకున్నాక సంతృప్తిగా నవ్వుకుంది. 'ఆ నవ్వు చాలా చాలా అందంగా ఉంది' అనుకోకుండా ఉండలేకపోయాడు అతడు.

మరో నిముషం తర్వాత ఆమె ఇంట్లోకి వెళ్ళిపోయాకే అతడు కిటికీ దగ్గరనుండి




ఇవతలకు వచ్చాడు.

ఏదో తెలియని ఉత్సాహం మదిలో ప్రవేశించడంతోనే అతడు హుషారుగా టేబుల్ ముందు కూర్చుని బిజినెస్ ఫైల్స్ తిరగేయడం మొదలుపెట్టాడు.

ఉదయం నిద్రలేవగానే సుందర దృశ్యం చూసినా, చక్కని సంగీతం విన్నా మనసు ఆనందపడుతుందెవరికైనా. ఆ ఆనందం రోజంతా ఆహ్లాదకరంగా గడిచిపోయేలా చేస్తుంది.

ప్రభాకరరావు రియల్ఎస్టేట్ బిజినెస్ చేసేవారు. సిటీ సరిహద్దుల్లో ఖాళీస్థలాలను తక్కువ రేటుకి కొనుగోలు చేసి, వాటిని ఫ్లాట్స్‌గా విభజించి కనీస సౌకర్యాలు కల్పించి ఎక్కువరేట్లకు అమ్మేవారు. అది చాలా లాభసాటి వ్యాపారంగా మారటంతో ఆయన లక్షలు సంపాదించారు.

ఊహించని విపత్తు సంభవించి ప్రభాకరరావు మంచమెక్కి ఉండకపోతే, లక్షలలోని వ్యాపారం కోట్లలోకి తీసుకెళ్ళేవాడే అంటుంటారు ఆయన స్నేహితులు. అయితే బిజినెస్ వ్యవహారాల్లోకి అడుగుపెట్టిన నాలుగు నెలల్లోనే వంశీని తండ్రికి తగ్గ తనయుడిగా గుర్తించారు అందరూ.

వంశీ రియల్ ఎస్టేట్ బిజినెస్ చేస్తూనే మరోవైపు హాలీడే రిసార్ట్స్‌కి రూపకల్పన చేశాడు. ఒక వ్యక్తి ఏక మొత్తంగా పాతికవేలు చెల్లిస్తే, ఆ వ్యక్తి కుటుంబం సంవత్సరంలో ఓ వారంరోజులపాటు దేశంలో అనేక విహార ప్రదేశాలలో కంపెనీ కట్టించి ఉంచిన హాలీడే రిసార్ట్స్‌లో ఉచితంగా బసచేయొచ్చు. అలా ఆ వ్యక్తి కుటుంబానికి జీవితాంతం ఉచితంగా ఆ బస సౌకర్యం లభిస్తూనే ఉంటుంది. పాతికవేలతో జీవితాంతం వారంరోజులపాటు ఉచితంగా ఓ విహారస్థలంలో గడపడం పాతికవేలు పెట్టుబడి పెట్టిన వారికి కూడా లాభసాటిగానే అనిపిస్తుంది. మరి ఈ రిసార్ట్స్ బిజినెస్ చేసేవారికి లాభం ఏమిటి? కంపెనీ ఓ వెయ్యిమంది దగ్గర పాతికవేల చొప్పున వసూలు చేస్తే వచ్చే మొత్తం రెండున్నర కోట్ల రూపాయలు! ఆ మొత్తం తోనే వారు రిసార్ట్స్ నిర్మిస్తారు. రిసార్ట్స్‌లో సగం సభ్యులకోసం కేటాయించినా మిగిలిన సగం బిజినెస్ చేస్తారు. అంటే ప్రజల డబ్బుతో ప్రజలకే సదుపాయాలు కలిగించటమన్నమాట. ఒకవిధంగా ఇది అటు కంపెనీకి, ఇటు సభ్యుడికి కూడా మేలు కలిగించే పథకం.

ఏ బిజినెస్‌లోనయినా తొలుత అడుగుపెట్టినవాడు బాగా సక్సెసవుతాడు. ఇతరులు ఆ బిజినెస్ గురించి తెలుసుకుని లాభనష్టాలు బేరీజు వేసుకునేప్పటికే మొదటివాడు వీరందరికీ అందనంత దూరంలోకి వెళ్ళిపోతాడు.

వంశీ ఈ రిసార్ట్స్ బిజినెస్‌లోకి అందరికన్నా ముందు అడుగుపెట్టడంతో కోట్లు సంపాదించాడు. దాంతో బిజినెస్ వర్గాల్లో అతడి పేరు మారుమోగిపోయింది. అతడిని తమ అల్లుడిగా చేసుకోవాలని చాలామంది ప్రముఖులు ప్రయత్నించారు. అయితే అతడు అందరి ప్రయత్నాలకూ ఆరంభలోనే గండికొట్టి, తనకు ఇప్పట్లో పెళ్ళిచేసుకునే ఉద్దేశ్యమే లేదని ప్రకటించాడు.

అతడు ఫైల్స్ తిరగేస్తూ చాలాసేపు తన లోకంలో తను ఉండిపోయాడు. ఆ తర్వాత తలెత్తి కిటికీలోనుంచి చూస్తే సూర్యోదయమవుతోంది. లోకానికి మేలుకొలుపు పాడుతూ సూర్యుడు తూర్పుదిక్కునుండి పైపైకి లేస్తున్నాడు.

వంశీ కుర్చీలోనుండి లేవబోతుంటే, తలుపు దగ్గర చప్పుడయింది. అతడు తలతిప్పి అటు చూస్తే కాఫీ కప్పుతో వరాలు లోపలికొస్తూ ఉంది.

అతడు ఆమె చేతిలోనుండి కాఫీ కప్పు అందుకున్నాక అడిగాడు "అమ్మా నాన్న నిద్రలేచారా?"

వరాలు తలూపింది "లేచారుబాబుగా

రూ''

అతడు కొద్దిగా తటపటాయించాక అడిగాడు. "మన పక్కింట్లో ఎవరో అద్దెకి దిగినట్టుంది కదూ వరాలూ?"

"అవును బాబూ! వారిది కాకినాడ అట. ఆ అమ్మాయి పుత్తడిబొమ్మలా ఉంది. అతగాడేమో తుమ్మమొద్దులాగున్నాడు'' ప్రశ్నకు జవాబే కాదు, మరో రెండు విశేషాలు జోడించి చెప్పింది వరాలు.

అతడు మౌనంగా తలాడించి కాఫీ సిప్ చేయడం మొదలుపెట్టాడు. వరాలు వెళ్ళిపోయింది. అతడు కాఫీ కప్పు పట్టుకునే కిటికీ దగ్గరగా నడిచాడు. అటుచూస్తే పెరట్లో ఉంది ఆ...మె! బావి ముందు కూర్చుని అంట్లగిన్నెలు కడుక్కుంటోంది.

వంశీ చాలాసేపు అక్కడే నిలబడ్డాడు. కాఫీ తాగడం పూర్తయింది. కప్పు టేబుల్ మీద పెట్టేందుకు ఆచోటు నుండి కదలబోతుంటే అప్పుడే పెంకుటింట్లో నుండి ఓ వ్యక్తి ఇవతలకు వచ్చాడు. అతడి అడుగు ముందుకు పడకుండా ఆగిపోయింది.

నల్లగా ఉన్నాడు ఆ వ్యక్తి 'వరాలు చెప్పినట్టు తుమ్మమొద్దే ఇతడు. కాకిముక్కకు దొండపండు సామెత. ఈ జంట విషయంలో చక్కగా సరిపోతుంది' మనసులోనే అనుకున్నాడు అతడు. ఆ క్షణం అతడికి ఆమెమీద కాసింత జాలిలాంటిది కలిగింది. కాని అంతలోనే 'బాహ్యరూపంతో సంబంధమేముంది! తన పిచ్చిగానీ, ఆ వ్యక్తి ఆత్మసౌందర్యం గొప్పదై ఉండొచ్చు కదా? భార్యా భర్తల మధ్య ఉండవలసింది అందాలపోటీ కాదు అభిమానం, ఆప్యాయతల కలయికే వారి బంధాన్ని పదిలపరుస్తుంది...' అని సరిపెట్టుకోవలసిన అవసరమూ కలిగింది అతడికి.

వంశీ కిటికీ దగ్గరనుండి వచ్చేశాడు. మెట్లు దిగి కిందికెళ్ళి ఆ గదివైపు నడిచాడు.





ఆ గదిలోకి అడుగుపెట్టబోతూ అటు చూసేసరికి, మనసంతా ఏదోలా అయిపోయింది.

వీల్ ఛెయిర్‌లోనున్న పార్వతమ్మ బాగా ముందుకు వంగి భర్తకు బ్రష్ చేస్తోంది. ఆమె కొద్దిగా బాలన్స్ తప్పినా సరే, వీల్‌ఛెయిర్‌తో సహా ముందుకు పడడం ఖాయం. కాళ్ళు లేకుండా మరొకరిమీద ఆధారపడి బతుకు గడుపుతున్న ఆమె, అప్పుడప్పుడూ తనకు సాధ్యమయినంతలో భర్తకు సేవచేసుకోవాలని ప్రయత్నించడం అతడు గమనిస్తూనే ఉన్నాడు. అలా చేయొద్దని వారించినా వినదు. భర్త పనులు తనే స్వయంగా చేయాలనే తపన మానుకోదు.

అలాంటి దృశ్యం ఎప్పుడయినా కనులబడితే, తన మనసులో కలిగే ఫీలింగ్ ఏమిటో తనకే తెలియదు. అది బాధా? లేక స్త్రీజాతి ఔన్నత్యాన్ని చూపినందువలన కలిగే సంతృప్తా!! లేక రేపటి తన భవిష్యత్ గుర్తొస్తే కలిగే గగుర్పాటా?!! ఏమిటా ఫీలింగ్?! ఏదేమయినా అలాంటి సమయంలో తల్లికి చేతులెత్తి నమస్కరించాలనిపిస్తుందతనికి.

"అమ్మా''

భర్తకు బ్రష్ చేస్తున్న పార్వతమ్మ తల తిప్పి చూసింది.

"ఇలా ఎందుకు చేయడం? నేను వస్తాను కదా!"

"అదికాదురా''

"మరేం చెప్పకూ? ఇలా ముందుకు వంగితే పడిపోతావ్. ఆ తర్వాత వీల్‌ఛెయిర్లలో కాక నువ్వూ నాన్నగారి పక్కనే పడుకోవలసి ఉంటుంది''

ఆమె ముఖం నల్లగా మాడిపోయింది. అది చూశాక వంశీకి తను అలా మాట్లాడి ఉండకూడదనిపించింది.

వంశీ బెడ్‌మీదకు చేరుకుని తండ్రిని మరికాస్త పైకిలేపి, తన ఛాతీకి ఆయన వీపానేలా చేశాడు. ఆయన నోట్లో ఉన్న బ్రష్‌ను కుడిచేత్తో పట్టుకుని కదిలించసాగాడు. ఆ తర్వాత ఆయనను రెండు చేతులతో ఎత్తుకుని బాత్‌రూమ్‌లోకి తీసుకెళ్ళాడు.

తల్లిదండ్రుల పనులు పూర్తిచేసేసరికి గంటకుపైగా అయింది.

అతడు మెట్లెక్కి తన గదిలోకి వెళ్ళి, స్నానం పూర్తిచేశాడు. అప్పటికే వరాలు టిఫిన్ రెడీ చేసి ఉంటుంది. అతడు తల్లితో కలిసి టిఫిన్ తినడం పూర్తిచేశాక, వారిద్దరికీ మెడిసిన్స్ ఇచ్చాడు. తండ్రి చేత జ్యూస్ తాగించాడు.

మరో పావుగంట తర్వాత ఇంట్లోనుండి బయటకు నడిచి, పోర్టికోలోని కారు ఎక్కాడు.

తమ ఆఫీసున్న కమర్షియల్ కాంప్లెక్స్ ముందు కారు లాక్ చేసి అతడు లిఫ్ట్‌లో ఫోర్త్‌ఫ్లోర్‌కి వెళ్ళాడు.

ఆఫీసులో అడుగుపెట్టేసరికి రిసెప్షన్‌లో ఉన్న అహల్య లేచి "గుడ్ మార్నింగ్ సార్' అంది. అతడు తలాడించి తన ఛాంబర్‌లోకి వెళ్ళిపోయాడు.

అతడు తన సీటులో కూర్చున్న ఐదుని ముషాల తర్వాత అహల్య లోపలికొస్తూ "మే ఐ కమిన్ సార్' అంది.

"యస్ కమిన్'

ఆమె లోపలికొచ్చాక అతడి ఎదురుగా నిలబడి అడిగింది. "డిక్టేట్ చేయాల్సిన లెటర్స్ ఉన్నాయా సార్'

అతడు తల అడ్డంగా ఆడించాక చెప్పాడు. "ఈ నెలలో ఇన్‌కంటాక్స్ వారికి అకౌంట్స్ సబ్‌మిట్ చేసి క్లియరెన్స్ సర్టిఫికేట్ తెచ్చుకోవాలి. సో! మన అకౌంట్స్ డిపార్ట్‌మెంట్ వాళ్ళకి ఫైనల్ అకౌంట్స్ రెడీ చేయమని చెప్పండి... దెన్' అతడు ఆలోచించుకోవడం మొదలెట్టాడు.

"అలాగే సార్'

"...ఈ పేపర్స్‌ని ఈ ఫైల్లో కాస్త ఫైల్ చేయండి'' అతడు టేబుల్ మీదున్న ఫైల్ అందించబోతుంటే ఆమె కాస్త వంగింది. ఆ కాస్తకే ఆమె ఎదమీద నిలవలేనన్నట్టు పైట కాస్తా జారి టేబుల్‌మీద పడింది. అహల్య వెంటనే సర్దుకునే ప్రయత్నం చేయలేదు. ఫైల్ అందుకున్నాకే, పైట సర్దుకుంటూ, "సారీ సర్' అంది.

కాని అప్పటికే ఆమె ఎత్తయిన ఎద సంపదమీద అతడి చూపులు అరసెకనుసేపు నిలిచాయి. సంస్కారం హెచ్చరించడంతో అతడు వెంటనే తల తిప్పుకున్నాడు. అహల్య అప్పుడప్పుడూ తన ముందు పైట జార్చడం అతడు గమనిస్తూనే ఉన్నాడు. అయినా వ్యవహారం ఇంకా శృతిమించలేదని చూసీ చూడనట్టు మసలుకుంటున్నాడు.

ఫైల్ తీసుకున్నాక అహల్య ఇవతలికొచ్చింది. పేపర్స్ ఫైల్ చేస్తుండగా ఫోన్ మోగింది. అది బిజినెస్ ఫోన్ కాదు. ఆమెకు వచ్చిన పర్సనల్ ఫోన్, అవతలివైపు మాట్లాడేది ఆమె స్నేహితురాలు.

ఆ స్నేహితురాలు కాసేపు అవీ ఇవీ మాట్లాడాక అడిగింది, "ఇంతకీ మీ బాస్ ముందు నేను చెప్పిన ప్రయత్నాలు ప్రారంభించావా?"

"ఆс! ప్రారంభించాను'' నీరసంగా బదులిచ్చింది అహల్య.

"మరి ఫలితమేమయినా ఉందా?"

"ఫలితమా?" ఈసారి నిట్టూర్పులా నవ్విందామె. "అతడు నా చర్యలు గమనిస్తున్నట్టే ఉంటుంది కాని ముఖంలో ఎక్స్‌ప్రెషన్స్ మాత్రం పలకవు. ఆ వైపు నుండి కాసింతయినా రెస్పాన్స్ కనిపిస్తే మనం మరో అడుగు ముందుకేయొచ్చు. ఆవైపు నుండి రెస్పాన్స్ లేకుండానే అడుగేయాలంటే మాత్రం భయంగా ఉందే''

అవతలివైపు గొంతు పలికింది, "కాస్త రిస్కయినా ధైర్యం చేయవే. నేను చూడు, ముసలాడయినా మా బాస్‌ని ఎలా బుట్టలో వేసుకున్నానో, ఆయన నాకో ఇల్లు కొనిపెట్టాడూ, ఫైవ్‌స్టార్ హోటల్స్‌కి విందులకు తీసుకెళ్ళాడూ, ఖరీదయిన డ్రస్సులు, కారుల్లో షికార్లు... లేనివాడికి పెళ్ళాంగా ఉండటంకన్నా,

ఉన్నవాడికి ఉంపుడుగత్తెగా ఉండటంలోనే సుఖం ఉందే..."

స్నేహితురాలి బోధలో నిజముందో లేదో తెలియదుగానీ, ఆమె మాటలు అహల్యను ఉత్తేజపరుస్తున్నాయి. ఏదో ఏదో చేయమని తొందరపెడుతున్నాయి.

"... అయినా నాకు చిత్రంగా అనిపిస్తుందే, ముసలివాళ్ళను లొంగదీసుకోవటం కష్టం అంటారు. నీ బాస్‌లాంటి యువకులను కనుచూపులతోనే కవ్వించి ఒడిలో వాలేలా చేసుకుని, ఆ తర్వాత తాళికట్టేలా మార్చుకోవచ్చు. ముసలివాడయిన మా బాస్‌ని నేను లొంగేలా చేసుకోగలిగానుగానీ, యువకుడైన మీ బాస్‌ని నువ్వు ఆకర్షించలేకపోయావ్... ఏదిఏమైనా మీ బాస్ కోటీశ్వరుడే. అంత సులభంగా వదలకే పిచ్చిదానా!"

"ప్రయత్నిస్తాను'' అంది అహల్య.

అవతలివైపు ఫోన్ పెట్టేశాక తనూ ఫోన్ పెట్టేసింది. ఆమె తలతిప్పి చూస్తే ఛాంబర్ అద్దాలలోనుండి వంశీకృష్ణ ఏదో ఫైల్ చూస్తూ కనిపించాడు. అప్రయత్నంగానే ఆమె పెదాలు విచ్చుకున్నాయి.

'ఎంత అందగాడూ' అనుకుంది అహల్య 'ఇలాంటివాడు భర్తగా దొరికితే ఇక ఆడపిల్లకు కావలసిందేముంది?' అతడి ఆస్థిపాస్తులు గుర్తుకు రావడంతోనే ఆమెలోని కోరిక మరింత బలపడింది... 'జీవితాన్ని అనుభవించాలంటే, ఇలాంటి ఆస్తిపరుడు జీవితభాగస్వామి కావలసిందే' నిశ్చయపరచుకుంది ఆమె.

అతడిని తనవాడిగా చేసుకునేందుకు ఏమేం చేయాలో ఆలోచించడం మొదలుపెట్టింది అహల్య.

★ ★ ★

భోజనాలయ్యాక అతడు తన రూమ్‌లోకొచ్చాడు. బెడ్‌మీద నడుంవాల్చి అక్కడే పడి ఉన్న రిమోట్ అందుకుని టి.వి. ఆన్ చేశాడు. ఏదో తెలుగు ఛానల్‌లో సినిమా పాటల ప్రోగ్రాం వస్తోంది.

అతడి చూపులు టి.వి. తెరమీదనే నిలబడిపోయాయి. అయితే మనసు మాత్రం మరెక్కడో విహరిస్తోంది.

తెరమీద హీరో, హీరోయిన్లు ఒకరినొకరు హత్తుకుపోయి సెన్సార్‌వారికి దొరకకుండా ప్రేక్షకులకు మాత్రమే అర్థమయ్యేలా ముద్దులు పెట్టేసుకుంటున్నారు. ఆ దృశ్యాలు మనసును ఏ మూలో తట్టిలేపుతున్నాయి. అది అర్థం కావడంతోనే అతడు టి.వి. ఆఫ్ చేశాడు. పిచ్చి పిచ్చి ఆలోచనలు మొదలయితే ఆ రాత్రి అసలు సరిగా నిద్రపట్టదు.

వంశీకృష్ణ కాసేపు రూమ్‌లో అటుఇటు నడిచాక ఒక నిర్ణయానికి వచ్చినట్టు తలుపులు తీసుకుని బయటకు నడిచాడు. పోర్టికోలో ఉన్న కారు డోర్ తీసి డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాడు. ఇంజన్ స్టార్ట్ చేసి కారు ముందుకు పోనిచ్చాడు.

కారు రోడ్డెక్కాక ఎక్కడికెళ్ళాలో అర్థం కాలేదు. టైమ్ చూసుకుంటే తొమ్మిది గంటలయింది.

చాలాదూరం సాగాక చూస్తే కారు టాంక్ బండ్‌మీద వెళుతోంది. అప్పటికి మరీ పొద్దుపోకపోవడంతో టాంక్‌బండ్‌మీద జన సంచారం బాగానే ఉంది. అతడికి ఆచోటు చాలా ప్రశాంతంగా ఉన్నట్టనిపించింది.

కారు పార్కింగ్ ప్లేస్‌లో ఆపి కిందికి దిగాడు వంశీకృష్ణ. అల్లూరి సీతారామరాజు విగ్రహానికి ఎదురుగా హుస్సేన్‌సాగర్ రెయిలింగ్‌కి ఆనుకుని నిలబడ్డాడు.

చాలాసేపు నిలబడేసరికి కాళ్ళు నొప్పులు పుట్టాయేమో, అతడు రెయిలింగ్ ముందున్న బెంచీమీద కూర్చున్నాడు.

అతడు అలా ఎంతసేపు కూర్చుండిపోయాడో తెలియదు.

"హాయ్ వంశీ"




అతడు చప్పున తలతిప్పి చూశాడు. డాక్టర్ పురుషోత్తమ్‌రావ్ దంపతులు తనకు నాలుగడుగుల దూరంలో నిలబడిఉన్నారు.

వారిద్దరూ తనకి మరింత దగ్గరగా వస్తూంటే "అసలు నువ్వో కాదో పోల్చుకోవడం కష్టమయిందోయ్. 'అతడు వంశీయే' అని మా ఆవిడ అంటే, ఈ టైమ్‌లో వంశీ ఇక్కడెందుకుంటాడు?' అని నేను వాదించాను..." పురోషోత్తమ్‌రావు అన్నాడు.

వంశీ లేచి నిలబడుతూ, "హలో సార్! హౌ ఆర్ యూ'' అన్నాడు.

"వెరీ ఫైన్'

ఆమెవైపు చూసి "బాగున్నారా మేడమ్?" అడిగాడు.

"బాగున్నానయ్యా..." అన్నాక అడిగిందామె. "...ఇదేమిటి ఈ సమయంలో ఇక్కడ నువ్వొక్కడివే'

"ఏమీ తోచక టైంపాస్‌కి వచ్చాను'' నవ్వాడు అతడు.

"మేమూ ట్యాంక్‌బండ్‌కొచ్చి చాలాకాలమయిందోయ్. ఎలాగూ వచ్చాం కదా అని బాగా పొద్దుపోయేవరకూ గడవదలచుకున్నాం"

అతడు జవాబుగా నవ్వి ఊరుకున్నాడు.

ఆయనే తిరిగి "అయితే ఇక్కడెందుకు? అలా ఐస్‌క్రీమ్ పార్లర్ వరకూ వెళ్దాంపదా'' అన్నాడు.

అతడు తలాడించాడు. ముగ్గురూ రోడ్డు దాటి ఐస్‌క్రీమ్ పార్లర్‌వైపు నడిచారు.

పురుషోత్తమ్‌రావు రఘురామ్‌కి స్నేహితుడు మాత్రమే కాదు, ఆయన వంశీకృష్ణను తన అల్లుడిగా చేసుకోవాలని ప్రయత్నించి విఫలమయ్యారు. అయితే తమను కాదన్నందుకు ఆయన మనసులో అతడిపట్ల ద్వేషభావం మాత్రం లేదు. అతడు ఎప్పుడు కనిపించినా ఆప్యాయంగా పలకరించి మాట్లాడతాడు.

ముగ్గురూ ఐస్‌క్రీమ్ పార్లర్‌కి చేరుకున్నారు. పురుషోత్తమ్‌రావు మూడు ఐస్‌క్రీమ్స్ తీసుకున్నాడు. తనకూ ఒకటి అందిస్తుండగా వంశీ నవ్వుతూనే అడిగాడు. "మీరు డాక్టరై ఉండీ, అందులోనూ ఈ వయసులో ఐస్‌క్రీమ్స్ తినడమేమిటి సార్?"

"భలేవాడివోయ్! సిగిరెట్ తాగడం ఆరోగ్యానికి హానికరం అని డాక్టర్లకు తెలుసు. కాని సిగిరెట్ తాగే డాక్టర్లు ఎందరు లేరు? కాబట్టి ఐస్‌క్రీమ్ నా వయసువారికి మంచిది కాదని తెలిసినా, నేను ఐస్‌క్రీమ్ తినడం మానను. మనిషన్నాక ఇష్టమయినదాన్ని అప్పుడప్పుడయినా టేస్ట్ చేస్తూ ఉండాలి''

మిసెస్ పురుషోత్తమ్‌రావ్ నవ్వుతూ ఉండిపోయింది. ముగ్గురూ ఆ ఐస్‌క్రీమ్ పార్లర్ ముందున్న లాన్‌లోని టేబుల్ చుట్టూ కూర్చున్నారు.

"చెప్పవోయ్ విశేషాలేంటి?"

"ఏమున్నాయి సార్! ఏవైనా ఉంటే మీరే చెప్పాలి''

"అమ్మా నాన్నలు ఎలా ఉన్నారు?"

"మామూలే' నిర్లిప్తంగా పలికాడు అతడు.

"ఆయనలో కొంతయినా బెటర్‌మెంట్ కనిపిస్తోందా?"

"లేదు సార్'

పురుషోత్తమ్‌రావు అదోలా నిట్టూర్చారు. ఆ తర్వాత చిన్నగా భుజాలెగరేశారు. చివరగా తనలోతాను నవ్వుకోడం మొదలుపెట్టారు.

ఆయన నవ్వును చూసిన వంశీ "ఎందుకు సార్ నవ్వుతున్నారు." అంటూ ప్రశ్నించాడు.

పురుషోత్తమ్‌రావ్ తల అడ్డంగా ఆడించాడు. "ఏమీలేదు లేవోయ్''

"చెప్పండి సార్'

ఆయన ఇక చెప్పక తప్పదన్నట్టు చెప్పాడు. "వంశీ! నిన్ను చూస్తుంటే నాకు రకర

కాల భావాలు కలుగుతుంటాయోయ్. ఒక్కో సారి నీలాంటి 'కొడుకు'ను కన్న ఆ తల్లి దండ్రులు ఎంత అదృష్టవంతులో కదా అని పిస్తుంది. కంటిముందు తిరుగుతున్న తల్లి దండ్రులనే ఆశ్రమాలకో, 'హెూమ్ ఫర్ ఏజ్డ్'లకో తరిమేస్తున్న రోజులివి. అలాంటిది కన్నవారు మంచానపడితే ఏ నర్సుకో వారి బాధ్యత అప్పగించేసి చేతులు దులిపేసుకో కుండా, కంటికి రెప్పలా వారిని చూసుకుం టూ సేవచేసే నీలాంటి కొడుకును కనడం వారి అదృష్టం కాక మరేమిటి? అయితే అదే సమయంలో నీవల్ల వాళ్ళు బాధపడుతూ కూడా ఉండొచ్చు. ఎందుకంటే ఏ తల్లి దండ్రులయినా తమ బిడ్డ భార్యాబిడ్డలతో సుఖంగా కాపురం చేసుకుంటుంటే కళ్ళారా చూడాలనే అనుకుంటారు. ఈ విషయంలో మాత్రం వాళ్ళు దురదృష్టవంతులు. నీ మొండితనంతో వాళ్ళను బాధపెడుతు న్నావ్''

అతడు పెదవులు బిగబట్టి మౌనంగా ఉండిపోయాడు. ఆయన నిష్టూరంగా అన డంలేదని అతడికి తెలుసు. తను ఆయన ఆశను నిరాశ చేసినప్పటికీ ఆప్యాయంగానే అలా అంటున్నాడని అర్థమయిపోతూనే ఉంది.

ఆయన కొద్దిక్షణాల వ్యవధి తర్వాత మరేదో అనబోతూ ఉంటే మిసెస్ పురుషోత్త మరావ్ అడ్డుకుంటూ పలికింది. "ఇక అలాంటి మాటలు ఆపండి. అతడేదో రిలాక్స్ అవడం కోసం ఇలా వస్తే తమరేమో సమస్యలన్నీ గుర్తుచేసి అతడికి ఆనందం లేకుండా చేస్తున్నారు''

పురుషోత్తమరావు వెంటనే నాలుక్కరుచు కుని "సారీనోయ్'' అన్నాడు.

"భలేవారే సార్! కాజువల్‌గా మాట్లాడుకు నే మాటలకి సారీ చెప్పాల్సిన అవసరమే ముంది?" పైకి అన్నాడేగానీ, మనసులో మాత్రం బాధ మొదలయింది.

చాలాసేపు ఇతర కబుర్లు చెప్పుకున్నాక "వెళ్దామా'' అడిగాడు పురుషోత్తమరావు. అతడు తలాడించాడు.

ముగ్గురూ టేబుల్ ముందునుండి లేచా రు. కొద్దిదూరం సాగాక మిసెస్ అండ్ మిస్టర్ పురుషోత్తమ్మరావులు ఓ కారు ముందు ఆగా రు. "మేముంటామోయ్'' చెప్పాడు పురుషో త్తమ్‌రావ్.

"గుడ్‌నైట్ సార్''

వారిద్దరూ కారులో కూర్చున్నాక కారు ముందుకు కదిలి సాగిపోయింది.

అతడు తిరిగి ఒంటరి!

చుట్టూ వందలమంది జనం ఉన్నా పలక రించేవాళ్ళు, దగ్గరగా ఉండేవాళ్ళు లేని ఒంటరి!

అతడు రెండు చేతులూ ఫ్యాంట్‌జేబులో పెట్టుకుని తన కారువైపు అడుగువేశాడు. కారుని చేరుకున్నాక కొద్దిసేపు కారు డోర్‌కి ఆనుకుని నిలబడ్డాడు. మనసులో డైలమా! 'ఇంటికి వెళ్ళాలా? అప్పుడే ఇంటికెళ్లి చేసేదే ముంది?' నిద్ర రాక బెడ్‌మీద ఆ చివరనుండి ఈ చివరవరకూ ఎంతోసేపు పొర్లాడుతూ, తట్టుకోలేని ఆలోచనలతో తలపీక్కుంటూ. అయినా సరే ఇంటికి వెళ్ళిపోవాలనే నిర్ణ యించుకుని డోర్ తీసి డ్రైవింగ్ సీట్లో కూర్చు న్నాడు.

కారు ముందుకు కదిలింది.

మరో అరకిలోమీటరు దూరంలో ఇల్లుంద నగా ఓ వ్యక్తి రోడ్డుకు అడ్డదిడ్డంగా నడుస్తూ కనిపించాడు. మనిషి బాగా తూలిపోతున్నా డు. దూరంనుండే గమనించడంతో అర్థమ యిపోయింది అతడు బాగా తాగేసి ఉన్నా డని. కారు హారన్ మోగించటంతో ఆ వ్యక్తి చప్పున వెనుతిరిగి చూశాడు. ఎడమచెయ్యి పొడవుగా చాపి, బొటనవ్రేలు పైకెత్తి 'లిఫ్ట్' అన్నట్టుగా సైగచేశాడు.

వంశీకృష్ణ ఆ తాగుబోతును పట్టించుకో కుండా ముందుకు వెళ్ళిపోయి ఉండేవాడే





గానీ... కారు ఆ వ్యక్తిని సమీపిస్తుండగా యథాలాపంగా ఆ మనిషి ముఖంలోకి చూశాడు. ఆ వ్యక్తిని ఎక్కడో... ఎక్కడో చూసినట్టుగా అనిపించింది. అయితే ఎక్కడ చూశాడో మాత్రం వెంటనే గుర్తుకురాలేదు. కారు ఆ వ్యక్తికి రెండుగజాల దూరంలో ఉన్నప్పుడు చప్పున గుర్తొచ్చింది.

అతడు కారు సడన్‌బ్రేక్‌తో ఆపి విండోగ్లాస్ కాస్త కిందికి దించి ఆ వ్యక్తి ముఖంలోకి పరిశీలనగా చూశాడు. అనుమానం లేదు. వెన్నెల్లో తుమ్మమొద్దుని నిలబెట్టినట్టున్న ఆ వ్యక్తిని ఉదయమే పక్కింట్లో తను చూశాడు. అంటే... అంటే ఈ తాగుబోతు ఆ ముగ్ధమనోహర సుకుమారికి... ఆ తర్వాత ఆలోచించడానికే మనస్కరించలేదు.

కారు తన పక్కనే ఆగటంతో అప్పటికే కారు డోర్‌ను ఆసరాగా చేసుకుని నిలబడ్డ ఆ వ్యక్తి ముఖం కాస్త లోపలికి పెట్టి "షార్! ఈ స్ట్రీట్ చివరివరకూ నన్ను..."

వంశీ నిశ్శబ్దంగా ఫ్రంట్ డోర్ తెరిచాడు. "థాంక్స్... థాంక్స్... షార్' అంటూనే ఆ వ్యక్తి కారులో కూర్చున్నాడు. కారు ముందుకు పోనిచ్చాడు వంశీ.

తనకు ఏవిధంగానూ సంబంధం లేని విషయమే కావచ్చుగానీ ఈ తాగుబోతు, ఆ అమ్మాయికి మొగుడు అన్న నిజం అతడిని బాధపెట్టింది. మనసు పరిపరివిధాల పోసాగింది. 'పోనీ రూపానిదేముందిలే అనుకున్నాడుగానీ ఇతడి ప్రవర్తన కూడా బాగోలేనట్టు తెలిసిపోతూనే ఉంది.

"మీరూ అటేకదా షార్?" గుప్పున కొట్టింది నాటుసారా వాసన.

వంశీకృష్ణకు ఆ వాసన ఇబ్బందిగా అనిపించింది. అయితే ఆ ఫీలింగ్ ముఖంలో కనపడకుండా "అవును'' అంటూ బదులిచ్చాడు. అంతలోనే అతడికి నవ్వొచ్చింది. 'తాగుబోతు మాటలు కాకపోతే అటుగా వెళ్తుండబట్టే కదా తను ఆ వ్యక్తికి లిఫ్ట్ ఇచ్చింది' మనసు మరోవిధంగా కూడా ఆలోచించింది. 'ఒకవేళ తను ఇంటికే కాకుండా మరే చోటుకైనా వెళ్తున్నప్పటికీ ఇతగాడు ఆ అమ్మాయి భర్త అని తెలిశాక తప్పకుండా ఇంటి దగ్గరే డ్రాప్‌చేసి ఉండేవాడేమో'

అప్పుడే అతడు దగ్గరగా ఉన్న ఆ వ్యక్తిని పరీక్షగా చూశాడు. మనిషి నల్లగా ఉండటమే కాదు, ముఖంలోనూ ఓ రకమైన రఫ్‌నెస్ కదలాడుతోంది. ముఖ్యంగా ఆ కళ్లు ఎర్రగా చింతనిప్పుల్లా భయంకరంగా ఉన్నాయి. అప్పటివరకూ లేదుగానీ అప్పుడే అతడికి 'ఆమె'మీద జాలి కలిగింది. అసలే కుందనపు బొమ్మ, ఈ రాక్షసుడితో తనెలా కాపురం చేయగలుగుతోందో?'

ఇతరులతో పలికేందుకు అంతగా ఇష్టపడని అతడు తనే ఆ వ్యక్తిని పలకరిస్తూ అడిగాడు "మీరేం చేస్తుంటారు''

ఆ వ్యక్తి తూలిపోతూ, వాలిపోతున్న తలను అతికష్టంమీద పైకి లేపాలని ప్రయత్నించి ఆ ప్రయత్నం విఫలమై అలాగే తలవాల్చేసి చెప్పాడు. "ఇన్‌కంటాక్స్ ఆఫీస్‌లో ఉద్యోగం... ఏం ఆ ఆఫీసులో మీకేదయినా పని చేసిపెట్టాలా? చెప్పండి... నో! ప్రాబ్లమ్ మా ఆఫీషర్‌కి నేనెంత చెప్తే అంతే... సరేనా?"

"అవసరంలేదులెండి'' అతడు నవ్వేశాడు. మనసులో మాత్రం అనుకున్నాడు. 'అయితే సంపాదన బాగానే ఉండిఉంటుంది. అలాంటి అడ్డదారి సంపాదన ఉన్నప్పుడే ఇలాంటి వ్యసనాలు అలవాటై మనిషిని పతనదిశగా పయనింపచేస్తాయి''

"సత్యమూర్తి''

వంశీ ఈసారి నవ్వును ఆపుకునే ప్రయత్నం చేయలేదు. పెద్దగా నవ్వేశాడు. 'పేరేమో సత్యమూర్తి మనిషేమో తాగుబోతు'

అప్పటికి కారు ఆ ఇంటిని సమీపిస్తోంది. మరికాస్త దగ్గరగా వెళ్ళాక అటుచూస్తే ఆమె ఆ ఇంటివాకిట్లో నిలబడివుంది.

అందంగా అలంకరించుకుని ఉంటే ఆమె అభిసారికలా ఉండేది. కాని ఆమె సాదాసీదాగా ఉండటమే కాదు ఆ చూపుల్లో విరహం లేదు. ఆత్రుత కదలాడుతోంది. స్కూల్ నుండి టైమ్‌కి రాని పిల్లవాడి కోసం వాకిట నిలబడి చూస్తున్న తల్లిలా ఉంది.

స్త్రీ పురుషుడి కోసం ఎదురుచూసేవేళ 'విరహోత్కంఠిత'‘విప్రలబ్ధ' లేదా 'అభిసారిక' కావాలి. కాని కన్నులలో దైన్యం కదలాడుతున్న ఆమె 'కావ్యనాయిక'లా లేదు, 'కలియుగ వనిత'లా ఉంది.

ఆమెను అలా చూడగానే అతడి మనసు జాలితో నిండిపోయింది.

అతడి కారు ఆ ఇంటిని సమీపిస్తుండగా, సత్యమూర్తి తలెత్తి "ఆపండి షార్... ఇదే... ఇదే మా ఇల్లు'' అరిచినట్టుగా అన్నాడు.

'నాకు తెలుసు. అరవనవసరంలేదు' అందామనుకున్నాడు వంశీకృష్ణ. మాట్లాడకుండా కారు ఆపాడు. ఇంటిముందు కారు ఆగడంతో ఆమె చప్పున అటుకేసి చూడడం అతడు గమనించాడు.

వీధిలైటు వెలుగు ఆ పరిసరాలలో సాధ్యమైనంతలో చీకటిని పారదోలుతోంది. అతడు ఆమెకేసి కొద్దిక్షణాలు అదోలా చూశాడు. అదే సమయంలో ఆమె అతడికేసి చూపులు మరల్చడంతో చూపులు కలుసుకున్నాయి.

అప్పుడే సత్యమూర్తి కారు డోర్ తెరుచుకుని దిగుతున్నాడు. అతడు తలతిప్పి సత్యమూర్తికేసి చూస్తూ "కాస్త మెల్లగా దిగండి'' అన్నాడు. ఆ క్షణం సత్యమూర్తిమీద ఏదో తెలియని ఆప్యాయత తన గొంతులో పలకడం తనకే ఆశ్చర్యంగా అనిపించింది.

"వ... పర్వాలేదు షార్... ఐయామ్ స్టడీ..." డోర్ తీశాడు సత్యమూర్తి, నేలమీద ఓ కాలు పెట్టాడు. మరోకాలు కారులోనుండి తీసి నేలమీద పెట్టాక బేలన్స్ నిలపలేక ముందుకు తూలి కిందపడ్డాడు.

వంశీకృష్ణ కంగారుపడ్డాడు. కారు ఇంజన్ ఆఫ్ చేసి, డోర్ తీసుకుని అటుగా పరుగు లాంటి నడకతో చేరుకున్నాడు. సరిగ్గా అదే సమయానికి ఆమె కూడా వేగంగా అక్కడికి వచ్చింది.

అతడు సత్యమూర్తిని పట్టుకుని పైకి లేపాడు. అలా లేవదీస్తున్నప్పుడే కిందపడడంతో ముఖంమీద గీరుకుపోయిన జీర కనిపించింది.

బాధ తెలియని సత్యమూర్తి గొణుగుతున్నాడు. "నో ప్రాబ్లమ్ షార్... ఐ యామ్ ఆల్‌రైట్'' అంటూ వంశీ చేతులను విదిలించుకోబోయాడు.

అయితే వంశీ వదల్లేదు. అతడి ఎడమచేతిని తన భుజంమీద వేసుకుని, "పదండి. మిమ్మల్ని ఇంట్లో వదిలివెళ్తాను'' అంటూ ముందుకు అడుగువేశాడు.

అతడు మరో అడుగు ముందుకు వేయబోతుంటే, అప్పుడు అప్పుడు కనిపించిందామె ముఖం తనకు చాలా చాలా దగ్గరగా! కేవలం రెండడుగుల దూరంలో!

అయితే ఆమె వంశీకృష్ణను చూడటంలేదు. వాడిపోయిన తోటకూరకాడలా వేలాడబడిపోతున్న తన భర్తకేసే కంగారుగా చూస్తోంది. ఆమె ముఖంలో దిగులు. అంతకు మించిన భయమేదో కదలాడడం గమనించాడు అతడు.

ఆమె వంశీ భుజంమీద ఉన్న సత్యమూర్తి చేతిని తన భుజం వేసుకునే ప్రయత్నం చేయబోతుంటే అతడు వారించి చెప్పాడు. "పర్వాలేదు. నేను తీసుకొస్తాను. మీరు లోపలికి పదండి''

అవే అతడు ఆమెతో మాట్లాడిన తొలిమాటలు. అయినా సరే, ఆమెతో మాట్లాడడం అతడికి ఏదో తెలియని ఉత్సాహాన్ని కలిగేలా చేసింది.

అప్పుడు చూసిందామె అతడికేసి. అదీ కొద్దిసెకనులు మాత్రమే. ఆ తర్వాత వేగంగా తలతిప్పుకుని ముందు నడవసాగింది. అత





డు సత్యమూర్తిని నడిపిస్తూ ఆమెను అనుసరించాడు.

లోపలికి తీసుకెళ్ళాక ఆమె చూపించిన మంచంమీద పడుకోబెట్టాడు. అలసట తీర్చుకుంటున్నట్టు రెండు క్షణాలపాటు అక్కడే నిలబడ్డాడు.

మంచంమీద పడుకునేవరకూ మత్తుగా కళ్లు మూసుకుని ఉన్న సత్యమూర్తి ఆ క్షణమే కళ్లు తెరిచాడు. ఎదురుగా ఓ ఆడ, మగ ఆకారాలు అస్పష్టంగానయినా కనుపించాయి. అతడు తల విదిలించాడు. ఈసారి ఆ ఆకారాలు మరికాస్త స్పష్టంగానే కనిపించాయి. అందులో ఓ ఆకారం తన భార్య అని గుర్తించాడు. మగ ఆకారం మాత్రం తనను లోపలికి తీసుకువచ్చిన వ్యక్తి అని గుర్తించలేకపోయాడు. అంతే ఆవేశం కట్టలు తెంచుకోగా, మంచంమీద నుండి పైకి లేవడానికి ప్రయత్నిస్తూ "ఏమే దొంగముండా! నేను రావడం ఆలస్యమయ్యేసరికి, మరో మగాడిని ఇంట్లోకే తెచ్చేసుకున్నావా? వాడు'' అరిచి మళ్ళీ మంచంలో పడిపోయాడు.

నిశ్శబ్దం... గాఢమైన నిశ్శబ్దం!

సత్యమూర్తి మంచంలోనుండి మళ్ళీ లేచేందుకు ప్రయత్నిస్తున్నాడుగానీ వాళ్ళిద్దరూ మాత్రం ఆశ్చర్యంలోనుండి తేరుకోలేకపోతున్నట్టు అలాగే నిలబడిపోయారు.

అంతలో మంచంలోనుండి మళ్ళీ లేచిన సత్యమూర్తి "వాడికెంత ధైర్యమే? నేను నీ మొగుడ్ని, తాళికట్టోడ్ని. నేను ఇంట్లోకొచ్చానని తెలిసీ ఇంకా నా కళ్ళముందే ఉన్నాడు. వాడిని చంపేస్తా. నిన్నూ చంపేస్తా'' అంటూ ఎలాగోలా నిలదొక్కుకున్నాడు.

వంశీకృష్ణ పెదవులు బిగపట్టాడు. సత్యమూర్తి నోటివెంట అలాంటి మాటలు కలలోనయినా ఊహించలేదు. మెల్లగా తలతిప్పి చూస్తే ఆమె ఇబ్బందిగా తనకేసే చూడటం కనిపించింది.

అతడు కాస్త వంగి సత్యమూర్తితో "నేను... నేను మిమ్మల్ని లోపలికి తీసుకువచ్చినవాడిని మీరూహించినట్టు'' ఇంకా ఏదో చెప్పబోతుంటే పక్కనుండి వినిపించింది.

"వద్దండీ... ఆయనకేం చెప్పొద్దు''

ఆమె నోటివెంట వచ్చిన తొలిమాట అదే. అలాంటిస్థితిలో కూడా అతడు మనసులో 'ఎంత తియ్యని గొంతు? ఈమె మాట్లాడితే వీణ తీగను లాగివదిలితే వచ్చే సవ్వడి గుర్తుకొస్తుంది' అని అనుకోకుండా ఉండలేకపోయాడు. అలా అనుకుంటూనే ఆమెకేసి ప్రశ్నార్థకంగా చూశాడు.

"మీరిప్పుడు ఏం చెప్పినా ఆయన బుర్రకెక్కదు. కాసేపు అరుస్తారు. ఆ తర్వాత పడుకుండిపోతారు. మీరెళ్లండి''

సత్యమూర్తి అప్పుడే అతడిని పరిశీలనగా చూశాడు "ఓహో మీరా సార్! నేను ఇంకెవరో అనుకున్నాను''

అతడు కొద్దిసెకనులు సత్యమూర్తికేసి అదోలా చూసి బయటకు నడిచాడు. ఆమె అతడిని అనుసరించి వరండావరకూ వచ్చింది. అతడు కారువైపు నడవబోతూ ఆమెవైపు తిరిగి కొద్దిక్షణాలు తటపటాయించాక అడిగాడు "మీవారు అలా అన్నందుకు బాధపడ్డారా?"

ఆమె బలవంతంగా నవ్వింది. ఓ వెన్నెల కిరణం ఆమె భుజంమీద పడి తన జన్మ ధన్యమయినట్టు పరవశించిపోయింది.

"బాధపడడటం అలవాటయిపోయిందండీ''

"అంటే?"

"నేను దేవుడికి నమస్కరించినా, ఆ దేవుడికీ, నాకూ ఏదో అక్రమసంబంధం ఉండబట్టే నేను ఆ భగవంతుని ఫొటో ముందు అలా నిలబడ్డానని అనుమానించే వ్యక్తి మావారు''

అతడు ఆమెవైపు జాలిగా చూశాడు. ఈ ప్రపంచంలో అన్నింటికన్నా విలువలేనివి జాలిచూపులే అని అతడికి తెలుసు. కాని

ఒక్కోసారి ఎదుటివ్యక్తికి ఆ విలువలేనివి అందించటం తప్ప మరేమీ చేయలేం.

అంతలో ఆమే అంది, "మీరు ఈ ఇంట్లో నే కదూ ఉండేది'' పక్క ఇల్లు చేత్తో చూపించింది.

"ఆ ఇల్లు మాదే''

"ఒకసారి చూశానులెండి''

అతడు కొద్దిక్షణాలు మౌనంగా ఉండిపోయాడు. ఇక మాట్లాడవలసింది మరేంలేనట్టు ఆమె కూడా నిశ్శబ్దాన్ని ఆశ్రయించింది. లోపలినుండి సత్యమూర్తి గొంతు వినిపిస్తూనే ఉంది. "ఎక్కడ చచ్చావే గౌతమీ! రావే నాకు భోజనం పెట్టు..."

వంశీకృష్ణ ఇక అక్కడ ఉండలేనట్టు "వెళ్లొస్తాను'' అంటూ ముందుకు నడిచాడు. వీధిగేటు దాటి కారును సమీపించాడు. కారు డ్రైవింగ్ సీట్లో కూర్చుని కారు స్టార్ట్ చేస్తూ అటుగా చూస్తే ఆమె ఇంకా వరండాలోనే నిలబడి ఉంది. అతడు కారు ముందుకు పోనిస్తూ మనసులో అనుకున్నాడు, 'వరాలు మనిషి అనాకారి అంటే పోనీ మనసయినా మంచిదేమో అనుకుని సంతృప్తిపడుతుంటే ఊహూం మనసు మరీ చెడ్డది. పాపం! ఆ దుర్మార్గుడి నీడలో ఆమె...,, వంశీకృష్ణకు మనసంతా బరువుగా మారింది. అతడి పెదాలు మాత్రం మెల్లగా గొణిగాయి 'గౌతమీ! రియల్లీ బ్యూటిఫుల్ నేమ్'



అతడు డైనింగ్‌టేబుల్ ముందు కూర్చుని టిఫిన్ తింటున్నప్పుడు పార్వతమ్మ తన వైపే తదేకంగా చూడడం గమనించి అడిగాడు "ఏమిటమ్మా అలా చూస్తున్నావ్?"

"ఒరేయ్ వంశీ! నేను నిన్నో ప్రశ్న అడుగుతాను జవాబు చెపుతావా?"

"అడుగమ్మా''

"నీ అమ్మానాన్న చనిపోయాకైనా నువ్వు పెళ్లి చేసుకుంటావట్రా?"

అతడికి మనసులో ముల్లు గుచ్చినంత బాధ కలిగింది. "అదేం మాటమ్మా!" అన్నాడు బాధను వ్యక్తం చేస్తూ.

"లేకపోతే ఏమిట్రా ఇది. నా వయసు వాళ్లంతా మనుమలతో ఆడుకుంటుంటే నాకు మాత్రం ఆ ఆనందం లేకుండా చేశావ్. మనకు ఇంత ఆస్తి ఉంది. కాని లాభం ఏమిటి? ఈ ఆస్తికి వారసులు లేరు. నాకు ఆనందమూ లేదు. ఏమిటి ఇది? మన వంశం నిర్వంశం అయిపోతుందంటే బాధ తట్టుకోలేకపోతున్నానురా. దానికన్నా ముందు ఇరుగుపొరుగు బంధుమిత్రులు 'పార్వతమ్మా నీ కొడుకు పెళ్లి చేసుకోలేదేమిటీ?' అని అనుమానంగా ఆరాలు తీస్తుంటే వాళ్ల ప్రశ్నలకు జవాబు చెప్పలేకపోతున్నాను..."

"అమ్మా..."

కొడుకు పలుకుల్లోని బాధ ఆమె గుర్తించనేలేదు.

"రేయ్! నా మాట వినరా! నువ్వు సరే నంటే శాస్త్రిగారిని పిలిపిస్తాను. ఆయనయితే మంచి సంబంధాలు చూపిస్తారు''

అతడు ప్లేట్‌లో చెయ్యి కడిగి, కుర్చీలో నుండి లేచాడు. నేప్‌కిన్‌తో చెయ్యి తుడిచేసుకుని గదిలోకెళ్లాడు. బ్రీఫ్‌కేస్ చేత్తో పట్టుకుని హాల్లోకొచ్చి తల్లికేసి చూడకుండానే విసురుగా బయటకు నడిచాడు.

కారు డ్రైవింగ్‌సీట్లో కూర్చుని ఇంజన్ స్టార్ట్‌చేసి ముందుకు పోనిచ్చాడు. కారు ఇంటిగేటుదాటి రోడ్డెక్కింది.

కొద్దిదూరం ముందుకు సాగాక ఇంజన్

శబ్దాన్ని డామినేట్ చేస్తూ పెద్ద చప్పుడు వినిపించింది. అతడు బహుశా కారు టైర్ పంక్చరయిందేమోననుకుని సడన్‌బ్రేక్ వేశాడు. అసలే మనసులో గందరగోళం చెలరేగుతుంటే మళ్లీ ఇదొక చిరాకా! అని మనసులో తిట్టుకున్నాడు.

అంతలోనే ఏదో అనుమానం మనసులో మెదలాడింది. అది టైర్ పంక్చర్ వల్ల వచ్చినశబ్దం కాదేమో! అతడు అలాంటి సందిగ్ధావస్థలో కొట్టుమిట్టాడుతూ కారు దిగాలా, వద్దా అని తటపటాయిస్తుంటే వినిపించింది.

"ఎందుకండీ.. ఎందుకండీ నన్నిలా చంపుకు తింటారు?"

వంశీకృష్ణ చప్పున తల తిప్పి చూశాడు.

ఆ గొంతు పరిచితమైనదే. అందువల్లే కాబోలు ఆ గొంతులోని దుఃఖం మనసును కదిలించింది. అతడి కారు ముందుకుపోనని మొరాయించింది. అవును మరి! అది గౌతమి గొంతు.

"నిన్ను చంపుకు తింటే నాకేమొస్తుందే పిచ్చిదానా! నిన్నిలాగే బతకనిచ్చి హింస పెడుతుంటే మీ నాన్న దగ్గరనుండి నాకు కావలసినవన్నీ వస్తుంటాయి'' సత్యమూర్తి అదోలా నవ్వుతున్నాడు.

మరోసారి ఛళ్‌మనే చప్పుడు. బహుశా చెంపదెబ్బ అయి ఉండొచ్చు. ఆమె గోధుమ వన్నె బుగ్గ మందారపువ్వులా ఎరుపెక్కిపోయి ఉండొచ్చు.

"నన్నిలా రోజూ చంపుకు తినేకంటే ఒకేసారి ప్రాణాలు తీసేయండి''

అంతలోనే మరోదెబ్బ దభ్‌మని.

వంశీకృష్ణ ఇక కారులో స్థిమితంగా కూర్చోలేకపోయాడు. కారు దిగి వెళ్లి సత్యమూర్తిని ఆ చెంపా, ఈ చెంపా వాయించాలనిపించింది. అతడు కారు డోర్ తెరుచుకుని కాలు కిందపెట్టాడు. కాని... కాని అంతలోనే అడుగు వెనక్కు తీసుకుని కారుడోర్ విసురుగా వేసేశాడు. ఇప్పుడు వారి మధ్యకు వెళితే అది మనసులో పెట్టుకుని అతడు ఆమెను మరింత హింసిస్తాడేమో... అదీగాక భార్యాభర్తల గొడవల మధ్య ఇతరులు జోక్యం చేసుకోవడం సంస్కారం అనిపించుకోదు.

దభ్... దభ్... దెబ్బల శబ్దం చెవులకు తాకుతోంది.

ఆ సుకుమారమైన శరీరం ఆ దెబ్బలకు ఏమయిపోతుందో ఏమో?

అతడు అసహనంగా పిడికిలి బిగించి స్టీరింగ్‌వీల్ మీద కొట్టాడు. తను ఇక అక్కడ ఉంటే మనసుమారి లోపలికి వెళ్తానేమోననిపించి ఇక అక్కడ ఉండలేనట్టు కారు ముందుకు పోనిచ్చాడు.

పది నిముషాల తర్వాత కారు ఆఫీసు బిల్డింగ్ ముందు ఆగింది. అతడు చిరాకుగానే లిఫ్ట్‌లో ఆఫీసు ఉండే ఫ్లోర్‌కి చేరుకున్నాడు.

తన ఛాంబర్‌వైపు నడుస్తుంటే అహల్య సీట్‌లోనుండి లేచి "గుడ్‌మార్నింగ్ సార్" అంది.

అతడు నెమ్మదిగా తలాడించి, తన ఛాంబర్‌లోకెళ్లి రివాల్వింగ్ ఛెయిర్‌లో కూర్చుని వెనక్కు వాలాడు. మనసులో ఏదో అసహనం, ఎవరి మీదో తెలియని కసి, దానికి తోడవుతున్న నిస్సహాయత. ఉదయం అమ్మ పెళ్లి ప్రస్తావన తీసుకురావటంతో మొదలయిన బాధ, సత్యమూర్తి గౌతమిని కొట్టడంతో రెట్టింపై మనసంతా ఏదోలా తయారయింది. ముఖ్యంగా గౌతమి విషయమే అతడిని ఎక్కువ బాధపెడుతోంది.

ఆమెతో తనకు పెద్దగా పరిచయం కూడా లేదు. గత రాత్రి ఆమెతో రెండే రెండు మాటలు మాట్లాడాడు. అయినాసరే ఆ రెండు మాటలే ఆమె పట్ల ఒకరకమైన ఆప్యాయతను కలుగజేశాయి. అసలు ఆమెను చూస్తుంటే ఒద్దికయిన ఇల్లాలు అంటే అలాగే ఉండాలనిపిస్తోంది. కాని ఆ దుర్మార్గుడు దొరకటం ఆమె దురదృష్టమేమో!

"మే ఐ కమిన్ సార్!"

అతడి ఆలోచనా ప్రవంతి ఆగిపోయింది. అతడు తలపైకెత్తి చూశాడు. అహల్య కనిపించింది.

ఆమె అప్పుడే అతడి ముఖంలోకి చూసింది. అతడి ముఖంలో కదలాడే అనీజీనెస్ గమనించింది. వెంటనే కంగారు కొని తెచ్చుకుని ముందుకు వచ్చి "ఏమిటి సార్! అలా ఉన్నారు?" ప్రశ్నించింది.

అతడు అదేమీ వినిపించుకోకుండా "ఈ రోజు డిక్టేట్ చేయాల్సిన లెటర్స్ ఏమీలేవు'' అన్నాడు.

అయితే ఆమె ఛాంబర్‌లోనుండి వెళ్ళిపోలేదు. పొడవైన టేబుల్ చుట్టూ తిరిగి, అతడి దగ్గరగా వచ్చింది. ఆ సమయంలో ఆమె తనకు స్నేహితురాలు ఫోన్‌లో చెప్పిన మాటలు గుర్తుకు తెచ్చుకుంది. చాలా కేజువల్‌గా వేసినట్టు అతడి నుదుటిమీద చెయ్యివేసి "జ్వరం కూడా లేదు సార్' అంది పరీక్షించినట్టు.

అహల్య అతడి ముఖంలోకి తొంగి చూస్తున్నట్టు కాస్త వంగింది. అలా వంగినపుడు ఎదమీద పైట కొద్దిగా కిందికి జారింది. అయితే ఆమె తన పైట సర్దుకునే ప్రయత్నం చేయలేదు.

అతడు కొద్ది సెకనులపాటు ఆమె గుండెల మీద చూపులు నిలిపాక అతికష్టం మీద చూపులు మరల్చుకున్నాడు. వెంటనే ఆమె చేతిని పక్కకు తోసేస్తూ "జ్వరమేమీకాదు. జస్ట్ తలనొప్పి అంతే' అన్నాడు.

అయితే ఆమె కదిలే ప్రయత్నం చేయలేదు. పైగా అతడికి మరింత దగ్గరయింది. ఆమె భుజం, అతడి భుజాన్ని రాసుకుంటోంది. "పోనీ జండూబామ్ తెప్పించి రబ్ చేయనా సార్'

ఆమె గొంతులో ఆతృతకన్నా, అదోరకమైన మత్తు కదలాడడం అతడు గమనించాడు. అప్పటికే ఆమె చూపుతున్న మితిమీరిన చనువు కోపం తెప్పిస్తుంటే ఆ కోపాన్ని అణచుకుని చెప్పాడు "వద్దు''

ఈసారి ఆమె కళ్ళెగరేస్తూ గమ్మత్తుగా నవ్వింది. "పోనీ అన్నింటికన్నా పవర్‌ఫుల్ మెడిసిన్ ఇవ్వనా సార్! ఆ మెడిసిన్ వాడితే ఇలాంటి తలనొప్పులన్నీ క్షణాల్లో ఎగిరిపోతాయి''

అతడు ఆమె కన్నుల్లోకి ప్రశ్నార్థకంగా చూశాడు.

మనసు మూలల్లో ఎక్కడో కొంత భయం ఉన్నప్పటికీ, ధైర్యాన్ని కొని తెచ్చుకుని మరీ చెప్పింది "కిస్ ఈజ్ బెస్ట్ మెడిసిన్ ఫర్ ఆల్ ప్రాబ్లమ్స్ సార్'

ఆమె ఏమన్నదో అర్థమయ్యేందుకు రెండు సెకనులే పట్టినప్పటికీ, ఆశ్చర్యం నుండి తేరుకునేందుకు ఎనిమిది సెకనులు అవసరపడ్డాయి. 'పెళ్ళికాని ఈ అమ్మాయి ముద్దిస్తానంటూ ఎంత సులభంగా అనేసింది? అందులోనూ తను బాస్. అయినా అనగలిగిందీ అంటే తనే తెలియకుండానే కొంత చనువు ఇచ్చాడా లేక ఆమె అతి చొరవ చూపించి అనేయగలిగిందా? ఏదేమయినా ఆమె తన గురించి ఏమనుకుంటోంది? ఇలాంటి ప్రలోభాలకు లొంగిపోయే బలహీన మనస్కుడనని అనుకుంటోందా?

అతడి ముఖం ఎర్రగా కందిపోయింది. కన్నులు తీక్షణతను సంతరించుకుని ఆమెనే చూడసాగాయి.

అహల్య అతడి ముఖంలో వచ్చిన మార్పు గమనించింది. అయితే అది తను కోరుకున్న మార్పు కాకపోవటంతో కంగారు పడింది. ముఖ్యంగా అతడి చూపులలోని తీక్షణత ఆమెను భయపెట్టింది. అప్రయత్నంగానే ఆమె ఓ అడుగు వెనక్కువేసింది.

వంశీకృష్ణ రివాల్వింగ్ ఛెయిర్‌లోనుండి లేచాడు. ఆమెను తప్పించుకుని రెండడుగులు ముందుకేసి గ్లాస్ విండో దగ్గరగా వెళ్ళి నిలబడ్డాడు.





కొద్దిక్షణాలపాటు ఇద్దరి మధ్యా గాఢమైన నిశ్శబ్దం పేరుకుంది.

అహల్య అతడికేసే కాసింత భయంగా, మరికాస్త ఆశ్చర్యంగా చూడసాగింది.

చాలాసేపటి తర్వాత అతడి గొంతు మంద్రస్థాయిలో వినిపించసాగింది. "అహల్యా! ఎందుకనో నీ మీద కోపం రావడంలేదు. ఈ ప్రపంచంలో ప్రతి మనిషికీ ఆశ ఉంటుంది. అప్పుడప్పుడూ అత్యాశ కలుగుతూ ఉంటుంది. అసలు నువ్వు ఏ ఉద్దేశ్యంతో నాకు ముద్దు ఇస్తానన్నావో తెలియదుగానీ నేను అది అందుకోవడంలో ఏం జరుగుతుంది? ముద్దుతో మొదలయిన సరదా తనువుల కలయికతో ముగుస్తుంది. ఇద్దరి వ్యక్తుల మధ్య ప్రేమ లేకుండా జరిగే తనువుల కలయిక మీద నీ అభిప్రాయం ఏదయినా, ఆ విషయంలో నాకు ఒక నిశ్చితాభిప్రాయం ఉంది. ఇద్దరు వ్యక్తులు ఏకమయ్యేందుకు కోరిక ప్రధానం కారాదు. ఆ ఇద్దరు వ్యక్తుల మధ్య ప్రేమ, అనురాగాలు ఉండాలి. ప్రేమ, అనురాగాలు లేకుండా కలిసే కలయిక వ్యభిచారం అవుతుంది''

ఆ మాటలు ఆమెకు సూటిగా గుండెల్ని తాకాయి. దానికితోడు పెంచుకున్న ఆశ అడుగంటిపోయింది. ఏదేమయినా అతడి మీద తనకున్న గౌరవం రెట్టింపయింది. అతడు తనను వాడుకుని, వదిలేసే అవకాశం ఉంది. కాని అలా చేయలేదు.

అప్పుడే అతడు నెమ్మదిగా తల తిప్పి ఆమె ముఖంలోకి చూశాడు.

"నేను... నేను తప్పుగా మాట్లాడానా అహల్యా?"

ఈసారి ఆమె గొంతులో సిన్సియారిటీ పలికింది. "లేదు సార్! నన్ను మీ మంచిమాటలతో సరిదిద్దారు'' అనేసి ఆమె వడివడిగా ఆ గదిలోనుంచి వెళ్ళిపోయింది.

★ ★ ★

ఇంట్లోకి అడుగుపెడుతున్నప్పుడే అతడికి ఉదయం తను తల్లిమీద కోపం తెచ్చుకుని, టిఫిన్ తినకుండా వెళ్ళిపోవడం గుర్తుకొచ్చింది. ఆ విషయం గుర్తుకురావడంతోనే మనసు బాధపడింది. అసలు తనలా చేయకుండా ఉండాల్సింది. తల్లి అన్నాక ఆమెకూ బిడ్డమీద ఏవేవో ఆశలుంటాయి. ఆమె బాధలోనూ కొంత వాస్తవం ఉంది.

ఏదేమయినా తను మరీ అంత తొందరపాటుతో ప్రవర్తించి ఉండకూడదు... మనసులోనే అనుకున్నాడు అతను. అందుకే ఇప్పుడు ఆమెను బుజ్జగించాలి...

అతడు హాలులోకి అడుగుపెట్టాక అటు ఇటు చూస్తే ఆమె కనిపించలేదు. తన కారు శబ్దం వినిపించగానే బెడ్‌రూంలోనుంచి వీల్ ఛెయిర్ నెట్టుకుంటూ హాలులోకి వచ్చే ఆమె ఈరోజు అలా చేయకపోవడంతో తల్లికి ఇంకా తనమీద కోపం తగ్గలేదని అర్థమయిపోయింది. బట్టలు మార్చుకుని వచ్చాక, ఆమెను బతిమలాడదాంలే అనుకుని వడివడిగా మెట్లెక్కి తన రూమ్‌లోకి వెళ్ళిపోయాడు. బాగా అలసటగా ఉండడంతో బెడ్‌మీద అలాగే వాలిపోయి కొద్దిక్షణాలు పైకప్పునే తదేకంగా చూస్తుండిపోయాడు.

కొద్దిసేపటికి అలసట తగ్గినట్టనిపించింది. లేచి బాత్‌రూమ్‌లోకెళ్ళి ముఖం కడుక్కుని వచ్చాడు. డ్రస్ మార్చుకున్నాక కిందికి దిగాడు.

హాలులోనుండి బెడ్‌రూమ్‌లోకి తొంగి చూస్తే తల్లి కనిపించలేదు. హాలులో లేకుండా బెడ్‌రూమ్‌లో కాకుండ ఆమె ఎక్కడికెళ్ళినట్టు? అతడికి కంగారేసింది.

అతడు తండ్రికేసి చూసి "అమ్మ ఎక్కడ?" అన్నట్టు సైగ చేశాడు. తనకు తెలియదన్నట్టు ఆయన చేతులు అడ్డంగా ఆడించాడు. అతడికి కంగారు మరింత పెరిగింది.

వంశీ చప్పున వెనుతిరిగి ప్రతి గదీ చూసుకుంటూ వెళ్లేసరికి చివరికి దేవుడి గదిలో కనిపించింది. అతడికి కాస్త నిశ్చింత

గా అనిపించింది. అయితే ఆమె ముఖం అతడికి కనిపించకుండా దేవుడికి అభిముఖంగా ఉంది. తల్లి ముఖంలోని భావాలు తెలియకపోవటంతోఇబ్బందిగా అనిపించింది. ఆమెకు ఇంకా నా మీద కోపం అలాగే ఉందేమో?'

అతడు అతికష్టం మీద గొంతు పెగల్చుకుని "అమ్మా!" అన్నాడు.

పార్వతమ్మ వెనుతిరిగి చూడలేదు.

చాలా ఇబ్బందిపడుతూనే అతడు లోపలికి అడుగువేసి వీల్‌ఛెయిర్ వెనుకగా నిలబడి "మమ్మీ నా మీద కోపం వచ్చిందా? ఉదయం నేను అలా ప్రవర్తించి ఉండకూడదు. అయితే ఆఫీసుకెళ్లాక మాత్రం చాలా బాధపడ్డాను''

అప్పటికీ ఆమె వెనుతిరిగి చూడకపోవడమే కాదు కనీసం నోరుకూడా విప్పలేదు.

అతడు మరో అడుగు ముందుకేసి ఆమెకు అభిముఖంగా నిలబడి తల్లి చుబుకం పట్టి తలపైకెత్తాడు. అప్పటివరకూ ఆమె తలదించుకుని ఉండడంతో తను గమనించలేదుగానీ ఆమె కళ్లనుండి నీళ్లు ధారాపాతంగా వర్షిస్తున్నాయి. ఆమె రెండు చేతులూ జోడించి దేవుడికి నమస్కరిస్తోంది. అతడికి గుండెల్ని ఎవరో పిడికిట పట్టి బిగించినంత బాధ కలిగింది. అతడు చప్పున ఆమె ముందు మోకాళ్లపై కూర్చున్నాడు. "అమ్మా అమ్మా ఏడవకమ్మా! చెప్పానుగా ఉదయం నాకేమయిందో నాకే తెలియదు. నువ్వు పెళ్లి ప్రస్తావన తీసుకురావడంతో చిరాకనిపించడంతో అలా లేచి వెళ్లిపోయాను. అంతేతప్ప నిన్ను బాధపెట్టాలని అలా చేయలేదమ్మా! నువ్వు ఇంతగా బాధపడతావని నేను అనుకోలేదు కూడా''

ఆమె మౌనాన్ని వదల్లేదు.

"ప్లీజ్ అమ్మా! నిన్నింకెప్పుడూ ఇలా బాధపెట్టను. నా మాట నమ్ము''

"బాధపెట్టను అంటున్నావుగానీ పెళ్లి చేసుకుంటాను అని మాత్రం అనటంలేదు'' ఆమె చప్పున అంది.

ఆమె మాట్లాడడం ఆనందం కలిగించినా ఆమెకు జవాబు ఏం చెప్పాలో మాత్రం అర్థం కాలేదు. "అదికాదమ్మా..." మరేదో అనబోయాడు.

"నువ్వు మరేం మాట్లాడకు వంశీ! నీ గురించి ఆలోచిస్తుంటే నాకసలు నిద్రపట్టడంలేదు. ఇంటికి దీపం ఇల్లాలు అన్నారు కాని ఆ దీపం లేని ఈ ఇల్లు కళావిహీనంగా కనిపిస్తుంటే నేనే కాదు మాట్లాడలేని మీనాన్నగారు కూడా మౌనంగా రోదిస్తూ ఉన్నారు. అసలు మా పరిస్థితికే మేం ప్రతిక్షణం కుమిలిపోతూ ఉన్నాం. ఆ బాధకు ఇప్పుడు నీ గురించిన బాధకూడా తోడయింది. మాకీ బతుకు నరకంగా మారింది''

అతడికి ఆ క్షణం తన మనసులోని బాధ దించుకోవాలనే అనిపించింది. కాని అతడికింకా ఓ అనుమానం మిగిలే ఉంది. తన తల్లి తన మనసులోని భావాన్ని సరిగా అర్థం చేసుకోగలదా?

"చెప్పరా వంశీ! నిన్ను ఇలా చూస్తూ బతకాల్సిందేనా? ఈ ఇంట్లో కోడలు పిల్ల తిరుగుతుంటే చూసే భాగ్యం లేదా? మనుమలతో ఆడుకునే అదృష్టం మాకు ఈ జన్మకు ఉండదా?"

అతడు ఒక నిర్ణయానికి వచ్చినట్టు, నెమ్మదిగా పైకిలేస్తూ పలికాడు "అమ్మా! నేను ఇప్పుడే ఏమీ చెప్పలేకపోవచ్చు. కాని అతి త్వరలో మీకు నా నిర్ణయం తెలియజేస్తాను. అప్పటివరకూ నన్ను వత్తిడి చేయొద్దు ప్లీజ్'

ఆమెకు కొంత తృప్తి కలిగినట్టుంది. కుడి చెయ్యి నెమ్మదిగా ముందుకు పోనిచ్చి కొడుకు చేతిని గుప్పిట్లోకి తీసుకుంది. "వంశీ! నిన్ను బాధపెట్టడం మా అభిమతం కాదురా! మా వైపు నుండి కూడా ఆలోచించు. అలా ఆలోచించగలిగే శక్తి నీకు ఉందని నాకూ తెలుసు. మరో మాట! నువ్వు మేము చూసిన సంబంధమే చేసుకుతీరాలని





రూలేం లేదు. నీకు నచ్చిన అమ్మాయిని ఎవరిని పెళ్లాడినా మాకభ్యంతరంలేదు''

"అలాగే'' అతడు తలాడించాడు.

అరనిముషం తర్వాత వీల్‌ఛెయిర్‌ని తోసుకుంటూ దేవుడి గదిలో నుండి హాలులో కొచ్చాడు.

హాలులోని సోఫాలో తను కూర్చుంటూ వరాలుని కేకేసాడు. వరాలు వచ్చాక ఆమెకు చెప్పాడు "కాఫీ పట్టుకురా వరాలూ''

ఐదు నిముషాల తర్వాత వరాలు కాఫీ పట్టుకొచ్చి అతడికి అందించింది. వేడి కాఫీ గొంతులోనుండి కిందికి దిగుతుంటే కొద్దిగా రిలాక్స్‌గా అనిపించింది.

మరో పదినిముషాలు అలాగే కూర్చున్నాక అతడు తల్లివైపు తిరిగి అడిగాడు. "అమ్మా! ముఖం కడుక్కుంటావా?"

ఆమె తలాడించింది.

అతడు ఆమెను బాత్‌రూమ్‌లోకి తీసుకెళ్లాడు. ముఖం కడిగించాక తండ్రి దగ్గర వదిలాడు. తండ్రి చేత మెడిసిన్ మింగించాక జ్యూస్ తాగించాడు. వారిద్దరి పనులు పూర్తి చేశాక తల్లితో చెప్పాడు, "అమ్మా! నేను కాసేపలా తిరిగొస్తాను. మనం ఆ తర్వాత భోంచేద్దాం"

"అలాగే'' తలాడించిందామె.

అతడు కారు తీసుకుని ఇంట్లోనుండి బయటపడ్డాడు. ఉదయం నుండి వరుసగా ఎదురయిన సంఘటనలతో వికలమయిన మనసుకు కాస్త ఓదార్పు కావాలనిపించింది. ఆ సమయంలో తనను ఓదార్చగలిగిన శక్తిగల వ్యక్తి ఎవరో అతడికి తెలుసు...

కారు రేణుక ఇంటివైపుగా వెళ్లసాగింది.

పావుగంట తర్వాత అతడు రేణుక ఇంటి పోర్టికోలో కారు ఆపి హాలులోకెళ్లి అటూ యిటూ చూశాడు.హాలులో రేణుక కనిపించలేదు.

"రేణుకా..."

"ఆc ఇక్కడ..." రేణుక గొంతు వంట గదిలోనుండి వినిపించింది. అతడు అటుగా నడిచాడు.

ఆమె దూరంనుండే అతడిని చూసి "హాయ్ వంశీ'' అంది.

అతడు కిచెన్ దగ్గరగా నడిచాక వాకిలికి భుజం తాకించి ఆమెను చూస్తూ నిలబడ్డాడు.

ఆమె అతడిమీద నుండి చూపులు మరల్చుకుంది. స్టౌమీదున్న బాణలిలో పప్పు తిరగమోత వేస్తూ అంది "ఆదివారం తప్ప మరేరోజూ కనిపించని తమరు ఈ రోజేంటిలా హటాత్ దర్శనం ఇచ్చారు?"

అతడు జవాబివ్వలేదు.

ఆమె చెప్పింది "ఒక్క నిముషం వంట పూర్తయిపోవచ్చింది. వచ్చేస్తాను''

"నోప్రాబ్లమ్''

"పోనీ అలా నిలబడడంకన్నా ఆ స్టూల్ తెచ్చుకుని కూర్చో''

అతడు తలాడించి హాలు మధ్యనున్న టీపాయ్‌ని తెచ్చుకుని గడప పక్కనే వేసుకుని కూర్చున్నాడు. ఆ తర్వాత అడిగాడు "రఘురామ్‌గారు డ్యూటీ నుండి ఇంకా రాలేదా?"

"వచ్చారు ఏదో పని ఉందంటూ మళ్లీ వెళ్లారు. బహుశా పురుషోత్తమ్‌గారింటి కనుకుంటా. వీరిద్దరూ కలసి ఓ హాస్పిటల్ స్టార్ట్ చేయాలనే ఆలోచనలో ఉన్నారు''

"మంచి ఆలోచనే''

ఆమె వంట పూర్తవడంతో అతడి వైపు తిరిగి అడిగింది. "కాఫీ తీసుకుంటావా?"

"విత్ ప్లెజర్'' బదులిచ్చాడు అతడు.

ఆమె స్టౌమీద గిన్నెపెట్టి, ఫ్రిజ్ వైపు తిరిగి అందులోనుండి పాలు తీసుకుంది.

కాఫీ తయారయ్యేసరికి ఐదు నిముషాలయింది. ఆమె కాఫీ కప్పు అతడికి అందిస్తూ అప్పుడే అతడి ముఖంలోకి పరిశీలనగా చూసి ప్రశ్నించింది. "చాలా అనీజీగా కనిపిస్తున్నావ్ ఎనీ ప్రాబ్లమ్?"



"నోనో! అలాంటిదేమీలేదు''

ఆమె భుజాలెగరేసింది. "ఆల్‌రైట్! హాలులో కూర్చుందాం పద వంశీ''

అతడు ఆమె వెనుకే హాలులోకి నడిచాడు. ఇద్దరూ ఎదురెదురుగా సోఫాల్లో కూర్చున్నారు.

ఆ సమయంలో వంశీకృష్ణ మనసు ఓదార్పు కోరుతోంది. కాని కృత్రిమంగా అలవాటయిన గాంభీర్యం, ఆమెముందు మనసు విప్పడానికి అయిష్టపడుతోంది.

"వంశీ''

అతడు చప్పున తలెత్తి ఆమె ముఖంలోకి చూశాడు.

"నువ్వు నాకు చెప్పేందుకు కూడా సంశయిస్తున్నావా?"

ఆ ప్రశ్న కన్ఫ్యూజింగ్‌గా ఉండడంతో "నువ్వేమంటున్నావో అర్థం కావటంలేదు'' అన్నాడు అతడు.

"నాకు అర్థమవుతూనే ఉంది వంశీ అసలు వర్కింగ్‌డేస్‌లో నువ్విలా రావడమే నాకు ఆశ్చర్యం కలిగించింది. అలాగే ఏ పత్రికో చదువుకుంటూ నేను వచ్చేవరకూ హాలులో కూర్చునే నువ్వు స్టూల్ తెచ్చుకుని కిచెన్ దగ్గర కూర్చున్నప్పుడే నీ ముఖంలోకి పరిశీలనగా చూసి ఏదో విశేషం ఉంది అనుకున్నాను. నువ్వెందుకో బాధ పడుతున్నావని నాకర్థమయింది. అయితే ఇంత సేపూ నీ బాధ గురించి నువ్వే చెపుతావుకదా అని చూస్తున్నాను. కాని సంశయిస్తూనే ఉన్నావ్''

అతడు ఇక ఆగలేకపోయాడు. మనసులోని బాధ వరదపొంగులా మారింది. అతడు ఉదయమే తల్లి పెళ్లి ప్రస్తావన తీసుకురావడం తను కసురుకోవడం మొదలుకుని సాయంత్రం ఆమెను ఊరడించడం వరకూ రేణుకకు చెప్పేశాడు. స్నేహితురాలికి అలా చెప్పడంతో గుండెలలోని బరువు కొంత తగ్గినట్లనిపించింది.

అంతా విన్నాక రేణుక కొద్దిక్షణాలు మౌనంగా ఉండిపోయింది. ఆ తర్వాత పలికింది "ఒకవైపు ముసలితనం, మరోవైపు విధి చేసిన గాయాలతో అసలే బాధపడుతున్న ఆ తల్లితండ్రులను మరింత బాధపెట్టడం అంత మంచిదికాదు వంశీ''

"నువ్వేమంటున్నావో నీకు అర్థమవుతోందా? నేను వాళ్లను బాధపెట్టాలని బాధపెట్టడంలేదు. నా మనసులోని బాధ ఎవ్వరూ అర్థం చేసుకోరేం?"

"నీ బాధ గురించి తర్వాత చెపుదువు. ముందీ విషయమ్మైనా చెప్పు వంశీ. నువ్వు ఎవరినైనా ప్రేమించావా? ఆ ప్రేమను మరచిపోలేకే ఈ పెళ్లి వద్దంటున్నావా? చెప్పు"

అతడు ఆమెకేసి అదోలా చూశాడు. వెంటనే తల విదిలించేస్తూ నవ్వాడు. "నువ్వే కాదు రేణూ! అమ్మానాన్నా ఈ సమాజంలోని ఎవ్వరూ ఎవ్వరూ నన్ను అర్థం చేసుకోవడంలేదు. నేను పెళ్లి చేసుకోవడానికి ఇష్టపడకపోతే ఏదో ప్రేమ విఫలమ్మైన కారణాన్నో లేక నాలో ఏదో లోపం ఉండడం మూలానో నేను పెళ్లి అంటే వ్యతిరేకత చూపుతున్నానని అందరూ అనుకుంటున్నారని నాకు తెలుసు. నిజానికి నేను పెళ్లి అంటే ఎందుకు వ్యతిరేకత చూపుతున్నానో మీకెలా చెప్పను? నా మనసులోని బాధ ఎవరు అర్థం చేసుకోగలరు'' అతడి గొంతు జీరబోయింది.

"ఏమిటి నీ బాధ?"

అతడు చప్పున కూర్చున్న చోటునుండి లేచాడు. కిటికీ దగ్గరగా వెళ్లి నిలబడ్డాడు. "రేణూ! నేను నిన్నో ప్రశ్న అడుగుతాను సూటిగా సమాధానం చెప్పు?" చూపులు కిటికీలోనుండి బయటకు ప్రసరింప చేస్తూ పలికాడు.

వంశీకృష్ణ ఎలాంటి ప్రశ్న అడగబోతున్నాడో తెలియకపోవడంతో ఆమెకు కాస్త కంగారు కలిగింది. అందుకు అతడు అడిగిన తీరే కారణమయింది. ఆమె అతడికేసి వింతగా చూస్తూ "అడుగు'' అంది.





# ఏరిన ముత్యాలు

★ అణుకువ, సూటిగా చెప్పేనిజం, సామ్రాజ్యాలకంటే శక్తివంతమని నిరూపించిన మానవోత్తముడు మహాత్మాగాంధీ.

–వాన్‌డెన్‌బర్గ్

★ ప్రేమ, విశ్వాసం హృదయానికి సంబంధించిన విషయాలు. ఈ రెండు వస్తువులను మనం బజారులోగాని, తుపాకి చూపించి బలవంతంగాగానీ పొందలేము.

–నెహ్రూ

★ మీ జ్ఞానం అంతా పుస్తకాలనుంచి వచ్చినదైతే మీరు చాలా తరుచుగా ఒప్పు కంటే తప్పేచేస్తారు.

–లెబనీస్

★ ప్రేమ, నైపుణ్యం కలిసి పనిచేసేటపుడు ఒక ఉత్తమకృతిని ఆశించవచ్చు

–రస్కిన్

★ మూర్ఖులు మరణిస్తారు. కానీ ఇతర మూర్ఖులు ఎడతెగకుండా మందలుగా వస్తున్నంతకాలం మూఢత్వం నిల్చివుంటుంది.

–భండారి

★ జీవితం ఒక నాటకం వంటిది. దాని పొడవుకంటే నటనలోని శ్రేష్టత ముఖ్యం.

– సెనేకా

★ చెడ్డ మనుష్యలు లేకపోయినట్లయితే మంచి న్యాయవాదులు కూడా ఉండరు.

–డికెన్స్

★ కేవలం భయంవల్ల దేవుణ్ణి పూజించేవారు ప్రత్యక్షమైతే దయ్యాన్ని కూడా పూజి స్తారు.

–పుల్లర్

★ పశుప్రాయుడైన మనిషి నుంచి మనలను వేరు చేసేవి క్రమశిక్షణ మరియు నిగ్రహం.

–గాంధీ

★ ఒక మనిషిని వివేకవంతునిగా మార్చలేని తెలివితేటలు అతణ్ణి అహంకారిగా, గర్విష్ఠిగా మారుస్తాయి.

–అడిసన్

★ మనం అజ్ఞానులమని గ్రహించగల్గటమే జ్ఞానానికి మొదటి మెట్టు.

–సిసిల్

సేకరణ: పట్నం శేషంశెట్టి

# చతుర సమీక్ష



ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలుబడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీ లోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంప్లెక్స్, హైదరాబాదు-500 082 అనే చిరునామాకు పోస్ట్ చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ.100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

**ఫిబ్రవరి చతుర నవల నీడ**

సమీక్షకుని పేరు : ____________________

చిరునామా ____________________

____________________

____________________

"ఓ అమ్మాయి పెళ్లి అనే తంతు ద్వారా ఓ మగాడిని తన జీవితంలోకి ఆహ్వానించేప్పుడు తనేం కోరుకుంటుంది''

ఆ ప్రశ్న అంతగా అర్థంకాకపోవటంతో "విపులంగా చెప్పు వంశీ" అందామె.

అతడు తల తిప్పలేదు. చూపులు శూన్యంకేసే చూస్తుంటే పెదవులు పలికాయి. "నేను అనుకోవడం ఓ అమ్మాయి మగాడిని పెళ్లి తంతు ద్వారా తన జీవితంలోకి ఆహ్వానించేప్పుడు ఆమె అతడి నుండి ఎన్నో కోరుకుంటుంది. అతడితో ఏకాంతం, తరచుగా షికార్లు, అప్పుడప్పుడూ సినిమాలు, ఎప్పుడయినా దూరతీరాలకు సాగిపోయి కొద్దిరోజులు హాయిగా గడపడం.. ఇవన్నీ ప్రతి కన్నెపిల్ల కోరుకునే కోరికలేనని నా ఉద్దేశ్యం. మరి నువ్వేమంటావ్ రేణూ!"

"కాదని ఎలా అనగలను? ప్రతి కన్నెపిల్ల మదిలో కదలాడే సహజసిద్ధమయిన కోరికలే అవి''

"రేణూ! మరి ప్రతి కన్నెపిల్ల మదిలో కదలాడే కోరికలు తెలిసి కూడా నువ్వు నన్ను పెళ్లి చేసుకోమని ఎలా అనగలుగుతున్నావో నాకర్థం కావడంలేదు''

"ఎందుకనకూడదు?"

అప్పుడు అతడు ఆమెవైపు తిరిగాడు. ఆ క్షణం అతడి కన్నుల్లో కదలాడిన ఓ అపురూపమైన భావం అస్పష్టంగానే అయినా ఎంతో కొంత అర్థంకావడంతో ఆమె విభ్రమంగా అతడికేసే చూడసాగింది.

"రేణూ! నీకూ తెలుసు అమ్మానాన్నల పరిస్థితి ఏమిటో? వారి పనులు వాళ్లు చేసుకోలేరు, ఎవరో చేసిపెట్టాలి. రేపు ఆ ఇంటికి కోడలుగా వచ్చే అమ్మాయి కోటికోరికలతో ఆ ఇంట అడుగుపెడుతుంది. ఆమె కళ్లు తెరిచేసరికి నేను అమ్మానాన్నల బెడ్‌రూమ్‌లో వాళ్లకి సేవచేసుకుంటూ ఉంటాను. సాయంత్రం తను అందంగా అలంకరించుకుని ఎక్కడికయినా వెళ్దాం అనుకునేసరికి నేను వాళ్లని కనిపెట్టుకుని ఉండాల్సి రావచ్చు. అప్పుడు ఆమెకు చిరాకు కలగొచ్చు. చిరాకులతో జరిగే సంసార జీవితంలో సుఖం దొరకదు రేణూ! అసంతృప్తితో బతికే ఆడది మగాడికి బాధను మాత్రమే మిగుల్చుతుంది. ఆ అనుమానంతోనే..."

ఎంతోకాలంగా దాచుకున్న నిజం ఆ క్షణం బయటపడిపోయింది.

ఒక్కసారిగా అతడి మనసు తేలికపడింది. ఇంతకాలం తన మనసులోనే కదలాడుతున్న అనుమానం, తన నిర్ణయం ఆమెకు చెప్పేశాడు.

ఆమెకు అర్థమయింది. అతడు ఇంత కాలం పెళ్ళంటే ఎందుకు భయపడుతున్నాడో! అయితే, ఆ భయం అర్థంలేనిదిగానే అనిపించిందామెకు.

అందుకే అంది. "వంశీ! నీది అపోహ మాత్రమేనని నా అనుమానం"

"అలా అని ఎలా అనగలవ్?" అతడు చప్పున ప్రశ్నించాడు.

"ఆడపిల్లకు కోటికోరికలు ఉండొచ్చు. కాని ఆమెకు ముందుగానే మీ ఇంటి పరిస్థితి తెలిసి ఉంటుంది కాబట్టి, అసంతృప్తి పడే అవకాశం ఉండదు. పైగా నీ మంచిమనసు అర్థంచేసుకుని నీకు సహకరిస్తుందని ఎందుకనుకోకూడదూ?"

"అనుకోవడానికేం అనుకోవచ్చు. అయినా ఆమె అలా సహకరించడంలో అనుకోకుండానే తన కోరికలు చంపేసుకోవడం జరుగుతుంది. ఓ అమ్మాయి తన కోరికలు తనలోనే అణిచేసుకుని నాతో కాపురం చేయడం నాకిష్టంలేదు''

అతడి మనసు ఆ క్షణమే పూర్తిగా అర్థంకావడంతో, ఆమె సోఫాలోనే ముందుకు తూలింది. 'రాబోయే భార్య... తాలూకూ కట్నకానుకల గురించి మాత్రమే ఆలోచించే మగాళ్ళున్న ఈ సమాజంలో ఓ ఆడపిల్ల కోరికలు తన కారణంగా బలికాకూడదన్న ఆలోచనతో అసలు పెళ్ళే వద్దనే పురుషులు ఈ ప్ర

పంచంలో కనిపించరుగాక కనిపించరు' అందుకే ఆమె అతడికేసి కళ్ళింతలు చేసు కుని అపురూపంగా చూసింది.

'నిన్నామొన్నటివరకూ తనతో నవ్వుతూ, తుళ్ళుతూ తిరిగిన తన మిత్రుడు నేడు కనపరచిన అసాధారణ వ్యక్తిత్వానికి చేతులె త్తి నమస్కరించాలనిపించింది. ఇతడు నేడు పెళ్ళి వద్దంటే వద్దనవచ్చుగాక, రేపెన్నడ యినా ఏ స్త్రీనయినా తన జీవితభాగస్వామి గా ఆహ్వానిస్తే, ఆమె అంత అదృష్టవంతురా లు మరొకరుండరు...' మనసులోనే అను కుంది రేణుక.

మిత్రుడి ఆదర్శాన్ని అభినందించగలి గిందిగానీ అతడి ఆలోచనా ధోరణిని మాత్రం సమర్థించలేకపోయింది. అందుకే అంది "ఏమో వంశీ! నువ్విలా ఆలోచించడం మాత్రం సరికాదనే అనుకుంటున్నాను''

"అమ్మానాన్నలకు చెపితే వాళ్ళు ఇదే మాట అంటారని నాకు తెలుసు. అందుకే, ఏదో సాకు చెప్పి తప్పించుకుంటున్నానే తప్ప, వారికి నా మనసులోనిమాట చెప్ప డంలేదు. ఇంతకాలం నా మనసులోనే దాచు కుని వ్యథపడుతున్న రహస్యాన్ని మొట్టమొ దటిసారిగా నీ ముందే బయటపెట్టాను. అర్థంచేసుకోగలవనే అనుకుంటాను''

రేణుక మరేం మాట్లాడలేకపోయింది.

మరో పావుగంట తర్వాత అతడు లేస్తూ "వెళ్ళొస్తాను రేణూ'' అన్నాడు.

"మరికాసేపు కూర్చో. ఇంటికెళ్ళి ఏంచే స్తావ్?"

"నీకు తెలిసిందే కదా? అమ్మా నాన్న నాకోసం ఎదురుచూస్తుంటారు''

"తెలుసు. నువ్విప్పుడు వెళ్ళి వాళ్ళ సేవ చేసుకోవాలి. వారికి మరొకరు సేవచేయడం ఇష్టంలేకనే కదా, తమరు పెళ్ళిచేసుకోకుండా ఉండేది'' వాతావరణాన్ని తేలిక పరి చేందుకు కాబోలు ఆమె నవ్వింది.

అతడు బలవంతంగా నవ్వి, ముందుకు నడిచాడు.



ఫోన్ రింగవుతూ ఉంటే, వంశీ బెడ్‌మీద నే బద్ధకంగా పక్కకు ఒరిగి రిసీవర్ చేతిలోకి తీసుకుని "హలో..." అన్నాడు.

అవతలివైపు నుండి వినిపించిన మాటలు అతడిని ఎక్సైట్ అయ్యేలా చేశాయి. అతడు ఒక్క ఉదుటున లేచి బెడ్‌మీదనే కూర్చున్నా డు. 'కనెక్ట్ హిమ్ మేడమ్' ఉద్విగ్నతను బయటపడనివ్వకుండా పలికాడు అతడు.

రెండు క్షణాల తర్వాత లైన్‌లోకొచ్చాడు సదాశివరావ్.

"యస్ సార్! ఐయామ్ వంశీ. వంశీ రియల్ ఎస్టేట్ యం.డి.ని'' ఫోన్‌లోనే తన నుతాను పరిచయం చేసుకున్నాడు. అయితే ఒక మంత్రి అంత ఉదయమే తనకు ఎందుకు ఫోన్ చేశాడో ఎంత ఆలోచించినా అర్థంకాలేదు.

"మీకో గుడ్‌న్యూస్ వంశీగారు'' సదాశి వరావ్ అన్నాడు.

"చెప్పండి సార్'

"ప్రతి సంవత్సరం నేషనల్ లెవెల్‌లో ఇవ్వబడే బెస్ట్ బిజినెస్‌మెన్ 'ఎక్సలెన్సీ అవార్డ్' ఈ సంవత్సరం మనరాష్ట్రంలో మీకొ చ్చింది. ఈ విషయం ఇప్పుడే ఢిల్లీనుండి





ఫోన్‌చేసి చెప్పారు''

అతడు కొద్దిక్షణాలపాటు ఊపిరిపీల్చుకో వడం కూడా మర్చిపోయాడు. తను సాధించింది చిన్నదేమీ కాదని అతడికి తెలుసు.

అవతలివైపునుండి మినిస్టర్ గొంతు విని పిస్తూనే ఉంది. "మన రాష్ట్ర చరిత్రలో ఆ అవార్డుకి ఎన్నికయిన అతి పిన్నవయస్కులు మీరేనని తెలిసింది మిస్టర్ వంశీ! కంగ్రాచ్యులేషన్స్''

అప్పటికి తేరుకున్నట్టు అతడు మెల్లగా గొంతు పెగల్చుకుని "థాంక్యూ సార్' అన్నాడు.

"వీలయితే మీరు ఓసారి మా ఆఫీసుకు రండి. మనం కాసేపు మాట్లాడుకోవచ్చు''

"తప్పకుండా వస్తాను సార్'

అవతలివైపు ఫోన్ పెట్టేశాకే వంశీ రిసీవర్ హుక్ మీద ఉంచి చప్పున మంచం దిగాడు. అత్యుత్సాహంతో ఎగిరి గంతులేయాలనిపించింది. తనకు 'బిజినెస్ ఎక్స్‌లెన్సీ అవార్డ్...' రాష్ట్రపతి చేతులమీదుగా అందుకోబోయే ఆ అవార్డ్ వలన తన కీర్తిప్రతిష్టలు ఇనుమడించటమే కాదు. బిజినెస్ ప్రపంచంలో తనకో ప్రత్యేకమయిన గుర్తింపు కలుగుతోంది. ఈ వార్త బయటకు వచ్చిన మొదటిరోజే తన కంపెనీ షేర్ విలువ పెరిగిపోతుంది''

అతడు కిటికీ దగ్గరగా వెళ్ళాడు. అటు చూస్తే ఆమె... ఎప్పటిలానే పెరట్లో పనిచేసుకుంటూ...

ఆ ఆనందసమయంలో, అపురూపమయిన వాతావరణంలో ఓ సుందరదృశ్యం చూస్తున్న అనుభూతి కలిగింది అతడికి.

అతడు చాలాసేపు అలాగే, తదేకంగా, తన్మయత్వంతో అటే చూస్తుండిపోయాడు.

పని చేసుకుంటున్న ఆమె హఠాత్తుగా తలతిప్పి అటుకేసి చూసింది. ఆమె చూపులు తనను తాకడంతోనే, అలా జరుగుతుందని ఊహించని అతడు ఉలిక్కిపడ్డాడు. అప్పటికీ పక్కకు తప్పుకోవాలని ప్రయత్నం చేశాడు... కాని అలా చేయలేకపోయాడు.

ఆమె చూపులు తనను పలకరించాయేమో! అయితే పెదాలు విడివడలేదు. దాంతో తను కూడా పలకరింపుగా నవ్వాలనుకున్నా నవ్వకుండా అలాగే ఉండిపోయాడు.

గౌతమి తల తిప్పుకుంది. అతడు అలాగే చూస్తున్నాడు. అప్పటికి తన పని పూర్తవడంతో ఆమె లోపలికెళ్ళిపోయింది. అతడిక అక్కడ ఉండలేకపోయాడు. వడివడిగా మెట్లు దిగి అమ్మానాన్నల బెడ్‌రూమ్‌లోకి వెళ్ళాడు.

"నాన్నా! నాకు...నాకు బిజినెస్ ఎక్స్‌లెన్సీ అవార్డ్ వచ్చింది''

మాట్లాడే శక్తిలేని ఆయన కన్నులతోనే ఆశ్చర్యం ప్రకటించాడు. కాసింత ముందుకు వంగుతూ "య్యా...య్యా'' అన్నాడు. అంటే 'ఇది నిజమా?' అని ఆయన ప్రశ్నించడమని అర్థమయింది.

"అవును నాన్నా! ఇది నిజం. ఇప్పుడే మంత్రిగారు ఫోన్‌చేసి మరీ అభినందిస్తూ చెప్పారు''

అప్పటివరకూ ఆ తండ్రీకొడుకులకేసి అయోమయంగా చూస్తున్న పార్వతమ్మ "ఆ అవార్డ్ ఏమిట్రా?" అని ప్రశ్నించింది.

"బిజినెస్ ప్రపంచానికి సంబంధించినంతవరకూ ఇది చాలా పెద్ద అవార్డ్ అమ్మా! బిజినెస్‌లో ఎక్స్‌పోర్ట్, ప్రోడక్ట్ క్వాలిటీ, కొత్త ఇన్వెన్షన్స్... అలాంటి విభాగాలలో అత్యుత్తమ ప్రగతి సాధించినవారికి రాష్ట్రపతి చేతులమీదుగా ఈ అవార్డు అందజేస్తారు. ఈ అవార్డ్ అందుకోవడం కొంతమంది బిజినెస్ పీపుల్‌ధ్యేయం అంటే అతిశయోక్తి కాదు. మనకిది కోరుకోకుండానే వచ్చింది''

తన బిడ్డ సాధించిన విజయం యొక్క

విలువ అప్పుడే ఆమెకు అర్థమయినట్టుంది. ఆమె ముఖం ఆశ్చర్యానందాలు కలగలసి అదోరకమయిన కాంతితో మెరిసిపోయింది.

మరికాసేపు ఆ ఆనందం వారితో పంచుకున్నాక లేచి తన గదిలోకి వెళ్ళాడు. అతడు తన మిత్రులకు శ్రేయోభిలాషులకు ఫోన్‌లోనే ఈ విషయం తెలియచేశాడు.

ఆరోజుకిక త్వరగానే ఆఫీసుకు బయలు దేరాడు.

కారు గేటు దాటి రోడ్డెక్కింది.

పది గజాలు ముందుకు సాగిందో లేదో ఎప్పటిలానే వినిపించాయి ఆ చప్పుళ్ళు.

దభ్... దభ్... దభ్

ఆ చప్పుళ్ళేమిటో అర్థంకావడంతోనే వంశీ ముఖంలో అప్పటివరకూ కదలాడిన ఆనందం చప్పున మాయమయింది. అతడి కాలు బ్రేకు పైకి చేరింది. కారు సడన్ బ్రేక్‌తో ఆగింది.

కొద్దిక్షణాల తటపటాయింపు తర్వాత అతడు కారు ఇంజన్ ఆఫ్ చేశాడు. విచక్షణా జ్ఞానం హెచ్చరిస్తున్నప్పటికీ, ఆమె పడే బాధ గుర్తుకురావడంతోనే అతడిక కారులో కూర్చోలేకపోయాడు.

కారు దిగి వడివడిగా ఆ ఇంట్లోకి వెళ్ళాడు.

అతడు ఆ ఇంటిముందు గదిలోకెళ్ళేసరికి సత్యమూర్తి, గౌతమిని గోడకు హత్తుకునేలా చేసి, ఆమె మెడను నొక్కే ప్రయత్నం చేస్తున్నాడు. ఆమె గిలగిలా కొట్టుకుంటోంది. అరిచేందుకు కూడా గొంతు పెగలకపోవడంతో అదోలా మూలుగుతోంది.

"ఏయ్ మిస్టర్! ఏమిటి... ఏమిటి నువ్వు చేసేపని?"

సత్యమూర్తి ఆమెను తన పిడికిలి పట్టు నుండి తప్పించి, తదేకంగా వంశీకేసి చూశాడు. ఆ సమయంలో మొదట కొద్దిగా కంగారనిపించినా, అంతలో అతడి సహజసిద్ధమైన మొండితనం మనిషిలో ధైర్యాన్ని నింపింది. "ఏం చేస్తున్నానయ్యా! ఏంచేస్తున్నాను? నా పెళ్ళాన్ని నేను కొట్టుకుంటున్నా! అది నీకు ఇబ్బందిగా ఉందా?... పోవయ్యా పో! నేను మీ ఇంటికొచ్చి నీ పెళ్ళాన్ని కొడితే అప్పుడు అడుగు''

"ఆడదాన్ని అలా కొట్టడానికి నీకు సిగ్గనిపించడంలేదూ?"

"సిగ్గా? అంటే ఆడాళ్ళు మగాళ్ళముందు ప్రదర్శించేదా?! అది మనకెందుకుంటుంది భాయ్. మనం మగాళ్ళం"

సత్యమూర్తికి సిగ్గు, భయం, బిడియంలాంటివేవీ లేవని అతడికి అర్థమైపోయింది. లేకపోతే ఏ సాధారణ మానవుడయినా ఇలాంటి సందర్భాలలో కాస్త సిగ్గు, బిడియాలు ప్రదర్శిస్తాడు. అవి లేని సత్యమూర్తిని తనేవిధంగా కంట్రోల్ చేయగలడు?

అప్పటికీ ఆశ చావక కాస్త బెదిరింపు ధోరణిలోనే పలికాడు. "నీకు సిగ్గులేక పోతే పోయింది. కాని కట్టుకున్న భార్యను ఇలా కష్టపెట్టడం మానవత్వమనిపించుకోదు. చట్టరీత్యా కూడా అది నేరం"

"అయితే ఇప్పుడు నువ్వు పోలీసులను పిలిచి నన్ను పట్టిస్తావా?... పట్టించయ్యా పట్టించు... అది బాగానే ఉంటుందిగాని, నేను జైలుకి వెళ్ళిపోతే ఆ తర్వాత నా పెళ్ళాం... ఇదిగో దీని పరిస్థితి ఏమిటంట? దీన్ని దాని పుట్టింటికి పంపించేస్తావా? లేక నువ్వే ఉంచుకుంటావా?"

మరోచోటు అయిఉంటే కేవలం రెండు పిడిగుద్దులతో సత్యమూర్తిని నేలమీద పడిపోయి అల్లాడిపోయేలా చేసి ఉండేవాడే. కాని అది అతడి ఇల్లు. అందులోనూ అతడి భార్య ఎదురుగా కొట్టడం మరీ దారుణమైన విషయం.

"ఛీ ఛీ! నీలాంటి మనిషిని నేను ఎక్కడా చూడలేదయ్యా..."

"ఇప్పుడు చూశావుగా! ఇంక వెళ్ళు''




తనిక అక్కడ ఉండీ చేయగలిగింది ఏమీ లేదని అర్థమయిపోయింది. అదీగాక తను మరికాసేపు అక్కడ ఉంటే, ఆవేశంలో అత డినేమయినా చేయెచ్చు కూడా అని పించింది. అందువల్లే అతడు మెల్లగా వెనుతి రిగి ఆ ఇంట్లోనుండి బయటకు నడవసాగా డు.

వెనుకనుండి సత్యమూర్తి పెద్దగా నవ్వు తున్నాడు. అది తనను చూసే అన్న విషయం అర్థమయిపోతూనే ఉంది. ఆవేశం వస్తున్నా అతికష్టంమీద అణచుకున్నాడు.

కారెక్కి స్టార్ట్‌చేసి విసురుగా ముందుకు పోనించాడు.

ఆఫీస్ చేరాక తన ఛాంబర్‌లోకెళ్ళి కుర్చీలో కూర్చుని తల పట్టుకున్నాడు.

అప్పుడే తలుపు తెరుచుకుని లోపలికి వచ్చిన అహల్య "కంగ్రాచ్యులేషన్స్ సార్' అంది.

అతడు తలెత్తి ఆమె ముఖంలోకి చూశా డు "ఎందుకు?"

ఆ ప్రశ్న ఆశ్చర్యం కలిగించినట్టు, ముఖం అదోలాపెట్టి "అదే... అదే సార్! మీకు బిజినెస్ ఎక్స్‌లెన్సీ అవార్డ్ వచ్చిందని తెలిసింది'' ఒకవేళ తను విన్నది అబద్ధ మేమో అన్న అనుమానంతో అడిగింది. లేకపోతే అంత గొప్ప అవార్డ్ వచ్చిందని తెలిసి కూడా ఈయన ఇలా నిరుత్సాహంగా తలపట్టుకుని కూర్చోవడం ఏమిటి?

అప్పుడే ఆ విషయం గుర్తుకొచ్చినట్టు "ఓ... అదా?... థాంక్యూ'' అన్నాడు అతడు.

ఆమెకు చిత్రంగా ఉంది అతడి ప్రవర్తన. కాని 'ఎందుకలా ఉన్నారు?' అని మాత్రం అడగలేకపోయింది. ఆరోజు అలా ప్రవర్తించ కుండా ఉండి ఉంటే, ఒకవేళ అడగగలిగి ఉండేదేమో!

అతడికీ ఎందుకనో ఉదయం సదాశి వరావ్ ఫోన్‌లో విశేషం చెప్పినప్పుడు కలిగి నంత ఆనందం కలగలేదు. మనసుకు కలిగే మరో బాధ అప్పటివరకూ ఉన్న ఆనందాన్ని పల్చన చేస్తుందా? అవుననే అనిపిస్తోంది.

వంశీ ఆలోచనల్లోకి జారిపోవడంతో ఆమె ఇక అక్కడ ఉండలేనట్టు కదలబోతూ చెప్పింది, "మీకీ అవార్డ్ వచ్చిందని తెలి శాక, చాలామంది ఫోన్ చేసి 'కంగ్రాట్స్' చెపుతున్నారు సార్! వాళ్ళ పేర్లు రాసి ఉంచా ను తెమ్మంటారా?"

అతడు కొద్దిసెకనులు ఆలోచించి తలా డించాడు. "తీసుకురా''

అహల్య ఛాంబర్‌లోనుండి బయటకెళ్ళి అరనిముషం తర్వాత లోపలికొచ్చి ఓ పేడ్ అతడి ముందుంచింది. "ఇకనుండి వచ్చే ఫోన్లు మీకు కనెక్షన్ ఇస్తాను సార్'

"అలాగే''

మరోనిముషం తర్వాతనే ఇంటర్‌కమ్ మోగింది. అతడు రిసీవ్ చేసుకున్నాడు. మరో రియల్ ఎస్టేట్ బిజినెస్‌మేన్ తనను అభినందిస్తూ మాట్లాడాడు. ఆయనకు 'థాంక్స్'' చెప్పాడు.

గౌతమి తాలూకూ విషయం మర్చిపోవ డంకోసం అతడు పనిలో మునిగిపోయాడు. లిస్ట్‌లోని పేర్లకు ఫోన్‌చేసి వాళ్లకు 'థాంక్స్' చెప్పడం, వచ్చే ఫోన్స్‌కి రిప్లయ్ ఇవ్వడం, ఇంకా తనకు ఆప్తులనుకున్నవారికి అవార్డ్ విషయం ఫోన్‌లోనే తెలియచేయడం... మొ త్తంమీద రోజంతా ఫోన్‌తోనే హడావుడిగా గడిచిపోయింది.

★ ★ ★

సాయంత్రం ఇంటికి వెళుతున్నప్పుడు, గౌతమి ఇంటిముందుకు చేరగానే మనసు లాగడంతో కారు ఆపుచేశాడు వంశీ.

ఆ సమయంలో సత్యమూర్తి ఇంట్లో ఉండడని ఖచ్చితంగా నిర్ణయించుకోవచ్చు. తాగుబోతులెవరూ సాయంత్రంవేళ ఇళ్ళకు చేరుకోరు. మందు పట్టించాకే ఏ అర్ధరాత్రి వేళో వాళ్ళకు ఇల్లు గుర్తుకువస్తుంది.

వంశీ ఇంట్లోకి నడిచాడు.



ముందుగదిలోనే కూర్చుని, కాగితం మీద పిచ్చిబొమ్మలేవో గీసుకుంటున్న గౌతమి, తన మీదకు పాకిన పొడవైన నీడను చూసి, చప్పున చూపులు మరల్చింది. నిలువెత్తు ఆకారం వంశీ వాకిట్లో నిలబడి కనిపించగానే ఒక్క ఉదుటున లేచి నిలబడింది.

అతడు అడిగాడు "నేను లోపలికి రావచ్చా?"

"రండి.. రండి''

అతడు లోపలికి నడిచాక, ఎదురుగా ఉన్న కుర్చీ చూపించింది.

వంశీ కుర్చీలో కూర్చున్నాక, ఆమె ముఖంలోకి చూసి అడిగాడు. "నేనిలా మీ ఇంట్లోకి రావడం మీకు ఇబ్బందిగా అనిపించడంలేదు కదా?"

"లేదు... లేదు''

అతడు కొద్దిక్షణాలు నిశ్శబ్దం సాగాక పలికాడు "ఈ ఉదయం నేను మీ ఇద్దరి మధ్యకు రాకూడదనే అనుకున్నాను. కాని అలా ఎక్కువసేపు ఉండలేపోయాను''

"మీరు మంచి మనసుతోనే ఆయనకు నచ్చచెప్పాలని వచ్చారు. కాని ఆయన మీరు వెళ్ళాక మరీ రెచ్చిపోయారు. 'తనకి నీమీద అంత ఇంటరెస్ట్ ఏమిటే అంటూ...' ఛీ ఛీ! ఆయనసలు మనిషేకాదు''

మాటలేకాదు, ఆ మాటలతోపాటు మరీ రెచ్చిపోయి కొట్టి ఉంటాడని అర్థమవుతూనే ఉంది. అందుకే అన్నాడు, "నన్ను క్షమించండి... నేను మీ మధ్యకు వచ్చి మీకు మరింత కష్టం కలిగించాననుకుంటాను''

"ఈయనతో పెళ్ళి జరిగినప్పటినుండి అది నా ధినచర్యగా మారిపోయింది. కన్నీళ్ళే నా దాహాన్ని తీరుస్తున్నాయి. వద్దు... ఇలాంటి బతుకు పగవాళ్ళకి కూడా వద్దు..." ఆమె గొంతు జీరపోయింది.

వంశీ ఆమెకేసి జాలిగా చూశాడు. అయితే, విలువలేని జాలిచూపులు తనకు అలవాటుగా మారుతున్నాయని గ్రహించి, అతడు చప్పున చూపులు మరల్చుకున్నాడు.

ఇద్దరిమధ్యా ఒక్కసారిగా గాఢమైన నిశ్శబ్దం పేరుకుంది.

చాలా సేపటికి ఆమె తన దుఃఖాన్ని పక్కన పెడుతూ "ఒక్క నిముషం కాఫీ పెట్టుకువస్తాను'' అంటూ లోపలికి వెళ్ళబోయింది.

"వద్దండి'' అన్నాడుగానీ, ఆమె వినిపించుకోలేదు. వంట గదివైపు నడిచింది.

ఆమె వంట గదిలోనుండి కాఫీ కప్పుతో వచ్చేవరకూ అతడు గోడమీద తగిలించి ఉన్న ఫోటోలకేసే పరిశీలనగా చూస్తుండిపోయాడు. ఆ ఫోటోల్లో ఒకటి, సత్యమూర్తి గౌతమి కలిసి తీయించుకున్నది ఉంది. అతడి పక్కనే ఆమె నవ్వుతూ నిలబడి ఉంది. బహుశా అది పెళ్ళయిన కొత్తలోదేమో! ఆ తర్వాత త్వరలోనే ఆమె పెదాలమీద చిరునవ్వు తొలగిపోయి ఉంటుంది.

గౌతమి వంటగదిలోనుండి కాఫీ తెచ్చి అతడికి అందించింది.

"కూర్చోండి'' చెప్పాడు అతడు.

ఆమె కూర్చోలేదు. "ఫర్వాలేదులెండి'' అంటూ వీపు గోడకు ఆన్చి నిలబడింది.

అతడు కాఫీ ఓ గుటక సిప్ చేశాక కొద్దిసేపు అలాగే ఉండిపోయాడు. తను ఫైవ్‌స్టార్ హోటల్స్‌లో కాఫీ తాగాడు. కాని ఈ టేస్ట్ తనకింతవరకూ ఎక్కడా దొరకలేదు. సూపర్బ్ టేస్ట్!

"కాఫీ చాలా బాగుంది''

'నా నుదుటిరాత మాత్రం బాగోలేదు' అనబోయి ఆగిపోయింది ఆమె. పరాయి పురుషుడికి తన కష్టాలు ఏకరువుపెట్టడం ఆమెకిష్టం లేకపోయింది.

కాని అతడు మాత్రం ఊరుకోలేకపోయాడు "నేనిలా అనొచ్చో, అనకూడదో నాకు తెలియదుగానీ, మీ కష్టాలు చూస్తూ అనకుండా ఉండలేకపోతున్నాను. ఆ రాక్షసుడి దగ్గర ఎంతకాలం ఇలా కష్టాలుపడుతూ ఉండిపోతారు?"

"మరేంచేయను?"

ఏదో అనడమైతే అనగలిగాడుగానీ, ఆమె ప్రశ్నకు తన దగ్గర జవాబు ఏముంది? నిజమే! కష్టమైనా, నష్టమైనా, భరించలేని బాధయినా ఆడది భర్తచాటునే ఉండాలి కాబో లు. ఆమె అతడినుండి బయటపడితే ఎలా బతకగలదు?

ఆదీ తప్పే! స్త్రీ తనకాళ్ళమీద తను నిలబడితే, మగాడి దౌర్జన్యాన్ని ఎదిరించి బతకడం కష్టంకాబోదు. కాని అందుకు స్త్రీ కొంత ధైర్యం చేయాలి అంతే.

అయినా, ఆడదంటే మగాడికి మరీ అంత లోకువనా? ఆమె దగ్గర తను ఎలా ప్రవ ర్తించినా ఏమీ చేయలేదనే కదూ అతడి ధైర్యం?

మరి ఆడవాళ్ళు పడే ఇలాంటి కష్టాలకు అంతం ఎప్పుడు!

ఆలోచనల మధ్యనే కాఫీ తాగడం పూర్త యింది.

ఆమె ప్రశ్నకు తన దగ్గర జవాబులేదని అర్థమయ్యాక, అతడు మెల్లగా లేచాడు "నే ను వెళ్ళొస్తాను"

"అలాగే" తలాడించింది గౌతమి.

అతడు రోడ్డుమీదకి నడిచి, తన కారెక్కి కూర్చున్నాడు. ఆ ఇంటివైపు చూడకుండానే కారు ముందుకు పోనించాడు.

వంశీ కారు పోర్టికోలో ఆపి హాలులోకి వెళ్ళగానే, హాలులోనే ఉన్న పార్వతమ్మ కొడుకుకేసి అదోలా చూస్తూ అడిగింది. "ఆ ఇంట్లో నీకు స్నేహితులెవరయినా ఉన్నారా?"

ఆమె తను ఆ ఇంట్లోకి వెళ్లడం చూ సిందని అర్థమయింది. అతడు ఆమె దగ్గర గా నడిచి, ముందు నిలబడి చెప్పాడు. "స్నేహితులు కాదమ్మా! ఆ ఇంట్లోకి కొత్తగా దంపతులు అద్దెకు దిగారు. ఆమెను భర్త రోజూ దారుణంగా కొట్టడం చూశానమ్మా. పోనీ ఆ అమ్మాయిది ఏదైనా తప్పు ఉందా అంటే అలాంటిదేమీ లేదు. సకల దుర్గుణ శోభితుడైన అతడు కేవలం ఆమె తన వంటింట్లో కుందేలులా భావించి ఆమెను హింసిస్తున్నాడే తప్ప మరేంలేదు. అందు కే... ఈరోజు ఆమెను కలసి 'ఆ రాక్షసుడి దగ్గర ఎంతకాలం ఇలా కష్టాలుపడుతూ ఉండిపోతారు' అని అడిగాను"

"ఆమె ఏమన్నది?"

"మరేంచేయను? అంటూ ఎదురు ప్ర శ్నించిందమ్మా" అతడు అదోలా నవ్వాడు. "ఆమె అలా ప్రశ్నించాకే, ఆ ప్రశ్నకు జవాబు నా దగ్గరలేదని తెలిసిపోయింది. అందుకే మౌనంగా వెనుతిరిగి వచ్చేశాను"

పార్వతమ్మ కూడా నిట్టూర్పులాంటి నవ్వు నవ్వింది. "సరే వెళ్ళి ముఖం కడు క్కునిరా వంశీ" చెప్పిందామె.

అతడు కదల్లేదు. తల్లిమీదనుండి చూపు లు మరల్చి ఎటో చూస్తూ పలికాడు. "ఆ అమ్మాయిని చూస్తుంటే చాలా జాలేస్తోంద మ్మా. చాలా అందంగా ఉంటుంది. చదువు కుంది. సంస్కారమూ ఉంది. అన్నింటికీ మించి మంచి మనసు ఉన్నట్టుంది. అయినా సరే, ఆమెకు ఆ కష్టాలు ఎందుకో అర్థంకావ డంలేదు. ఇలా చూస్తూ ఉంటే ఏదో రోజు ఆమె ఆ కష్టాలు భరించలేక ఆత్మహత్య చేసుకుని చనిపోయినా ఆశ్చర్యంలేదు"

పార్వతమ్మకు అప్పుడే ఓ విషయం అర్థమయింది. ఆ అమ్మాయి ఎవరోగానీ, తన కొడుకును బాగా ఆకర్షించింది. లేకపోతే, తన చుట్టూ తిరిగిన అందగత్తె లెందరినో పట్టించుకోని వంశీ, పెళ్ళయిన ఆడదాని గురించి అంతసేపు మాట్లాడుతున్నాడంటే కారణం అదే మరి!

"అలా అయితే ఆ అమ్మాయిని ఓసారి పిలిపించి, నేను మాట్లాడుతానులేరా! ఆడద న్నాక ఎంతో కొంత కష్టం తప్పదు. అలా కాకుండా నువ్వన్నట్లే, ఆ అమ్మాయివి మితి మీరిన కష్టాలయితే, ఆమె మనసులోని మాట తెలుసుకుని ఆ తర్వాతే ఏం చేయాలో

నిర్ణయించుకుందాం"

ఈ విషయంలో తన తల్లి అలా అనడం కాస్త సంతృప్తిని కలిగించింది. "సరేనమ్మా! నేను ముఖం కడుక్కొని వస్తానూ'' అతడు తన గదివైపు నడిచాడు.

వంశీ నాలుగు అడుగులు అటు వేయ డంతోనే, పార్వతమ్మ వీల్‌ఛెయిర్ నెట్టు కుంటూ కిచెన్‌వైపు వెళ్ళింది. వంటగదిలో పనిచేసుకుంటున్న వరాలుని పిలిచింది. ఆమె దగ్గరగా వచ్చాక "నాకు పక్కింట్లో కొత్తగా దిగిన అమ్మాయి వివరాలు కావాలి. ముందు, నీకు తెలిసిన వరకూ చెప్పు" అంది.

వరాలు తనకు తెలిసిన వివరాలన్నీ పార్వతమ్మ చెవిన వేసింది.

అంతా విన్నాక పార్వతమ్మ సంతృప్తితో తలాడించి "నేను ఆ అమ్మాయిని ఒకసారి చూడాలనుకుంటున్నాను. తీసుకురాగలవా?" అడిగింది.

"అలాగేనమ్మా'' అంది వరాలు.



గౌతమిని చూడడంతోనే పార్వతమ్మ మనసులో కదలాడిన భావం ఒక్కటే 'ఇ లాంటి అమ్మాయి ఈ ఇంటికోడలయితే ఎంత బాగుణ్ణు'

"రామ్మారా..." అంది పార్వతమ్మ.

వరాలు పక్కనే నిలబడి ఆ ఇంటికేసి పరిశీలనగా చూస్తున్న ఆమె ఆ పిలుపు వినపడినవైపు తలతిప్పి చూసింది.

హాలు పక్కనే ఉన్న ఓ రూమ్‌లోనుండి చక్రాలకుర్చీ చేతులతో తోసుకుంటూ వస్తోంది యాభైఏళ్ళ ఆ ముసలావిడ. ఆవిడ ముఖంలో కదలాడే హుందాతనం, మాటల లోని సంస్కారం అప్రయత్నంగానే చేతులు జోడించేలా చేశాయి గౌతమిని.

"మా అమ్మగారు... పార్వతమ్మ'' వరా లు చెప్పింది.

ఆవిడ వంశీకి తల్లి అని అర్థమయింది. అయితే ఆవిడ వీల్‌ఛెయిర్‌లో ఉంటుందన్న నిజం మాత్రం ఇప్పుడె తనకు తెలిసింది. కాని ఆవిడ తనను ఎందుకు పిలిపించిందో అన్న విషయం మాత్రం తెలియవలసి ఉంది.

గౌతమి తడబడుతూనే లోపలికి నడి చింది. అప్పటికి పార్వతమ్మ హాలు మధ్య నున్న సోఫాల దగ్గరకు చేరుకుంది. అక్కడికి చేరిన గౌతమికి సోఫా చూపిస్తూ "కూర్చో మ్మా'' అంది ఆవిడ.

మౌనంగా కూర్చుంది గౌతమి. అప్పటికే ఆ ఇంటిలోని ఖరీదైన వాతావరణం ఆమెలో భయం నింపింది. అయితే ముసలావిడ ఆప్యాయత మాత్రం తన మనసులో అనుమా నాన్నే కలిగిస్తోంది. ఇంతకీ ఈవిడ తనను ఎందుకు పిలిపించినట్టు?'

ఆవిడ వరాలువైపు తిరిగి చెప్పింది. "అ మ్మాయి కోసం ఏవయినా స్వీట్స్ పట్టు కురాపో''

వరాలు తలాడించి అవతలికెళ్ళిపో యింది.

పార్వతమ్మ వెంటనే ఆమెను అడిగింది. "నీ పేరు గౌతమి కదూ?"

"అ... అవునండి''

"పేరు బాగుంది. పాపాత్ములు తమ

పాపపరిహారంకోసం ఆ నదిలో ఈదులాడుతుంటే, మీవారు నీ బతుకుతో ఆటలాడుతున్నాడు''

గౌతమి చప్పున ఆవిడ ముఖంలోకి చూసింది. ఆవిడ చిరునవ్వుతో తనకేసే చూస్తోంది 'అంటే... అంటే ఈవిడకు తన గురించి అంతా తెలుసన్నమాట' మనసులోనే అనుకుంది. ఆమెకు తన గురించి వంశీ చెప్పాడా? అయినా ఆ తల్లీకొడుకులు తన గురించి ఎందుకు చర్చించుకున్నట్టు?

"ఏ ఊరమ్మా మీది?"

"కాకినాడ"

"మీ నాన్నగారేం చేస్తుంటారు?"

"స్కూల్ టీచర్"

"నీకు ఇంకా అక్కలు చెల్లెళ్ళు ఉన్నారా?"

"ఆ! నాకు ఇద్దరు చెల్లెళ్ళున్నారు''

"మీ నాన్నగారు ముగ్గురు ఆడపిల్లల తండ్రి అన్నమాట. బహుశా అందువల్లే కాబోలు, ఓ ఆడపిల్లను ఇంట్లోంచి పంపించేసేందుకు, వెనుకముందు ఆలోచించకుండానే ఈ పెళ్ళి చేసినట్టున్నాడు''

ఆమెకు తన తండ్రి గురించి మరొకరు చెడ్డగా మాట్లాడడం ఇష్టంలేనట్టుంది. "లేదండీ. మా నాన్నగారికి ఈయన గురించి ఏమీ తెలియదు. అబ్బాయి ఇన్‌కంటాక్స్ ఆఫీసులో పనిచేస్తున్నాడంటే, మంచి సంబంధమే కదా అనుకున్నారు అంతే"

"అలాగా" అని ఆగి, "అయినా ఆడపిల్లను ఇచ్చేప్పుడు కుర్రాడి గుణగణాలు విచారించక్కర్లేదా?" అంది.

గౌతమి సమాధానం చెప్పలేనట్టు తలొంచుకుంది.

అప్పుడే వరాలు ప్లేట్‌లో స్వీట్స్ తీసుకొచ్చి టీపాయ్‌మీద పెట్టి వెళ్ళిపోయింది.

"తీసుకో అమ్మాయీ'' చెప్పింది పార్వతమ్మ.

ఇక తప్పదన్నట్టు ఓ స్వీట్ చేతికి తీసుకుంది గౌతమి. కాని తినలేదు. అలాగే పట్టుకుకూర్చుంది.

కొద్ది సమయం నిశ్శబ్దంగా గడిచాక, ఇక అసలు విషయానికి వస్తూ ఆవిడ అడిగింది. "ఏమ్మా! ఆ రాక్షసుడు ఏ నిముషాన ఎలా ప్రవర్తిస్తాడో తెలియదు. అతడు నిన్ను ఏం చేసినా అడిగే దిక్కేలేదు. అలాంటప్పుడు... అతనితో ఎంతకాలం ఇలా దెబ్బలు తింటూ ఉంటావ్? నీ తప్పేం లేకుండా నిన్ను వాడు శిక్షిస్తూ ఉంటే భరించటం బాధనిపించటంలేదా? అంతకన్నా వాడిని వదిలేసి హాయిగా పుట్టింటికి పోవడం మేలేమో కదా? అక్కడికి వెళ్తే మీ నాన్న నీకు ఏదో మార్గం చూపించకపోడు. నీ కాళ్ళమీద నువ్వు నిలబడితే, అప్పుడు నువ్వు ఎవరిమీదా ఆధారపడక్కర్లేదు. ఈ దరిద్రుడు నీ దగ్గరకు వచ్చినా మొహాన ఉమ్మేసి తరిమేయొచ్చు. ఏమంటావమ్మా?"

"అలా... అలా చేయడం నావల్లకాదండీ'' మెల్లగా పలికింది గౌతమి.

"ఏం... ఎందుకని?"

ఆమె క్షణకాలం తటపటాయించాక చెప్పింది. "ఈ విషయం మానాన్నగారికి ఎప్పుడో తెలియచేశానండీ. కాని ఆయన... ఆయన.. 'ఆడదానికి పెళ్ళయ్యాక చావయినా బతుకయినా భర్తతోనే... అయినా నువ్వు ఇక్కడికొస్తే, పెళ్ళికెదిగిన నీ చెల్లెళ్ళ పెళ్ళి జరగడం కష్టమవుతుంది. ఆలోచించుకో' అని హితబోధ చేశారండీ''

పార్వతమ్మ కొద్దిక్షణాలపాటు ఏం మాట్లాడాలో తెలియక మౌనంగా ఉండిపోయింది. ఆ అమ్మాయికి పుట్టింటివైపునుండి ఎలాంటి ఆధారం లేదని అర్థమయింది. ఇలాంటి స్థితిలో పుట్టింటివాళ్ళు పట్టించుకోకపోతే ఏ ఆడపిల్ల మాత్రం ఏం చేయగలదు? ఏదేమయినా ఆ అమ్మాయిని చూస్తుంటే పార్వతమ్మకు జాలి, ప్రేమ పుట్టుకొచ్చాయి. ఇంత మంచి అమ్మాయిని, అతగాడు హింసిస్తుంటే

వంశీ మాత్రం చూస్తూ ఎలా ఊరుకోగలడు? మనసులోనే కొడుకు చేసిన పనిని సమర్థించుకుందామె.

"మా ఇల్లు అంతా చూడలేదు కదూ... వెళ్ళు ఇల్లంతా చూసిరా..." అంటూ వరాలుని కేకేసి పిలిచింది పార్వతమ్మ. వరాలు వచ్చాక గౌతమిని చూపించి "అమ్మాయికి ఇల్లు చూపించు వరాలు'' చెప్పింది.

వరాలు గౌతమిని తీసుకుని అవతలికెళ్ళిపోయింది.

గౌతమి ఒక్కో గదిలోకి తొంగిచూస్తూ, ఆ గదిలో ఉండే ఫర్నిచర్, ఇతర విలువైన సరంజామా చూసి ఆశ్చర్యపోసాగింది. అయితే ఆ ఫర్నిచర్ చాలావరకూ దుమ్ముకొట్టుకుపోయి ఉంది.

ఆమె ఆశ్చర్యం గమనించినట్టు వరాలు చెప్పింది. "ఇప్పుడంటే అమ్మగారు అలా అయిపోయి ఏమీ తేవట్లేదుగానీ ఒకప్పుడు, ఏ ఊరెళ్ళినా కారునిండా సామానులు పట్టుకొచ్చేవారు. ఆ సామానంతా ఈ గదుల్లోనే సర్ది రోజూ శుభ్రంచేస్తూ ఎంతో అందంగా ఉంచేవారు''

అప్పుడే ఆమెకు గుర్తుకొచ్చింది. "అవునూ! మీ అమ్మగారు అలా ఎందుకయింది? అదే కాళ్ళు''

"మూడునాలుగేళ్ళక్రితం అమ్మగారు తన అన్నయ్యతో కలసి తిరుపతి వెళ్తుంటే కారు యాక్సిడెంటయి అలా అయిపోయారు. ఆ విషయం విన్న అయ్యగారికి పక్షవాతం వచ్చేసింది''

"ఏంటీ? వంశీగారి నాన్నగారికి పక్షవాతమా!!"

"అవునమ్మా! మీరు ఆయనను చూడలేదుకదూ. రండి చూపిస్తాను''

గౌతమి అయోమయంలో ఉన్నట్టుగానే వరాలుని అనుసరించింది. వీల్‌ఛెయిర్‌లో వంశీ తల్లిని చూసినప్పుడే బిత్తరపోయిన ఆమె, అతడి నాన్న కూడా మంచంమీదే ఉన్నాడని తెలియడంతో అయోమయస్థితిలోకి జారుకుంది. ఆస్తి అంతస్తు ఉన్న వంశీకి మరేకష్టమూ ఉండదేమో అనుకుంటుంటే, తెలిసిన నిజం ఆమె మనసులో ముల్లులా గుచ్చుకుంది.

వరాలు గౌతమిని తీసుకుని ఆ గది వాకిటి దగ్గరకొచ్చి, అక్కడే నిలబడిపోయింది. గౌతమి అటు చూసింది. బెడ్‌మీద పడుకుని పైకప్పుకేసి తదేకంగా చూస్తున్నాడు, అరవైఏళ్ళ వృద్ధుడు. ఆయనను చూస్తుంటే రాజ్యం కోల్పోయిన రారాజులా కనిపిస్తున్నాడు.

ఆమె కొద్దిక్షణాలపాటు ఆయననే తదేకంగా చూస్తుండిపోయింది. అప్పుడే చాలా దగ్గరగా అలికిడి వినిపించింది. తల తిప్పి చూస్తే పక్కనే వీల్‌ఛెయిర్‌లో పార్వతమ్మ కనిపించింది. తనలోకంలో తను ఉండి ఆమె అంత దగ్గరగా వచ్చేవరకూ గమనించలేదన్నమాట తను. మనసులోనే అనుకుంది గౌతమి.

అప్పుడే గౌతమి చెయ్యి పట్టుకుని పార్వతమ్మ చెప్పింది. "వంశీ కష్టాలకు కారణం ఆయనా, నేనేనమ్మా''

గౌతమి మరేం మాట్లాడలేదు.

మరికాసేపు ఆ ఇంట్లో గడిపాక తన ఇంటికి వెళ్ళిపోయింది ఆమె.

★ ★ ★

ఒక్కోసారి మనిషి అదుపుతప్పి ప్రవర్తిస్తుంటాడు. అందుకే ఆ సమయంలో ఆ వ్యక్తి మానసికస్థితి ఒక కారణమైతే, ఎదుటి మనిషి మీద పెంచుకున్న రకరకాల భావాలూ ఆ వ్యక్తిని ఆవేశపూరితుడిని చేస్తాయి.

నాలుగు రోజులుగా ఆ ఇంటిమీదుగా వెళ్తున్నప్పటికీ ఎలాంటి అలికిడీలేదు. బహుశా సత్యమూర్తి ఎంతోకొంత మానవత్వం ప్రదర్శించాలనుకున్నాడేమోనని వంశీకృష్ణ తృప్తిపడ్డాడు.

అయితే ఆరోజు ఉదయం ఆఫీసుకి కా




రులో వెళ్తున్నప్పుడు వినిపించిన శబ్దం తన ఆలోచన తప్పుని చెప్పింది.

దభ్... దభ్... దభ్!

అతడి కారు సడన్‌బ్రేక్‌తో ఆగింది. అతడు తలతిప్పి చూస్తే హాల్‌లోని దృశ్యం స్పష్టంగా కనిపిస్తోంది.

గౌతమి జుట్టుపట్టుకుని తలవంచి వీపు మీద పిడిగుద్దులు గుద్దడమే కాదు, మోకాలితో డొక్కలో పొడుస్తున్నాడు సత్యమూర్తి. ఓ ఆడమనిషిని మరీ అంత దారుణంగా కొట్టడానికి మగాడికి చేతులెలా వస్తాయి? పాపం! ఆ అబల అతడిని ఎదిరించలేక, తగులుతున్న దెబ్బలను భరించలేక కూలబడిపోతోంది. అయినా సరే, ఆ దుర్మార్గుడు ఆమెను వదలడంలేదు. జుట్టుపట్టుకుని పైకి లేవదీసి మరీ కొడుతున్నాడు.

వంశీకృష్ణ ఇక ఆగలేకపోయాడు. కారు దిగుతున్నప్పుడే అనుకున్నాడు. 'ఏదేమయి నా ఈరోజు తాడో, పేడో తేల్చుకోవలసిందే. విషయం ఎంతదూరం వెళ్ళినా ఆ రాక్షసుడిని వదలకూడదు'

ఆవేశంతో కళ్ళుమూసుకుని ఆడమనిషిమీద తన ప్రతాపం చూపిస్తున్న సత్యమూర్తి తనకు దగ్గరగా వచ్చిన వంశీకృష్ణను గమనించనేలేదు. ఎవరో తనపైకి లేచిన చెయ్యి గాలిలోనే పట్టుకుని ఆపడంతో ఉలిక్కిపడి తలెత్తి చూశాడు. ఎదురుగా వంశీకృష్ణ కనిపించడంతోనే ముందు బిత్తరపోయి, వెంటనే సర్దుకుని ప్రశ్నార్థకంగా కనుబొమలు ముడివేశాడు.

అయితే వంశీ అతడి ముఖంలోని ఫీలింగ్స్ గమనించలేదు. చెయ్యి వేగంగా ముందుకు కదిలించాడు. సత్యమూర్తి వెళ్ళి గోడకు గుద్దుకుని కిందకు జారాడు.

తనకేం జరిగిందో అర్థమయ్యేందుకు అతడికి కొద్దిక్షణాలు పట్టింది. అర్థమయ్యాక మొదట అయోమయం, ఆ తర్వాత కోపం ముఖంలో కదలాడాయి. ఒక్క ఉదుటున పైకి లేచి వేగంగా వచ్చి వంశీకృష్ణ షర్ట్ పట్టుకున్నాడు. "రేయ్! నన్ను... నన్ను కొడతావా? నా ఇంటికొచ్చి నన్ను కొడతావా? నీకెంత ధైర్యం? నిన్ను... నిన్ను"

వంశీకృష్ణ మరోమాట మాట్లాడలేదు. ఈసారి చేత్తో బలంగా లెంపకాయ ఇచ్చాడు. ఆ దెబ్బకు కళ్ళు తిరిగిపోయినట్లుగా సత్యమూర్తి రెండడుగులు వెనక్కువేసి చెంప పట్టుకుని అతడికేసి చూశాడు. అతడి ఆకారం, నిస్తేజంగా ఉన్న చూపులు గమనించగానే మొట్టమొదటిసారిగా అతడిలో భయం ప్రవేశించింది. అందుకే అతడికి దగ్గరగా వెళ్ళే ప్రయత్నం చేయలేదు. దూరంనుండే నోటిదురుసు ప్రదర్శించడం మొదలుపెట్టాడు.

"రేయ్! నన్ను కొడతావట్రా? నన్ను కొడతావా? నా పెళ్ళాన్ని నేను కొట్టుకుంటుంటే మధ్యలో వచ్చి నన్ను కొడతావా? ఈ విషయంలో నీకు అసలు ఏం సంబంధం ఉందని వచ్చావ్రా? నా పెళ్ళాంతో నీకున్న సంబంధం ఏంట్రా?"

ఆ మాట వినడంతోనే వంశీకృష్ణ ఒక అడుగు ముందుకువేశాడు. అతడి చేతికి చిక్కితే తను మరిన్ని దెబ్బలు తినాల్సివస్తుందని తెలిసిపోవడంవల్ల కాబోలు సత్యమూర్తి పక్కకు తప్పుకుని వేగంగా బయటకు పరుగుతీశాడు. వీధిలోకి వెళ్ళగానే అతడి నోరు మరీ పేట్రేగిపోయి మాట్లాడసాగింది.

"రేయ్... రారా బయటికి! ఈరోజు మీ ఇద్దరి వ్యవహారం ఏమిటో తేలిపోవలసిందే. నీకూ, దానికి ఏ సంబంధం లేకపోతే, నా ఇంటికొచ్చి నన్ను కొట్టేధైర్యం చేస్తావనుకోను. ఉంది మీ ఇద్దరికీ ఏదో సంబంధం ఉంది. రారా... బయటికిరా... నలుగురిలో ఈ విషయం ఈరోజు తేలిపోవలసిందే"

సత్యమూర్తి వీధిలో చేరి మరీ అంత నీచంగా మాట్లాడగలడని వంశీకృష్ణ ఊహించలేదు. అయినా అలాంటి సన్నివేశం

ఎదురయినప్పుడు తప్పుకు తిరిగితే ఎదుటి వ్యక్తి మరీ రెచ్చిపోతాడని తెలుసు. అందుకే అతడు పెదవులు బిగపట్టి ఒక్క అడుగు ముందుకేశాడు. మరో అడుగు ముందుకు వేయబోతుంటే తగిలిందా స్పర్శ.

వంశీకృష్ణ తలతిప్పి చూశాడు. గౌతమి తన చెయ్యి పిడికిట బిగించి పట్టుకుని ఉంది. అతడు ఆమె ముఖంలోకి చూశాడు.

గౌతమి తల అడ్డంగా ఆడిస్తూ చెప్పింది. "వద్దండి ఇలాంటి సమయంలో మీరు బయటకు వెళ్ళడం మంచిదికాదు''

"ఏం ఎందుకని?" అతడు ప్రశ్నించాడు.

"మురికిమీద రాయేస్తే మన మొహానే పడుతుంది. ఆయన మురికిలాంటివారు. తనకి మంచీ చెడు విచక్షణాజ్ఞానంలేదు. ఉచ్చనీచాల గురించి అసలు తెలియదు. మీరు బయటకెళితే రెచ్చిపోయి మరీ నీచంగా మాట్లాడతాడు''

"కాని ఇక్కడ..." అతడు దీర్ఘంగా నిట్టూర్చాడు.

"ఇక్కడ కూడా ఉండొద్దు. తిన్నగా వెళ్ళి కారెక్కి మీ ఆఫీసుకి వెళ్ళిపోండి''

"నేను... నేను ఆఫీసుకెళ్ళిపోతే, అతడు మిమ్మల్ని'' ఏ ఊహనో భయపెట్టినట్టు అతడు తల విదిలించాడు. "వద్దు మిమ్మల్ని వదిలి నేను ఆఫీసుకు వెళ్ళలేను''

అతడు మానవత్వంతో అన్నాడో, లేక వ్యక్తిపట్ల కలిగిన అభిమానమే అతడి నోట ఆ మాటలు వచ్చేలా చేశాయో తెలియదు గానీ, ఆ మాటలు తన మనసును కదిలించగా ఆమె తదేకంగా అతడికేసి చూసింది.

"మరి... మరేం చేస్తారు?"

కొద్దిక్షణాలు నిశ్శబ్దం... అయితే అతడు బిజినెస్‌మెన్ కాబట్టి క్షణాల్లో నిర్ణయం తీసుకోవడం అలవాటు.

అప్పటికే బయట సత్యమూర్తి అరుపులు మరీ పెద్దవయ్యాయి. ఇరుగుపొరుగు జనం అతడి చుట్టూ మూగుతున్నారు.

చివరికి ఓ నిర్ణయానికి వచ్చినట్టు వంశీకృష్ణ ఆమెవైపు తిరిగాడు. "మీరు... మీరిప్పుడు నావెంట మా ఇంటికి వస్తున్నారు''

అతడు ఏమన్నాడో ఆమెకు కొద్దిక్షణాలపాటు అర్థంకాలేదు. అర్థంకాగానే అయోమయంగా అతడి ముఖంలోకి చూసింది "నేను మీ ఇంటికా?"

"అవును... మా ఇంటికే'

"ఎందుకు?"

"ప్రస్తుతానికి మీవారి పిడిగుద్దులనుండి తప్పించుకోవడానికి''

కొద్దిక్షణాలు... కొద్దిక్షణాలు మాత్రమే ఆమె సంశయించింది. అయితే ఎప్పటినుండో పేరుకుపోయిన అసహనం ఆక్షణం అదుపుతప్పింది. నిస్సహాయత కరిగి స్థిరమైన నిర్ణయంగా మారింది. కసి ఆవేశంగా రూపుదిద్దుకుంది. వెరసి ఆమె అతడి వెనుకే అడుగువేసేలా చేశాయి.

ఆ ఇంట్లోనుండి బయటకొస్తున్న వంశీకృష్ణను ఇరుగుపొరుగు వింతగా చూశారు. అతడివెనుకే వీధిలోకొచ్చిన గౌతమికేసి అదోలా చూపులు సారించారు.

వారిద్దరూ బయటకు రావడంతోనే సత్యమూర్తి మరీ కసెక్కిపోయి అరవసాగాడు. "చూడండయ్యా! చూడండి! వాడికి నా ఇంట్లో ఏం పని ఉండి వెళ్ళాడు. మీలో ఎవరైనా అలా ఇతరుల ఇళ్లలోకి దూరుతారా?... తనది సిటీ అన్న ధైర్యం. నేను ఈ ఊరికి కొత్తవాడినని చీప్‌గా తీసేస్తున్నాడు''

వంశీకృష్ణ రెండడుగులు ముందుకేసి సత్యమూర్తి ముందు నిలబడ్డాడు. సత్యమూర్తి అతడిని చూడడంతోనే అప్రయత్నంగానే రెండడుగులు వెనక్కు వేశాడు. అతడు సత్యమూర్తితో మరేం మాట్లాడలేదు. తలతిప్పి గౌతమిని చూసి "పదండి'' అన్నాడు.

గౌతమి వంశీకృష్ణ వెనుకే నడవసాగింది.

సత్యమూర్తి వారిద్దరికేసి కంగారుగా చూ





శాడు. తన భార్య అతగాడివెనుక ఎక్కడికె ళుతోంది?'

"ఏయ్!... ఎక్కడికెళ్తున్నావే?" అరిచాడు సత్యమూర్తి.

గౌతమి కనీసం తలతిప్పి కూడా చూడలే దు.

వారిద్దరూ ముందుకు నడిచి ఆ ఇంట్లోకి వెళ్ళారు.

అప్పటివరకూ ఏదో వినోదం చూస్తున్న ట్టు అక్కడ నిలబడి ఉన్న జనం మొదటిసా రిగా ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు.

పరాయి ఆడదాన్ని అంత నిర్భయంగా తన ఇంటికి తీసుకెళ్ళిన అతడి ధైర్యానికి వాళ్ళు ఆశ్చర్యపడ్డారు.

సత్యమూర్తి పిచ్చిపట్టినట్టు అరుస్తూనే ఉండిపోయాడు.

★ ★ ★

"ఏమనాలో నాకయితే అర్ధంకావడంలే దురా''

"అదికాదమ్మా! నేను చేసింది తప్పా- ఒప్పా, ఆ ఒక్క విషయమే చెప్పు నాకు చాలు''

పార్వతమ్మ ఎదురుగా నిలబడి ఉన్నారు వంశీకృష్ణ, గౌతమిలు. ఆవిడ ముఖంలో భయాందోళనలు కదలాడుతున్నాయి.

వీధిలో గొడవ జరుగుతున్నప్పుడే వరా లు ముందుగా వచ్చి విషయం ఆవిడ చెవిన వేసింది. అప్పుడు మొదలయిన భయాందోళ నలు ఇప్పటికీ ఆమెకు తగ్గనేలేదు.

'తన బిడ్డ మనస్తత్వమేమిటో ఆవిడకు బాగా తెలుసు. సత్యమూర్తి నోరు పారేసు కుంటున్నాడే తప్ప, తన బిడ్డ చెడ్డవాడు కాదు. అతడికి చెడుబుద్ధే గనుక ఉంటే, పక్కింట్లో ఉండే పెళ్ళయిన ఆడదే అవస రంలేదు. అయినా అలాంటి నీచమైన పనుల కోసం తన బిడ్డ మరీ ఇంత దిగజారి ప్రవర్తించడు. పైపెచ్చు ఆ అమ్మాయిని అంత నిర్భయంగా తన ఇంటికే తీసుకువ చ్చే ధైర్యం చేయడు'

అంతేకాదు, ఆవిడకు గౌతమి అన్నా ఏదో తెలియని మమకారం, మనసులో జనించింది. ఆ అమ్మాయి కష్టాలు తీర్చడం ఎలాగా అని ఆలోచించేది కూడా!

అభిమానంతో ఒకరి గురించి ఆలో చించడం వేరు. కాని ఆ వ్యక్తే తిన్నగా తన కొడుకు వెంట ఇంట్లో అడుగుపెడితే... ఇరు గుపొరుగు ఏమనుకుంటారన్న ఆలోచనే మరీ బాధాకరంగా మారింది.

ఏదేమయినా ఆమె తన బిడ్డ చేసింది తప్పని చెప్పలేకపోతోంది. అలా అని ఒప్పు అని ఒప్పుకోలేకనూ ఉంది.

అంతలో అతడే అడిగాడు "ఏమ్మా! మాట్లాడవేంటమ్మా? నా ప్రశ్నకు జవాబు చెప్పు"

"అవన్నీ తర్వాత మాట్లాడుకుందాంగానీ ముందు ఆ అమ్మాయిని లోపలికి పోని వ్వు..." అంటూ తలతిప్పి వరాలుని చూసి చెప్పింది. "వరాలూ ఆ అమ్మాయిని గెస్ట్‌రూ మ్‌లోకి తీసుకెళ్ళు''

గౌతమి అక్కడినుండి కదిలి వరాలు వెంట వెళ్ళిపోయింది.

అప్పుడే వీధిలోనుండి సత్యమూర్తి అరు పులు వినిపించాయి. వాళ్ళిద్దరూ అటు చూశా రు.

సత్యమూర్తి ఇంటిగేటుముందు నిలబడి బండబూతులు తిడుతున్నాడు. అతడి మాట లకు అరనిముషంలోనే వంశీకృష్ణకు కోపం వచ్చింది.

వంశీకృష్ణ కోపంగా పైకిలేవడంతోనే పార్వతమ్మ కొడుకు చెయ్యిపట్టుకుంది. అత డు ఆమెవైపు చూశాడు. ఆమె మౌనంగానే తల అడ్డంగా ఆడించింది.

బయటనుండి సత్యమూర్తి అరుపులు వినిపిస్తూనే ఉన్నాయి.

★ ★ ★

ఆటో దిగి లోపలికొస్తున్న రేణుకను చూడ

డంతోనే పార్వతమ్మ ముఖం కాస్త విప్పారింది.

రెండు రోజులుగా ఆ ఇంట్లో స్మశాననిశ్శబ్దం కదలాడుతోంది. సత్యమూర్తి ప్రతిరోజూ ఉదయం, సాయంత్రం ఆ ఇంటిగేటు ముందు నిలబడి ఇంట్లో వాళ్ళందరినీ అలసిపోయేవరకూ తిట్టి మరీ వెళ్తున్నాడు. అతడు అంతవరకే సరిపెట్టుకున్నాడుగానీ, 'తన పెళ్ళాన్ని మరో మగాడు లేపుకుపోయాడు' అంటూ పోలీసుకేసు పెట్టి ఉంటే పరిస్థితి ఎలా ఉండేదో ఏమో!

వంశీకృష్ణ ప్రతిరోజూ ఉదయం ఆఫీసుకు వెళ్ళి సాయంత్రం ఇంటికి తిరిగి వస్తున్నాడు. అయితే ఈ రెండు రోజులుగా అతడు కాస్త డల్‌గానే ఉన్నాడు. ముఖం మరీ పీక్కుపోయి, నిద్రలేనట్టుగా కళ్ళు లోతుకుపోయి ఉన్నాయి.

కేవలం గౌతమి కారణంగానే తమకీ కష్టాలు అని ఆమెకు తెలుసు. అలా అని ఆమె గౌతమిని కూడా ఏమీ అనలేకుంది. ఆ అమ్మాయిని చూస్తుంటే, జాలి కలుగుతుందే తప్ప కోపం రావడంలేదు. ఆ అమ్మాయిని ఇంట్లో నుండి పంపించేస్తే కష్టాలు తొలగిపోతాయన్న ఆలోచన చేయడానికే మనస్కరించడంలేదు.

అలాంటి ఆ సమయంలో రేణుక రావడం, కాస్త ఓదార్పో లేక ధైర్యమో కలిగినట్టు మనసు స్థిమితపడింది.

రేణుక లోపలికి రావడంతోనే హాలంతా పరిశీలనగా చూస్తూనే "నమస్తే ఆంటీ" అంది.

"రామ్మా రేణూ...రా కూర్చో" పార్వతమ్మ వీల్‌ఛెయిర్ పక్కకు తిప్పుతూ దగ్గరే ఉన్న సోఫా చూపించింది.

రేణుక కూర్చుంటూనే ప్రశ్నించింది. "వంశీ ఇంకా ఆఫీసునుండి రాలేదా ఆంటీ?"

"ఇంకా రాలేదు. వచ్చే వేళయింది"

రేణుక అటుఇటు చూస్తూ కాస్త గొంతు తగ్గించి అడిగింది. "గౌతమి ఎక్కడుంది?"

పార్వతమ్మ కాస్త ఆశ్చర్యపోయి రేణుక కేసి చూసింది. వంశీకృష్ణ, రేణుకలు చాలా క్లోజ్‌గా ఉంటారని ఆమెకు తెలుసు. రేణుక కాలేజీలో చదువుకునేప్పుడు తరచుగా ఆ ఇంటికి వచ్చేది. పెళ్ళయ్యాక కూడా అప్పుడప్పుడూ వస్తూనే ఉంటుంది. అయితే వంశీ గౌతమి విషయం రేణుకకు చెప్పేశాడా?

ఆమె ఆ విషయమే రేణకను అడిగింది. "ఈ విషయం నీకెలా తెలుసు?"

"వంశీ చెప్పలేదు. అయినా మనం సంఘంలో ఉంటున్నాం. ఇలాంటి విషయాలు దాచాలన్నా దాగవుకదా? ఈ వీధిలోనే ఉండే ఓ పేషెంట్ ఉదయమే మా ఇంటికి వచ్చినప్పుడు నాతో "మీ ఫ్రెండ్ ఇలా చేశారు తెలుసామ్మా'' అంటూ బుగ్గలు నొక్కుకుంటూ విషయమంతా చెప్పింది. ఉదయం ఆ విషయం తెలియగానే వంశీకి ఫోన్‌చేశాను. తను ఏదో పనిమీద బయటకెళ్ళాడట. సరే, సాయంత్రం ఎలాగూ ఇంటికి వస్తాడుకదా అని, పనిలోపనిగా ఆ అమ్మాయిని చూడాలని ఇలా వచ్చాను''

"అలాగా'' అంది పార్వతమ్మ. తర్వాత చెప్పింది. "ఆ అమ్మాయి ఆ గదిలో ఉంది పిలవనా రేణూ''

క్షణం ఆలోచించి "వద్దు. నేనే వెళ్తాను'' రేణుక లేచి అటు నడిచింది.

రేణుక ఆ గది తలుపు దగ్గర నిలబడి చూసింది. ఆ సమయానికి గౌతమి బెడ్‌మీద బోర్లాపడుకుని కిటికీలోనుండి కనిపించే ఆకాశంకేసి చూస్తోంది. పొడవైన వాలుజడ నడుముమీదనుండి జారి పక్కకు పడిపోయి ఉంది. ఆమె పడుకున్న భంగిమ, ఆకర్షణీయమైన వెనుకషేపు చూస్తుంటే, రేణుక ఓ క్షణం చకితురాలైంది.

ఆమె ఏకాగ్రతను భంగం చేయడానికి క్షణకాలం సంకోచించి, చివరికి ఇక తప్పని సరి అన్నట్టు తలుపుమీద వేలితో చప్పుడు చేస్తూ "హలో" అంది.




గౌతమి తల తిప్పి చూసింది.

రేణుకకు 'తను ఒకప్పటి కాలేజీ బ్యూటీ' అన్న గర్వం ఏదయినా ఉంటే, అది ఆ క్షణమే కొట్టుకుపోయింది. అయితే ఆమెకు అసూయ కలగలేదు. అవతలివ్యక్తి మీద సదభిప్రాయమే జనించింది.

గౌతమి ఆమెకేసి అదోలా చూస్తూ తీరుబాటుగా లేచి నిలుచుంది.

"మే ఐ కమిన్' రేణుక నవ్వుతూ అడిగింది.

"రండి... రండి'' గౌతమి కూడా బలవంతంగా పెదాలమీదకు నవ్వుతెచ్చుకుంది.

రేణుక లోపలికి వెళ్ళాక, అప్పటికి గౌతమి తనకేసే ప్రశ్నార్ధకంగా చూస్తుండడంతో చెప్పింది. "నా పేరు రేణుక. నేనూ, వంశీకృష్ణ కాలేజీలో క్లాస్‌మేట్స్‌మి''

"కూర్చోండి'' వెంటనే చేత్తో బెడ్ చూపించింది గౌతమి. రేణుక నవ్వుతూ బెడ్ మీద కూర్చుంది.

"మీరూ కూర్చోండి'' గౌతమితో చెప్పింది రేణుక.

"ఫర్వాలేదులెండి''

"నోనో! మీరూ కూర్చోవాలి'' బలవంతంగా గౌతమిని తన పక్కనే కూర్చోబెట్టుకుంది రేణుక. అయితే ఆమెకు వెంటనే తను గౌతమితో ఏం మాట్లాడాలో అర్థంకాలేదు. అందుకే అంది "జస్ట్ వంశీతో కాసేపు మాట్లాడి వెళ్ళాలని వచ్చాను''

గౌతమి 'అలాగా' అన్నట్టు తలాడించింది. అయితే ఆమెకో అనుమానం కలిగింది. 'ఇంతకీ ఈమెకు తన గురించి తెలుసా?' అంతలోనే అనిపించింది' 'తెలిసినట్టే ఉంది'

ఆమె అలా అనుకుంటున్నప్పుడే "అన్నట్టు మీకిక్కడ అసౌకర్యంగా ఏమీలేదుకదా?" రేణుక అడిగింది.

జవాబేం ఇవ్వాలో తోచనట్టు మౌనంగా ఉండిపోయింది గౌతమి. భర్తను వదిలేసి వచ్చిన తను ఇక్కడ, సౌకర్యంగా ఉంది అంటే అది తప్పవుతుందేమో! అలా కాకుండా తనకిక్కడ సౌకర్యంగా లేదంటే, ఏం తక్కువయిందని ప్రశ్నిస్తుందేమో'

రేణుక మరేదో అడగబోతూ ఉన్నప్పుడే ఇంటిముందు కారాగిన శబ్దం వినిపించింది. ఆమె గదిలోనుండి బయటకు తొంగిచూసింది. వంశీకృష్ణ లోపలకు వస్తున్నాడు. ఆమె లేచి "వంశీ వచ్చాడు నేను వెళ్తాను'' అంది.

గౌతమి నిశ్శబ్దంగా తలాడించింది.

రేణుక హాల్లోకి నడిచి "హాయ్ వంశీ'' అనడంతో తలొంచుకుని లోపలికొస్తున్న వంశీ తలెత్తి చూశాడు. వెంటనే అతడి ముఖంలో ఇబ్బందికరమైన ఫీలింగ్ కదలాడడం గమనించిందామె. కాస్త ఆశ్చర్యమనిపించింది. తను ఎప్పుడొచ్చినా సంతోషం కదలాడే ఆ ముఖం ఇలా... అయితే కారణం కొంతవరకూ అర్థమయింది.

"హాయ్ రేణూ... ఎప్పుడొచ్చావ్?" అతడు బలవంతంగా నవ్వు ముఖంమీదకు తెచ్చుకుని అడిగాడు.

"జస్ట్ పదినిముషాలు. లోపలికెళ్ళి గౌతమిని పలకరించాను. ఇంతలో నువ్వు రావడం కనిపించింది''

గౌతమి ప్రస్తావన రావడంతోనే అతడి ముఖంలో మరింత ఇబ్బంది. ఆ విషయం తెలిసిపోతూనే ఉంది.

"జస్ట్ ఫైవ్‌మినిట్స్... ముఖం కడుక్కుని వచ్చేస్తాను''

"అలాగే వెళ్ళు. అప్పటివరకూ నేను ఆంటీ దగ్గర కూర్చుని ఉంటాను''

వంశీకృష్ణ మెట్లెక్కి తన రూమ్‌వైపు వెళ్ళాడు. ఆమె పార్వతమ్మ పక్కనే సోఫాలో కూర్చుంది.

అప్పుడే వరాలు కిచెన్‌లోనుండి ట్రేలో కాఫీకప్పులు పట్టుకొచ్చింది.

కొద్దిక్షణాలపాటు కాఫీ సిప్‌చేస్తూ మౌనంగా ఉన్న రేణుక ఉన్నట్టుండి తలతిప్పి పార్వతమ్మకేసి చూసి అడిగింది "ఆంటీ! నేనో విషయం అడుగుతాను. మీరేమీ అనుకోరు కదా?"

రేణుక ఏ విషయం అడుగుతుందో కొంత వరకూ ఊహించగలిగినా, "అంతగా అనుకునే విషయం ఏమిటమ్మా?" నవ్వుతూనే ఎదురు ప్రశ్నించింది పార్వతమ్మ.

కొద్దిక్షణాలు తటపటాయించాక రేణుక చెప్పింది. "గౌతమి విషయం"

"ఏమిటో అడుగమ్మా''

"గౌతమి మీద మీ అభిప్రాయం ఏమిటి?"

"మంచి అమ్మాయి. దేవుడు ఆ అమ్మాయి నుదుట రాత మాత్రం బాగా రాయలేదు. అందువల్లే అంత మంచి అమ్మాయికి ఆ దరిద్రుడు దొరికాడు''

"సరే. ఆ అమ్మాయి మీద సదభిప్రాయం ఉండడం మంచిదే. కాని వంశీ ఆమెను తన భర్తనుండి వేరుచేసి తీసుకొచ్చేశాడు. ఇప్పుడు ఆమెను ఆ భర్త దగ్గరకు పంపితే, ఈ విషయం మనసులో పెట్టుకుని మరీ హింసిస్తాడు. అలా కాకుండా ఇంట్లోనే ఉంచేస్తే ఆమె భవిష్యత్ గురించి ఆలోచించాల్సి వస్తుంది''

"తెలుసమ్మా. ఆ విషయం నాకూ అర్థమవుతూనే ఉంది. కాని అలా అని వంశీ చేసింది తప్పని కూడా అనలేకపోతున్నాను. పాపం! ఆ అమ్మాయి వంటిమీద వాతలు చూస్తుంటే కఠినాత్ములకయినా మనసు ద్రవించిపోతుంది. మరి కొద్దిరోజులు ఆ అమ్మాయి ఆ రాక్షసుడి దగ్గర ఉంటే వాడు చంపేయటమో లేక తనే ఆత్మహత్య చేసుకుని చనిపోవటమో జరుగుతుంది''

సరిగ్గా అప్పుడే వంశీ మెట్లు దిగిరావడం కనిపించింది. రేణుక పార్వతమ్మను రెట్టించి అడగదలచుకోలేదు. తను అడగదలచుకున్నదేదో వంశీనే అడగాలనుకుంది.

వంశీ వచ్చి రేణుకకు ఎదురుగా కూర్చున్నాడు. "అయితే చాలా కాలానికి తమరికి మా ఇల్లు గుర్తొచ్చిందన్నమాట"

"ఈ ఇల్లు నాకు ఎప్పుడూ గుర్తు ఉంటుంది. కాని ఇప్పుడు రాక తప్పని పరిస్థితి అనిపించి రావలసివచ్చింది''

వంశీకృష్ణ ఆమెకేసి అదోలా చూశాడు "ఎందుకలా రేణూ?"

రేణుక దీర్ఘంగా నిట్టూర్చింది. పార్వతమ్మను అడిగిన విషయాలే మళ్ళీ వంశీకృష్ణను అడగాలి. అతడి అభిప్రాయం కూడా తెలిశాకే, తను చెప్పదలచుకున్నదేదయినా చెప్పాలి.

"గౌతమిని నువ్వు ఇంట్లో తెచ్చిపెట్టుకున్నాక, నలుగురూ నాలుగురకాలుగా అనుకుంటున్నారు వంశీ. మరి ఆ అమ్మాయిని ఈ ఇంట్లో ఎంతకాలం ఉంచదలచుకున్నావో చెప్పు"

ఆ ప్రశ్నకు జవాబు దొరక్కే అతడు గత రెండు రోజులుగా మథనపడుతున్నది. 'తను వేసిన అడుగు' తప్పు కాదని తెలిసినా మరో అడుగు ఎటువేయాలో తెలియక తికమకపడుతున్నది. ఏదేమయినా ఓ సున్నిత సమస్య తను చేసినపని కారణంగా మరింత జటిలమయింది. ఇప్పుడు జటిలమైన ఆ సమస్యను పరిష్కరించవలసిన బాధ్యత కూడా తనదే.

అతడు ఏం జవాబు చెప్పాలో తెలియక తికమకపడుతున్నప్పుడే బయటనుండి వినిపించిందా కేక.

"రేయ్ వంశీ! రారా బయటకి... ఈరోజు నువ్వో-నేనో తేలిపోవలసిందే. నా పెళ్ళాన్ని పర్మినెంట్‌గా ఉంచేసుకుందామనుకుంటున్నావా? నేను ఎంగిలి చేసిన కూటికి ఆశపడే కుక్కా... రారా బయటికి''

వంశీ ముఖం రక్తం ఇంకిపోయినట్టు తెల్లగా పాలిపోయింది. అప్పుడే పులిగర్జన




విన్న లేడిపిల్లలా ఆ గదిలోనుండి ఒక్క అంగలో హాల్లోకి వచ్చి అక్కడ కూర్చుని ఉన్న ఆ ముగ్గురికేసి అయోమయంగా చూడ సాగింది గౌతమి. పార్వతమ్మ పెదవులు బిగపట్టింది.

రేణుక ఆ ముగ్గురికేసి ఓసారి తదేకంగా చూసింది.

"...రేయ్! నా పెళ్ళాంమీద నీకు అంత మోజుగా ఉంటే, నువ్వు పెళ్లి చేసుకుని నీ పెళ్లాన్ని నా దగ్గరకు పంపు. నా పెళ్ళాంతో నువ్వు కాపురం చేస్తున్నావు కాబట్టి నీ పెళ్ళాంతో నేను కాపురం చేస్తా..."

ఆ ముగ్గురూ సిగ్గుతో చితికిపోతూ, మరేం చేయలేని నిస్సహాయతతో పెదవులు బిగబట్టి అలాగే ఉండిపోయారు. ఆ విషయం అర్థం కావటంతోనే రేణుక నెమ్మదిగా లేచింది. వాకిలి వరకూ వెళ్ళి అటుచూసింది.

నల్లగా, తారుడబ్బాలా ఉన్న ఆ వ్యక్తి తూలిపోతున్నాడు. అంటే బాగా తాగి ఉన్నాడని అర్థమవుతూనే ఉంది. ఇరుగుపొరుగువాళ్ళు ఇళ్ళ తలుపులు తెరుచుకుని బయటకు వచ్చి ఆసక్తిగా చోద్యం చూస్తున్నారు. మనుషుల్ని చూడడంతో అతడు 'వన్స్‌మోర్' శబ్దం విన్న స్టేజీ ఆర్టిస్ట్‌లా రెచ్చిపోయి మరీ కుప్పిగంతులేస్తూ అరిచేస్తున్నాడు.

"... రారా బయటికి... రా... ఒసేవ్ పతివ్రతా! నువ్వన్నా బయటికి రావే... ఏంటీ! నీకు ఈ మొగుడు నచ్చలేదా? మేడలో ఉన్నాడని వాడితో కాపురం చేయాలనుకుంటున్నావా?"

కొద్దిక్షణాలు... రేణుక ఓ నిర్ణయానికి వచ్చింది. చప్పున వెనుతిరిగి గౌతమి దగ్గరగా వెళ్ళి ఆమె కళ్లల్లోకి సూటిగా చూస్తూ అడిగింది.

"నాకు వెంటనే సమాధానం చెప్పు. నువ్వు నీ మొగుడి దగ్గరకే వెళ్ళిపోవాలనుకుంటున్నావా? లేక ఆ హింసను నేను భరించలేను. నా బతుకు నేను బతుకుతానంటావా. ఏ విషయం వెంటనే నిర్ణయించుకుని చెప్పు... కమాన్ క్విక్'

పార్వతమ్మ, వంశీకృష్ణలు రేణుక అలా ఎందుకు అడుగుతోందో అర్థంకాక అయోమయంగా ఆమెకేసి చూశారు. అంతేకాదు, గౌతమి ఏం సమాధానం చెపుతుందోనన్నట్టు ఆసక్తిగా చెవులు రిక్కించారు.

గౌతమి చప్పున పెదవులు బిగపట్టింది. వెనువెంటనే రెండు చేతులూ జోడించి రేణుకకు నమస్కరించింది. మొదట తల అడ్డంగా ఆడించింది. చివరికి పొంగిపొరలే దుఃఖాన్ని కంట్రోల్ చేసుకుంటూ "అక్కా! వద్దక్కా. నన్ను ఆ రాక్షసుడి దగ్గరకు పంపకండి. నేను దొరికితే తను నన్ను చంపేస్తాడు.... చంపేసినా పర్వాలేదక్కా.... కాని కొట్టి మరీ చంపుతాడు. ఆ బాధ నేను పడలేనక్కా.... నేను పడలేను'' ఆమె చప్పున నేలకు జారిపోయి రేణుక రెండు కాళ్ళూ చుట్టేసింది.

రేణుక, గౌతమిని పైకిలేపి దగ్గరగా తీసుకుంది. ఓ తల్లి బిడ్డను లాలిస్తున్నట్టు ఆమె తలను భుజంమీద పెట్టుకుని స్థిరమైన కంఠంతో చెప్పింది.

"ఏం జరిగినా, మరెన్ని కష్టాలు ఎదురయినా సరే, నీకు నీవుగా వెళ్తే తప్ప మాకు మేముగా ఆ ఇంటికి పంపం. ఇది నా హామీ''

పార్వతమ్మ కళ్లల్లో తృప్తి ప్రతిఫలించింది. వంశీకృష్ణకు గుండెలమీద బరువు కొద్దిగా తగ్గినట్టు ఫీలయ్యాడు.

రేణుక నెమ్మదిగా ఆ అమ్మాయి చెయ్యి పట్టుకుంది "పదా'' అంది.

గౌతమి ఆమెకేసి అదోలా చూసి "ఎక్కడికి?" ప్రశ్నించింది.

"పోలీస్‌స్టేషన్‌కి'' చాలా కేజువల్‌గా జవాబిచ్చింది రేణుక.

ఆ జవాబుకి గౌతమి మాత్రమే కాదు ఆ హాలులోని తల్లీకొడుకులు కూడా రేణుకకేసి



చిత్రంగా చూశారు.

"పో... పోలీస్‌స్టేషన్‌కా? ఎందుకు?" గౌతమికి గొంతు పెగలి ఆ మాట రావటమే మహాకష్టమైపోయింది''

"నీకు ఆశ్రయమిచ్చిన మంచి మనుష్యులు నీ మొగుడి కారణంగా మరిన్ని కష్టాలు పడకుండా చేయడం నీ ధర్మం"

"అందుకు నేనేం చేయాలి?"

"పోలీస్‌స్టేషన్‌కి వచ్చి జరిగినదంతా చెప్పాలి. నీ భర్త నిన్ను శారీరకంగా హింసిస్తున్నాడన్న విషయం పోలీస్ రిపోర్ట్ ద్వారా తెలియచేయాలి''

గౌతమి మాట రానట్టు మౌనంగా ఉండిపోతే, ఆమె భయం అర్థం చేసుకున్నట్టు చాలా సేపటి తర్వాత పెదవి విప్పి పలికాడు వంశీకృష్ణ. "రేణూ! వద్దులే... వ్యవహారం పోలీస్‌స్టేషన్ వరకూ వెళ్తే అతడికి మరింత కోపం రావచ్చు. ఆ తర్వాత..."

అతడి మాటలు మధ్యలోనే కట్ చేసింది రేణుక, "ఆ రాక్షసుడిమీద మీకింకా నమ్మకం ఉందా? నాకయితే నమ్మకంలేదు''

"అదికాదు రేణూ..." అతడు మరేదో చెప్పబోయాడు.

"వంశీ! నువ్వు మరేం మాట్లాడకు. ఈ విషయంలో జోక్యం చేసుకోకు. పరిస్థితులు ఎలా చక్కదిద్దాలో నాకు బాగా తెలుసు'' ఆమె గౌతమివైపు తిరిగింది. "చూడు గౌతమీ! వీళ్లు నీకు ఆశ్రయం ఇచ్చారు. నీ కారణంగా వీళ్ళ పరువు బజారునపడింది. అయినా వాళ్ళు నిన్ను కాపాడాలనే అనుకుంటున్నారు. కాని ప్రతిరోజూ నీ భర్త అలా వీధిలో నిలబడి బూతులు తిడుతుంటే ఓర్చుకోవటం ఎంతవరకూ సాధ్యం? అందుకే చెపుతున్నాను. నేను నీ వెంట పోలీస్‌స్టేషన్‌కి వస్తాను. కేవలం ఒక్కమాట. ఐదు నిమిషాలపని. వాళ్ళు నీభర్తను స్టేషన్‌కి తీసుకెళ్ళి కొట్టడం, తిట్టడం లాంటివి చేయొద్దని చెపుదాం. కేవలం బెదిరిస్తారు. ఆడవాళ్ల కుండే హక్కులు వివరించి, నువ్వు నిజంగా కేసు పెడితే అతడి భవిష్యత్ ఎలా ఉంటుందో వివరించి చెపుతారు. అంతే... అంతకుమించి మరేమీ జరగదు''

ఆమె మాటలతో కొంత ధైర్యం తెచ్చుకున్నట్టు గౌతమి తలాడించింది. "మీ ఇష్టం మీరు చెప్పినట్టే చేస్తాను''

"సరే! పదా వెళ్దాం"

రేణుక వంశీకృష్ణ ముందుకు వచ్చి నిలబడి అడిగింది "వంశీ! కారు తాళాలివ్వు''

"రేణూ... నువ్వు ఏం చేస్తున్నావో నీకర్థమవుతోందా?"

"అర్థం కావడమే కాదు. కాస్త ముందు చూపుతోనే ఇలా చేస్తున్నాను''

అతడు మరేం మాట్లాడలేదు. తన గదిలోకి వెళ్ళి కారుతాళాలు తీసుకొచ్చి ఆమె చేతిలో పెట్టాడు.

రేణుక గౌతమి చెయ్యి పట్టుకుని నడిపించుకుంటూ బయటకు తీసుకెళ్ళింది.

మరునిముషమే పోర్టికోలో ఆగివున్న కారు కదిలి ముందుకు సాగింది.

బయట పెద్దగా అరుస్తున్న సత్యమూర్తి తన భార్య కారులో మరో స్త్రీతో కలిసి ఎక్కడికి వెళుతోందో తెలియక క్షణకాలం సాలోచనగా చూసాడు. అంతలోనే తను మరిచిపోయిన పని గుర్తుకువచ్చినట్టు 'తిట్ల పురాణం' కంటిన్యూ చేశాడు.

అతడు అలా అరుస్తూనే ఉన్నాడు. పావు గంట తర్వాత పోలీసులు వచ్చి అతడిని అరెస్ట్ చేసి జీపులో పడేసి తీసుకెళ్ళారు.

★ ★ ★

పోలీసులతో బెదిరింపజేశాక, సత్యమూర్తి దాడి పూర్తిగా తగ్గిపోయింది. రెండురోజులుగా ఇంచుమించు అతడు కనిపించటమే మానేశాడు. ఆ ఇంట్లోనే ఉంటున్నాడుగానీ, ఏ టైమ్‌లో వస్తున్నాడో, ఏ టైమ్‌లో వెళ్తున్నాడో తెలియనంత గుంభనంగా ఉండిపోయాడు.




రేణుక ఆ విషయం గురించి తెలుసుకోవాలనే రెండోరోజు సాయంత్రం ఫోన్ చేస్తే వంశీకృష్ణ కాస్త హుషారుగానే చెప్పాడు. "నీ ఆలోచన కరెక్ట్ రేణూ. ఇప్పుడు అతడివైపు నుండి ప్రాబ్లమ్ సాల్వ్ అయింది. పోలీసుకేసు అనగానే అతను బాగా భయపడిపోయినట్టున్నాడు''

"ఒక సమస్య మాత్రమే పరిష్కారమయింది. కాని నీ ముందు మరెన్నో సమస్యలున్నాయి. జాగ్రత్త' ముందు రిలాక్సింగ్‌గా నవ్వి, ఆ తర్వాతే ఆ హెచ్చరిక చేసిందామె.

"మరెన్నో సమస్యలా? ఏమిటవి?"

"పెళ్ళయిన ఆడదాన్ని ఏ సంబంధమూ లేకుండా కేవలం మానవత్వంతో ఇంట్లో తెచ్చిపెట్టుకుంటే ఎలాంటి సమస్యలు ఎదురవుతాయో ఇప్పుడే నేను చెప్పటం ఎందుకు, ముందు ముందు నీకే తెలుస్తుందిలే వంశీ''

"అవి మరీ అంత భయంకర సమస్యలా రేణూ''

"సమస్య జటిలమయినది కాకపోయినా మనసును బాధపెట్టేవిధంగా ఉంటాయి పరిస్థితులు అంతే''

కొద్దిక్షణాలు నిశ్శబ్దంగా సాగాక "ఆల్‌రైట్ రేణూ మనం మళ్ళీ కలుద్దాం. వీలయితే ఓసారి ఇంటికిరా'' చెప్పాడు అతడు.

"అలాగే''

"అన్నట్టు చెప్పడం మరిచాను. మరో వారంరోజుల్లో నేను ఢిల్లీ వెళ్తున్నాను. రెండు రోజుల్లోనే తిరిగి వచ్చేస్తాను''

"ఎందుకు?"

"బిజినెస్ ఎక్సలెన్సీ అవార్డ్ అందుకునేందుకు వెళ్ళాలి. కాని..."

అతడు బలంగా నిశ్వసించటం ఫోన్‌లో విన్నాక ఆమె కాసింత ఆత్రుతగానే అడిగింది. "మరి ప్రాబ్లమ్ ఏంటి?"

"ప్రాబ్లమ్ అంటే, రెండు రోజులపాటు అమ్మా నాన్నలను వదిలి వెళ్ళాలంటే భయంగా ఉంది. అందుకే సాధ్యమయినంతలో ఆ ప్రోగ్రాం కేన్సిల్ చేసుకోవాలనే మనసులో ఉంది''

"ఏయ్ వంశీ! నీకేమయినా మెంటలా? లేకపోతే ప్రతి బిజినెస్‌మేన్ కలలు కనే ఆ గోల్డెన్ మూమెంట్స్‌ని అందుకోనే అవకాశం వచ్చినా, కాలదన్నుకోవాలని ప్రయత్నిస్తావ్. కొన్ని మధురక్షణాలను ఎట్టి పరిస్థితుల్లోనూ మిస్ కాకూడదు. అర్థమయిందా?"

"కాని నేను ఢిల్లీ వెళ్ళి రాష్ట్రపతి ఎదురుగా నిలబడినా నాకు అమ్మానాన్నలే గుర్తుకొస్తుంటారు. ఆ మధురక్షణాలను నేను మనసుతో అనుభవించలేను''

"చూడు వంశీ! నువ్వు మరేం ఆలోచించకు. ఆ రెండురోజులూ నేనే మీ ఇంట్లో వుంటాను. అంకుల్, ఆంటీకి నువ్వు లేని లోపం లేకుండా చూసుకుంటాను. వాళ్ళ కారణంగా నువ్వు ఆ ప్రోగ్రాం కేన్సిల్ చేసుకుంటానంటే మాత్రం ఒప్పుకోను''

అతడు చిన్నగా నవ్వి "చూద్దాం" అన్నాడు.

"చూద్దాం అంటే కాదు. నేను చెప్పినట్టే చెయ్యాలి. రేపు నేనే నీ టిక్కెట్ రిజర్వేషన్ చేయిస్తాను. ఏమంటావ్?"

అతడు ఈసారి రిలాక్సింగ్‌గా నవ్వాడు "సరేనంటాను''

"ఉంటాను''

"బై' అతడు ఫోన్ పెట్టేశాడు.

అతడు ఫోన్ పెట్టేశాక ముఖం కడుక్కున్నాడు. డ్రస్ మార్చుకున్నాక ఎప్పటిలానే అమ్మానాన్నల పనిచేయడం కోసం మెట్లు దిగి ఆ గదిలోకి వెళ్ళబోతూ అటుచూసి వాకిట దగ్గరే ఆగిపోయాడు. అడుగు ముందుకుపడలేదు.

అప్పటికే పార్వతమ్మకు ముఖం కడిగేసి ఉంది. చాలాకాలం తర్వాత ఆమె ముఖానికి పౌడర్ అద్ది, అందంగా బొట్టు తీర్చి ఉంది.

అంతేకాదు, తను వచ్చేసరికి చెరిగిపోయిన ట్టు కనిపించే జుట్టు, ఇప్పుడు నూనెరాసి చక్కగా దువ్వి ఉంది. చాలాకాలం తర్వాత తల్లి ముఖంలో మునుపటికళ కదలాడటం గమనించాడు అతడు.

తల తిప్పి తండ్రికేసి చూస్తే ఆయన ముఖంలోనూ ఎంతో కొంత రిలాక్సేషన్ కదలాడుతోంది. ఆయన ప్రస్తుతం మడత నలగని ఇస్త్రీ బట్టలలో ఉన్నాడు. పడకమీద బెడ్‌షీట్స్ మార్చి ఉన్నాయి. కిటికీలకు సరికొత్త కర్టెన్స్ గాలికి నెమ్మదిగా కదులుతూ ఆహ్లాదకరమైన వాతావరణం సృష్టిస్తున్నాయి. ఎక్కడ ఉండాల్సిన వస్తువు అక్కడ ఉండకుండా అడ్డదిడ్డంగా పడివుండే ఆ గదిలో వస్తువులన్నీ నీట్‌గా సర్దిఉండడంతో, కాసేపు ఆ గదిలో కూర్చోవచ్చు అనిపిస్తోంది.

మొత్తం మీద ఆ గది రూపురేఖలు మారిపోవటమేకాదు, అమ్మానాన్నల ముఖాలలోనూ సరికొత్త కాంతి కనిపిస్తోంది.

ఆ దృశ్యం చూడటంతోనే వంశీ కళ్లు విప్పారితాలయ్యాయి.

ఈ సరికొత్త మలుపు అణగారిపోతున్న జీవితంమీద ఆశను జీవింపచేసి నిరాశ నుండి కాసింత దూరంగా తీసుకెళ్లింది.

అప్పుడే చాలా దగ్గరగా వరాలు గొంతు వినిపించింది "కాఫీ తీసుకోండి బాబూ''

అతడు మెల్లగా తలతిప్పి వరాలుకేసి చూశాడు. ఆమె చేతిలోని కాఫీ కప్పు తీసుకోకుండానే "ఈ గదంతా ఇలా..." అంటూ సంశయంగా ఆగాడు.

"గౌతమమ్మ చేసింది బాబూ! తనే అమ్మగారికి, అయ్యగారికి స్నానాలు చేయించి బట్టలు మార్చింది. మందులు, ఆహారం తనే తినిపించింది. ఈ గది ఒక్కటే కాదు, అన్ని గదులూ నీట్‌గా సర్దింది.

అతడు ఆమె చేతిలోని కప్పు అందుకుని





కాఫీ సిప్ చేశాడు. ఆ రుచి చూడటంతోనే ఆ కాఫీ చేసింది వరాలు కాదని ఇట్టే తెలిసిపోయింది. అయినా అనుమాన నివృత్తి కోసం అడిగాడు "ఈ కాఫీ చేసింది నువ్వేనా?"

"కాదు బాబూ! ఇది గౌతమమ్మే చేసింది. రాత్రికి వంట కూడా తనే తయారుచేస్తుందట" జవాబిచ్చింది వరాలు.

"సరే నువ్వెళ్ళు''

వరాలు వెళ్ళిపోయింది.

అప్పటివరకూ నవ్వుతూ అతడినే చూస్తున్న పార్వతమ్మ "లోపలికిరా వంశీ'' పిలిచింది.

అతడు కలలో ఉన్నట్టుగానే లోపలికి నడిచాడు.

"గౌతమి నేను వద్దు మొర్రో అంటున్నా వినకుండా, నన్నిలా చేసిందిరా. ఆ అమ్మాయి ముద్దుముచ్చట ఎందుకు కాదనాలిలే అని నేనూ ఊరకుండిపోయాను''. ఆమె ముఖంలో సంతృప్తితోపాటు, అదోరకమైన ఆనందమూ కదలాడుతోంది. కాని తన ఆనందాన్ని, సంతృప్తిని దాచి నెపం గౌతమి మీద నెట్టేసే ప్రయత్నం చేస్తోందామె. అయితే ఆ విషయం తెలిసిపోతూనే ఉంది.

అతడు నవ్వి చెప్పాడు. "లేదమ్మా! నువ్వు ఎప్పుడూ ఇలాగే ఇంతకన్నా బాగానూ ఉండాలని నా కోరిక"

ఆమె గుంభనంగా నవ్వింది.

ఇంట్లోని గదులన్నీ తిరిగి చూస్తే మనసు మరోలోకంలో విహరిస్తున్నంత ప్రశాంతత కలిగింది. దుమ్మూధూళితో కనిపిస్తుండిన తన ఇల్లు ఇప్పుడు కళకళలాడుతోంది.

కాసేపటి తర్వాత అతడు తన గదిలోకెళ్ళి రేణుకకు ఫోన్ చేశాడు. "రేణూ! నేను తప్పకుండా ఢిల్లీ వెళ్తాను. నువ్వే టిక్కెట్ రిజర్వ్ చేయించు''

అతడి మాటలకు ఆమె ఆశ్చర్యపోయినట్టు "ఏయ్ వంశీ! ఇంతలోనే ఇంత మార్పు ఎందుకో?" అంది.

"అమ్మా నాన్నల గురించిన దిగులుతోనే

నేను ఢిల్లీ వెళ్ళనన్నాను. కాని ఇప్పుడు నాకా దిగులులేదు''

"ఎందుకని?"

"అమ్మానాన్నలను జాగ్రత్తగా కనిపెట్టుకునే మనిషి దొరికారు''

"ఎవరు?"

"గౌతమి''



**వం**శీకృష్ణ ఢిల్లీ వెళ్ళాడు.

ఆ రెండురోజులూ గౌతమి వాళ్ళను ఎంతో అభిమానంగా, ఆప్యాయంగా చూసుకుంది.

రేణుక కూడా ఆ రెండురోజులూ ఉదయమే వచ్చి సాయంత్రంవరకూ గౌతమితో గడిపింది. రెండు రోజుల్లోనే రేణుక గౌతమిని బాగా అర్థం చేసుకుంది. ఆ అమ్మాయి మంచితనం, భావుకత తెలిసివచ్చాయి.

నిజానికి ఇప్పటికీ ఆమెకు తన భర్తమీద ఎలాంటి కోపమూ లేదు. కాని అతడితో కాపురం చేయాలంటే భయపడుతోంది. అతడు పెట్టే హింస భరించలేనిదవడంతో బాధ తట్టుకోలేకుంది. తన కుటుంబం ఇలా అయిపోయిందే అని ఆమె కుమిలిపోతూనే ఉంది.

ఇవన్నీ తెలుసుకున్నాక రేణుకకు ఆమెపట్ల ఉన్న అభిమానం రెట్టింపయింది. అంతేకాదు ఆమె భవిష్యత్తుకోసం ఆలోచనా మొదలయింది.

రెండోరోజు మధ్యాహ్నం తీరిక దొరికన సమయంలో రేణుక ఈ విషయమే ప్రస్తావించింది.

"నువ్వు ఎంతవరకూ చదువుకున్నావ్ గౌతమీ''

"ఇంటర్ పాసయ్యానక్కా''

"టైపు, షార్ట్‌హ్యాండ్ లాంటివేమయినా వచ్చా?"

"టైపు హయ్యర్ పాసయ్యాను. షార్ట్ హ్యాండ్ రాదు''

"కంప్యూటర్?"

"అసలు తెలియదు''

రేణుక కొద్దిక్షణాలు తటపటాయించాక అడిగింది. "నేనో మాట అడుగుతాను. ఏమీ అనుకోవుగా రేణూ''

"అనుకోవడానికేముందనక్కా! అడగండి''

"రేపటినుండి నువ్వు కంప్యూటర్ క్లాసెస్‌కి వెళ్తావా?"

"నేనా... ఇప్పుడా? మళ్ళీ చదువా?" ఆమె అదిరిపడి రేణుక కళ్లలోకి అయోమయంగా చూసింది.

"చదువుకి సమయమంటూ ఏముంటుందమ్మా? ఎప్పుడు తీరిక దొరికితే అప్పుడు చదువుకోవచ్చు. మన జీవితానికి అవసరపడే చదువు ఎప్పుడయినా చదువుకోవచ్చు, దాంట్లో తప్పేంలేదు''

"కాని... కాని నాకిప్పుడు చదువుమీద ఇంట్రస్ట్‌లేదక్కా''

"ఇంట్రస్ట్ తెచ్చుకోవాలి. తప్పదు. ఎందుకంటే, ప్రస్తుతం నీ భవిష్యత్‌కి చదువెంతో అవసరం. రేపు నీకు ఎలాంటి సమస్యయినా ఎదురుకావచ్చు. అప్పుడు నువ్వు ఆ సమస్యను ఎదిరించాలంటే, కనీసం నీ కాళ్ళ

మీద నువ్వు నిలబడగలిగిన శక్తి నీకుండాలి. ఇప్పుడు కంప్యూటర్ కోర్సులకి మంచి డిమాండ్ ఉంది. చివరికి వారంరోజుల్లో నేర్చుకునే డి.టి.పి. వచ్చినా నెలకు పదిహేను వందలు సంపాదించుకోవచ్చు. లేదా ఓ కంప్యూటర్ కొనుక్కుని ఇంట్లో పెట్టుకున్నా, డి.టి.పి. వర్క్ తెచ్చుకుంటే నెలకు ఐదారు వేలు కనీసం మిగులుతాయి. అలా కాకుండా ఏదయినా సాఫ్ట్‌వేర్‌కి సంబంధించిన కోర్స్ చేస్తే మనదేశంలో పదివేలు వస్తే విదేశాలలో నాలుగువేల డాలర్స్ ఇస్తున్నారు. అంటే నెలకు లక్షాడెబ్బయ్ ఐదువేల రూపాయలవరకూ జీతం అన్నమాట"

రేణుక చెప్పే విషయాలు తలాడిస్తూ శ్రద్ధగా వినసాగింది గౌతమి.

"చూడమ్మా! నువ్వు ఇక్కడివాళ్ళకు ఇబ్బందో లేదా భారమనో నేనిలా అనడంలేదు. నువ్వు ఇక్కడ నీకిష్టమొచ్చినంతకాలం ఉండొచ్చు. కాని ఒక్కటి ఆలోచించు. భవిష్యత్‌లో ఏదయినా జరగొచ్చు. కోపతాపాలు ఎక్కువకాలం ఉండవు. రేపు నీ భర్త నిన్ను తీసుకెళ్ళిపోవచ్చేమో. లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఏజంట్‌లా కీడు శంకిస్తూ మాట్లాడుతున్నాననుకోకపోతే నిన్ను తీసుకెళ్ళినా ఆ తర్వాతయినా నిన్ను ప్రేమతో చూసుకుంటాడన్న నమ్మకం ఏమిటి? అప్పుడు నిన్ను ఇలా ఆదరించేందుకు వంశీకృష్ణ అక్కడ ఉండడుకదా? ఉన్నప్పటికీ అప్పటి పరిస్థితులు ఎలా ఉంటాయో ఏం చెప్పగలం? ఆలోచించు. అందులోనూ ఇప్పుడు నీకు ఏ భారమూ లేదు. రేపు నీకడుపున ఓ నలుసుపుడితే అప్పుడు నువ్వు చదువుకోవాలన్నా పిల్లవాడి బాధ్యత నిన్ను ఆ పని చేయనివ్వదు''

అప్పుడే హాలులోనుండి గేటువైపు యధాలాపంగా చూసిన రేణుక, అరవై ఏళ్లలోపు వ్యక్తి గేటు తెరుచుకుని లోపలికి రావడం చూసి మాటలాపేసింది. ఆమె మాటలాపి అటే చూస్తుండడంతో తలతిప్పిన గౌతమి అటుచూడడంతోనే కనురెప్పలు భయంతో అదోలా రెపరెపలాడాయి. చప్పున లేచి నిల్చుంది.

గౌతమి లేవడం గమనించి తలతిప్పి ఆమె ముఖంలోకి చూసిన రేణుక కాస్త ఆశ్చర్యపోయి అడిగింది "ఎందుకలా భయపడుతున్నావ్? ఎవరాయన?"

"మా నాన్న'' గౌతమి వెంటనే చెప్పింది.

ఆ సమాధానానికి ఉలిక్కిపడింది రేణుక.

అప్పటికే ఆయన గడప దగ్గరగా వచ్చేశాడు. గడప అవతల నిలబడి హాలులోనే నిలబడి ఉన్న కూతురికేసి సీరియస్‌గా చూశాడు.

బహుశా సత్యమూర్తి ఏ ఉత్తరమో రాసి ఆయనను పిలిపించి ఉంటాడని అర్థమయింది రేణుకకు. ఆయన అక్కడికి ఏ ఉద్దేశంతో వచ్చాడో అర్థం కాకపోయినా, చిరునవ్వు పెదాలమీదకు తెచ్చుకుని "రండి మాస్టారూ! లోపలికి రండి'' చెప్పింది.

ఆయన వాళ్ళ దగ్గరగా నడిచాడు. కూతురి ముఖంలోకి సూటిగా చూస్తూ ఆయన అన్న మొదటిమాట "కుటుంబగౌరవం మంట గలిపావ్ కదే''

గౌతమి తప్పు చేయలేదు. కాని తల దించుకుంది. అది కేవలం ఆయనకు ఎదురుచెప్పకూడదన్న ఉద్దేశంతోనే!

కాని రేణుక సమాధానం చెప్పింది "మీ అమ్మాయి తప్పేం చేసిందండీ?"

అప్పుడు తలతిప్పి చూశాడాయన రేణుక వైపు. "మీరెవరు?" అడిగాడు.

"నా పేరు రేణుక. ఈ ఇంట్లోని వ్యక్తులకు కావలసిన మనిషిని'' చెప్పాక ఎదురుగా ఉన్న సోఫా చూపించింది "కూర్చోండి''

"నేను కూర్చుని నా కూతురు తప్పు చేసిందా- ఒప్పు చేసిందా అని చర్చించడానికి రాలేదులేమ్మా. దాన్ని తీసుకెళ్ళి అల్లుడి దగ్గరకెళ్ళి కాళ్లు పట్టుకుని బతిమలాడి 'ఏదో చిన్నపిల్ల తెలియక తప్పు చేసింది. నా




ముఖం చూసి క్షమించు నాయనా' అని అతడి దగ్గర వదిలి వెళ్ళడానికి వచ్చాను'' ఆయన గొంతులో కాసింత వ్యంగ్యం ధ్వనించింది.

రేణుక అంతకన్నా వ్యంగ్యంగానే పలికింది. "అలా చేయండి. ఆ తర్వాత ఓ వారంరోజులలోనే వచ్చి మీరు మీ అమ్మాయి శవానికి ఇక్కడే దహన సంస్కారాలన్నీ జరిపించి వెళ్ళొచ్చు. అది కూడా కన్నతండ్రిగా మీకు బాధ్యత ఉంది అనుకుంటేను సుమా''

ఆయన దెబ్బతిన్నట్టు రేణుక ముఖంలోకి చూశాడు. "ఏమిటమ్మా... ఏమిటమ్మా నువ్వనేది?" అన్నాడు. ఈసారి ఆయన గొంతులో దిగులు ధ్వనించింది.

"నేనేం తప్పు మాట్లాడడంలేదు. మిమ్మల్ని భయపెట్టాలనీ అలా అనడంలేదు. భవిష్యత్ చెపుతున్నాను అంతే''

ఆయనను ఒక్కసారిగా నీరసం ముంచేసినట్టుంది. మరేం మాట్లాడకుండా సోఫాలో కూలబడిపోయాడు.

రేణుకే అంది "ఆడపిల్లను కని ఏ రాక్షసుడికో కట్టబెట్టి, తండ్రిగా తన బాధ్యత తీరిపోయిందని చేతులు దులిపేసుకుంటే సరిపోదు మాస్టారూ! అది ఆత్మవంచనే అవుతుంది. ఆడపిల్ల అత్తారింటికెళ్ళినా అక్కడ అమ్మాయి ఆనందంగా ఉందా లేక నరకం అనుభవిస్తోందా అన్న విషయం తెలుసుకోవడం ఆడపిల్లను కన్న తండ్రి కనీసధర్మం. మిమ్మల్ని నమ్మి మీరు చూపించిన ఏ మగాడి చేతో తాళి కట్టించుకుని అతడి వెంట తలవంచుకుని వెళ్ళిపోయిన ఆడపిల్ల అదే వ్యక్తి కారణంగా కష్టాలు పడుతుంటే ఆ కష్టాలకు కారణం మీరేనని తెలుసుకోండి. ఎందుకంటే ఆ మగాడెవరో తనకి తెలియదు. కనీస పరిచయం కూడా లేదు. కాని మీ మీద నమ్మకంతో నన్ను కన్నవాళ్ళు నాకు అన్యాయం చేయరు అన్న పిచ్చి ధైర్యంతో మీరు చెప్పినట్టే చేసింది. కాని ఫలితం తనకు చిత్రహింస. ప్రత్యక్షనరకం... మరి చెప్పండి! ఇప్పుడు మీ అమ్మాయిపడే కష్టాలకు కారణం మీరు కాదా?

రేణుక అరుపులకు నిద్రాభంగం కావడంతో పార్వతమ్మ వీల్‌ఛెయిర్‌లోకి జారి దాన్ని నెట్టుకుంటూ హాలులోకి వచ్చింది.

అటుచూస్తే రేణుక ముఖం కోపంతో కందిపోయి ఉండడం, గౌతమి తలొంచుకుని నిలబడడం, సోఫాలో కూర్చున్న వ్యక్తి కళ్లనీళ్లు పెట్టుకుని ఉండడం కనిపించింది. ఆ సిట్యుయేషన్ ఏమిటో? ఆ వ్యక్తి ఎవరో? ఆమెకు అర్థంకాలేదు.

ఆమె వీల్‌ఛెయిర్ నెట్టుకుంటూ వాళ్ల దగ్గరగా వస్తుంటే వాళ్లు ముగ్గురూ అప్పుడే తలతిప్పి అటు చూశారు.

పార్వతమ్మ వాళ్ల దగ్గరగా వచ్చాక తల తిప్పి ముగ్గురికేసి అదోలా చూస్తూ "రేణూ! ఏమయింది? ఎవరాయన?" అడిగింది.

"మన గౌతమి నాన్నగారు'' రేణుక సమాధానమిచ్చింది.

పార్వతమ్మ అలాగా అన్నట్టు తలాడించింది.

ఎందుకనో తెలియకనే నలుగురి మధ్య ఒక్కసారిగా మౌనం ఏర్పడింది. నిజానికి అక్కడున్న నలుగురిలోనూ ఏవో మాటలు మనసులో కదలాడుతున్నాయి. వాటిని బయటపడేయాలన్న ఆరాటమూ ఉంది. కాని ఏదో తెలియని ఇబ్బంది మాట పెగలనివ్వటంలేదు.

అయితే చివరికి గౌతమి తండ్రి ఆ నిశ్శబ్దాన్ని బద్దలు చేస్తూ పలికాడు. "ఏమ్మా! నేను నిజానికి మీరు అనుకునేంత దుర్మార్గుడయిన తండ్రినికాదమ్మా! నాకూ మనసుంది. నా కూతురి క్షేమాన్ని నేను కోరుకుంటున్నాను. కాని మీరే ఆలోచించండి. భర్తను కాదనుకుని ఇవతలికి వచ్చేస్తే ఆడదాని పరిస్థితేమిటో చెప్పండి. దీని కారణంగా తన చెల్లెళ్ల పెళ్లిళ్లకు ఇబ్బంది ఏర్పడుతుందన్న

విషయం కూడా నేను పక్కన పెట్టేస్తాను. ఒక్కటే నేను అడుగుతాను దీని భవిష్యత్ ఏమిటో చెప్పండమ్మా! అది చాలు నాకు''

"నేను చదువుకుంటాను నాన్నా! కంప్యూటర్ కోర్స్ చదువుకుంటాను''

ఆయన వేగంగా తల తిప్పి కూతురి ముఖంలోకి చూశాడు. కనుబొమలు ముడి వేసి ప్రశ్నించాడు "చదువుకుంటావా? చదువుకుని ఎవర్ని సాధిస్తావ్?"

"ఎవర్నీ సాధించను. నా కాళ్ల మీద నేను నిలబడతాను''

"ఆహా! ఆ తర్వాత?"

"నా బతుకు నేను బతుకుతున్నప్పుడు మీకే సమస్యా ఉండదు''

ఈసారి ఆయన గొంతులో జాలి పలికిందో, కోపం ఉందో అర్థంకాలేదు. "పిచ్చిదానా! నువ్వేదో సంపాదించుకుని నీ కాళ్లమీద నువ్వు నిలబడినంత మాత్రాన సరిపోదు. నువ్వు ఆడపిల్లవు. ఆడపిల్ల ఒంటరిగా బతకలేదు. అది గుర్తుపెట్టుకో''

రేణుక జోక్యం చేసుకుంది. "తను అంతగా ఒంటరిగా బతకలేననుకున్నప్పుడు పోనీ మిమ్మల్ని తన దగ్గరకు తెచ్చేసుకుంటుంది. మీకు ఎలాగూ ముగ్గురూ ఆడపిల్లలే కాబట్టి మిగిలిన ఇద్దరాడ పిల్లలకూ పెళ్లిళ్లు చేసేసి పెద్ద కూతురు దగ్గరకు వచ్చేయండి''

మొదటిసారిగా ఆయన కొద్దిగా తడబడ్డాడు. దాంతో కొంత చిరాకూ ఏర్పడినట్టుంది. "ఏంటమ్మా మీరూ అలా అంటారు? మా వయసులు ఎంత? యాభై అరవైఏళ్ల మధ్య కాటికి కాళ్లు చాపుకుని ఉన్నాం. మేము జీవితాంతం దానికి తోడు ఉంటామా? చెప్పండి''

రేణుకకు కూడా కోపం వచ్చింది. ఆమె ఏదో అనబోతూ ఉంటే పార్వతమ్మ అంది "ఉండలేరు. మీరు ఆమెకు జీవితాంతం తోడు ఉండలేరు. ఒకవేళ ఆమె తన కాళ్లమీద తను నిలబడి ఒంటరిగా బతుకుతానన్నప్పటికీ మీరు ఒప్పుకోరు. అందుకే పంపించేయండి. ఆ అమ్మాయిని ఆ రాక్షసుడి దగ్గరకే పంపించేయండి. అప్పుడు వాడు రెట్టించిన ఉత్సాహంతో మరింత కసిగా ప్రతిరోజూ సిగరెట్ పీకతో దాని ఒంటిమీద ఇష్టం వచ్చిన చోటల్లా కాలుస్తాడు. అయినా మీరేం ఫీల్ కాకండి. ఎందుకంటే అమ్మాయి ఒంటరిగా బతకలేదు. చిత్రహింస భరిస్తూ అలాంటివాడి దగ్గరే ఉండడం న్యాయం. చదువుకుని తన కాళ్లమీద తను నిలబడితే ఏముంటుందండీ? తృప్తిగా కాసింత తిని ఏ టెన్షన్ లేకుండా బతుకుతుంది. అంతేకదా? అదేవాడి దగ్గర ఉంటే సరయిన తిండి ఉండదు, ఏ నిముషం ఏం చేస్తాడో తెలియనంత టెన్షన్. భయం, దుఃఖం, ఏడుపు... హారర్ సస్పెన్స్ నవల సాగినంత టెంపోతో జీవితం సాగిపోతుంది. ఒక ఆడపిల్ల తండ్రిగా మీరు చాలా కరెక్ట్‌గానే మాట్లాడారండి. అలాగే అలాగే చేయండి. మీ ఇష్టం వచ్చిన ట్టే చేయండి. ఎందుకంటే అది మీ కడుపున పుట్టింది. కాబట్టి దాన్ని సుఖపడేలా చేసినా కష్టపడేలా చేసినా ఆ బరువు బాధ్యతలు మీకే తెలుస్తాయి. ఆ హక్కు కూడా మీకే ఉందికదా? మీ కడుపున పుట్టిన పాపానికి తను మాత్రం ఏం చేయగలదు? మీ వెంట బలి పశువులా వచ్చేస్తుంది. తీసుకెళ్లండి. తీసుకెళ్లి ఆ కసాయివాడికి అప్పగించండి''

పార్వతమ్మ గౌతమి వైపు తిరిగింది... "వెళ్లమ్మా! లోపలికి వెళ్లి నీ బట్టలేవయినా ఉంటే తెచ్చేసుకో.. ఓహో? నువ్వు కట్టుబట్టలతోనే మా ఇంటికి వచ్చావ్ కదూ? అవున్లే కట్టుబట్టలతో వీధినబడిన కూతురి భవిష్యత్ ఆలోచించి నెల రోజుల తర్వాత నీ తండ్రి వచ్చాడు. ఆయన వెంట ఆనందంగా వెళ్లమ్మా... వెళ్లు''

రేణుక గౌతమి తండ్రికేసి చూడలేదు. పార్వతమ్మ అంత సర్‌కేస్టిక్‌గా మాట్లాడగలదని తెలియనట్టు ఆమెనే చూస్తుండిపోయింది.




గౌతమి తండ్రికి ఆవిడెవరో తెలియకపోయినా ఆవిడ ఎత్తిపొడుపు మాటలు అర్థమయ్యాయి. అయితే ఆ స్థితిలోనూ ఆయనకు కలిగిన ఆనందం ఏమిటంటే తన కూతురుని పక్కింటి, గొప్పింటి ఆడవాళ్లిద్దరు అంతగా అభిమానించడం! నిజానికి ఆయన చిన్నప్పటి నుండి గౌతమి వ్యక్తిత్వమేమిటో తెలిసినవాడే. అంతేకాదు తన అల్లుడి గుణగణాల గురించీ కొంత అర్థమయింది. కాని ఆడపిల్ల తండ్రిగా నిస్సహాయత ఆయనను మరోవిధంగా ఆలోచించుకోనివ్వడంలేదు.

ఆయన గొంతు సవరించుకున్నాడు. "చూడమ్మా! మీరు బహుశా ఈ ఇంట్లో ఆ అబ్బాయికి తల్లిగారనుకుంటాను. నాకు జరిగిన విషయం ఎంతోకొంత ఏదో ఓ కోణంలో తెలుసు. మరో కోణంలో ఏం జరిగి ఉంటుంది అన్నది ఊహించగలను. అయితే నా అల్లుడే నాకు ఉత్తరంలో ఏం రాశాడో తెలుసామ్మా?"... ఆయన తల విదిలించాడు.. "వద్దు నా నోటితో నేను చెప్పలేను. ఏం రాసి ఉంటాడో మీరూహించగలరనుకుంటా. మీ అబ్బాయి మంచి మనసుతో చేసిన దాన్ని నా అల్లుడే వక్రీకరించి రాస్తే మరి ఈ సమాజం గురించి ఆలోచించండి. ఇప్పటికే చెడ్డపేరు వచ్చేసింది. ఇక రేపు సంఘంలో మనుష్యులు అనే రకరకాల మాటలను భరిస్తూ బతకడంకంటే కష్టమో నష్టమో సర్దుకుపోయి ఉండి కాపురం చేయడమే మంచిదని నా ఉద్దేశ్యం అంతే"

"ఏమాత్రం సర్దుకుపోయే పరిస్థితి ఉన్నా గౌతమి ఇలా ఇల్లు వదిలి రాదండీ" పార్వతమ్మ చెప్పింది.

"తెలుసమ్మా! అదీ తెలుసు నా కూతురేమిటో నాకు బాగా తెలుసు"

"అందుకే చెపుతున్నాను. పరాయివాళ్లం మేమే తన పరిస్థితి పట్ల జాలి పడుతున్నాం. ఆ అమ్మయిని ఇంట్లో తెచ్చిపెట్టుకోవడం వల్ల మా కుటుంబానికి వచ్చే పేరు ఎలాంటిదో నాకూ తెలుసు. నీ కూతురు ఈ ఇంట్లో ఉంటే ఎంతో కొంత మాకూ భారమే. అయినా సరే నేను ఆ అమ్మాయిని ఈ ఇంట్లోనే ఉంచదలచుకున్నానంటే పరిస్థితి ఎలాంటిదో మీరే ఊహించండి. మేము తీసుకున్నపాటి రిస్క్ మీరు తీసుకోనవసరంలేదు కూడా. కాని ఆ అమ్మాయిని ఆ రాక్షసుడికి అప్పగించే ప్రయత్నం మాత్రం మానుకోండి. ఇక అమ్మాయి భవిష్యత్ అంటారా? తను చదువుకుంటానంటుంది కాబట్టి చదివిద్దాం. ఆ తర్వాత కొన్ని ప్రశ్నలకు కాలమే సమాధానం చెప్పాలి తప్ప మనం సరయిన జవాబు చెప్పలేం"

పార్వతమ్మ మాటలకు ఎదురు చెప్పాలనిపించలేదు ఆయనకు. సంఘంలో పరువు ప్రతిష్టలున్న ఓ కుటుంబంలో ఒక తల్లి తన బిడ్డ భవిష్యత్‌కోసం కష్టనష్టాలు ఎదుర్కొనేందుకు కూడా సంసిద్ధురాలవుతుంటే తను మరీ మూర్ఖంగా ప్రవర్తించకూడదనిపించింది. అందుకే అన్నాడాయన "సరే మీ ఇష్టమమ్మా! సత్యమూర్తిని కలవకుండానే నేను వెళ్లిపోతాను"

వాళ్లు ముగ్గురూ మౌనంగా ఉండిపోయారు.

★ ★ ★

వంశీ ఢిల్లీ నుండి వచ్చాక రేణుక అంది. "వంశీ! గౌతమి చదువుకుంటానంటోంది. ఆమెను చదివించటం చాలా మంచిదని నా అభిప్రాయం. ఏమంటావ్ నువ్వు"

"ఆ అమ్మాయి పట్ల ఎంతో బాధ్యత కలిగినట్టు ఆలోచించి నువ్వీ అభిప్రాయం వ్యక్తం చేశాక కాదని ఎలా అనగలను?"

"నా అభిప్రాయం గౌరవించటం కాదు. నీ అభిప్రాయం ఏమిటో కూడా చెప్పు" రేణుక కుర్చీలో వెనక్కువాలుతూ అడిగింది.

అతడు కొద్ది క్షణాలు ఆలోచించాక చెప్పాడు. "నిజానికి నేను ఇంతవరకూ ఆమె భవిష్యత్ గురించి ఎంత దీర్ఘాలోచన చేసినప్పటికీ ఒక నిర్ణయానికి రాలేకపోయాను. ఇప్పుడు నువ్వు చెపుతున్నది వింటుంటే ఇదే

సరయిన మార్గం అని నాకనిపిస్తోంది''

"అయితే మనస్ఫూర్తిగా ఒప్పుకున్నావ న్నమాట"

"అవును'' అతడూ రిలాక్సింగ్‌గా కుర్చీలో వెనక్కువాలాడు.

అప్పుడే గేటు దాటి లోపలికి వచ్చిన కారులోనుండి రఘురామ్ దిగాడు. అతడు వంశీకృష్ణను చూసి విష్ చేస్తూ దగ్గరగా వచ్చి "ఢిల్లీ నుండి ఎప్పుడొచ్చావ్ వంశీ'' అడిగాడు.

"ఈ రోజు ఉదయమే వచ్చాను''

"రాష్ట్రపతితో ఏమన్నామాట్లాడావా?"

"లేదు... మాట్లాడేంత టైమ్ ఉండదు ఆయనకు. షేక్‌హాండ్ ఇచ్చి షీల్డ్ అందిస్తా రంతే! ఆ తర్వాత మరో బిల్డింగ్‌లో డిన్నర్ ఏర్పాటు చేస్తారు. ఆ డిన్నర్‌కి ప్రెసిడెంట్‌రా రు'' చెప్పాడు వంశీకృష్ణ.

"అలాగా'' తలాడించాడు రఘురామ్.

అతడు అప్పటివరకూ నిలబడే ఉండడం గమనించిన వంశీ పక్కనే ఉన్న కుర్చీ చూపిస్తూ "కూర్చోండి సార్' అన్నాడు.

"లేదు... వెళ్లాలి. ముఖం కడుక్కని వెంటనే కన్‌స్ట్రక్షన్ దగ్గరకెళ్లాలి'' భర్త మాటలు విని రేణుక లేచింది.

"కాసేపు కూర్చో వంశీ. వచ్చేస్తాను'' రేణుక చెప్పింది.

"అలాగే' తలాడించాడు వంశీ.

రేణుక వెనుకే రెండడుగులు వేశాక ఆగి పోయిన రఘురామ్, తల తిప్పి వంశీకేసి చూసి అడిగాడు, "అన్నట్టు ఈ వారం బిజినెస్ ట్రాక్ ఛానెల్‌లో మీ అవార్డు ఫంక్షన్ ప్రోగ్రాం వస్తుందికదూ?"

"అవునండీ''

"చూడాలి'' అనేసి అతడు వెళ్లిపోయాడు.

లాన్‌లో వంశీ ఒక్కడే మిగిలాడు. అతడి ఆలోచనల్లో గౌతమి కదలాడింది. 'అయితే ఇక గౌతమి తన ఇంట్లోనే ఉండిపోతుందా? పై చదువులు చదువుకుంటుందా? మరి ఆమె తన ఇంట్లోనే ఉంటే సత్యమూర్తి ఊరుకుంటా డా? సరే! ఆమె తన ఇంట్లోనే ఉండి చదువు కుని ఉద్యోగం కూడా చేయొచ్చు. కాని ఆ తర్వాతయినా ఆడదానికి ఓ నీడ అంటూ ఉండాలి.

అతడు గౌతమి గురించిన ఆలోచనల్లో ఉన్నప్పుడే లోపలినుండి రఘురామ్, రేణుక లు బయటికి రావడం కనిపించింది. అతడు తల విదిలించాడు.

రఘురామ్ లాన్ దగ్గరగా వచ్చాక అత డితో చెప్పాడు. "నేను మరో గంటలో వచ్చేస్తాను. ఉండు కలసి డిన్నర్ చేద్దాం"

"లేదు సార్! నేను ఇంటికెళ్లాలి. మరో రోజు ఉంటాను''

"ఆల్‌రైట్... బై'' రఘురామ్ కారు డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాడు మరు సెకను లోనే కారు ముందుకు కదిలి గేటు దాటింది.

కారు కనుమరుగయ్యే వరకూ అలాగే నిలబడిన రేణుక ఆ తర్వాత వచ్చి అతడి ఎదురుగా కుర్చీలో కూర్చుంది.

"మావారు డిన్నర్‌కి ఉండమంటున్నారు. ఉండొచ్చుగా''

"ఇంటికెళ్లాలి''

"అంతకుముందయితే ఆంటీ, అంకుల్ నీకోసం ఎదురు చూసేవారు. ఇప్పుడు గౌ తమి వాళ్ల పనులు చక్కబెడుతుంది కాబట్టి నో ప్రాబ్లమ్. మరి కాస్త ఆలస్యంగా వెళితే ఏమవుతుంది?"

"ఏమీ కాదనుకో' అతడు నసిగాడు.

"అయితే నువ్విప్పుడు మాతోపాటే డి న్నర్ తీసుకోబోతున్నావ్. మీ ఇంటికి ఫోన్ చేసి చెపుతాన్లే"

అతడిక బెట్టు చేయదలచుకోలేదు. నిలు వుగా తలాడించాడు.

ఆ తర్వాత అతడు ఢిల్లీ కబుర్లు చెపుతూ ఉంటే ఆమె వింటూ కూర్చుంది. గంట





గడిచాక రఘురామ్ తిరిగి వచ్చాడు.

అతడు కారు దిగి తమ దగ్గరగా వచ్చాక రేణుక చెప్పింది "మీరిద్దరూ మాట్లాడు కుంటూ ఉండండి. నేను డిన్నర్‌కి రెడీ చేస్తూ ఉంటాను''

"అయితే వంశీ డిన్నర్‌కి ఉంటున్నాడన్న మాట"

"అవును''

"చూశావా రేణూ! ఎంత అన్యాయమో. నేను ఇన్వయిట్ చేస్తే లేదు కాదు అన్నాడు. ఆ తర్వాత నువ్వు పిలిచి ఉంటావ్. సరేనన్నా డు. ఎంతయినా నువ్వు తన ఫ్రెండ్‌వికదూ!"

ఆమె నవ్వి ఊరుకుండిపోయిందిగానీ వంశీ మాత్రం "అలా అనకండి సార్! మీరు వెళ్లాక మూడ్ మారింది అంతే' అన్నాడు సంజాయిషీగా.

"జోక్ చేశానులేవోయ్'' రఘురామ్ నవ్వి అతడి ఎదురుగా కూర్చున్నాడు. రేణుక తల తిప్పుకుని ముందుకు నడిచింది.

రేణుక వెళ్లిపోయాక కాసేపాగి అడిగాడు "చెప్పవోయ్ ఏమిటి విశేషాలు?"

"ఏమున్నాయ్ సార్! అన్నీ మామూలే'

అతడు కొద్దిక్షణాలు తటపటాయించాక అన్నాడు. "నేనీ మధ్య నీ గురించిన ఓ కొత్త విశేషం విన్నాను''

"ఏమిటి సార్ అది'' అతడి తటపటా యింపు చూసి తనే అడిగాడు.

"అది అదేనోయ్ మీ ఇంట్లో మీ పక్కింటి వాడి భార్య ఉందనీ..." నిజానికి ఆ విషయం ప్రస్తావించడం ఆయనకూ ఇబ్బందిగానే ఉన్నట్టుంది. కాని తెలుసుకోవా లన్న ఆసక్తికన్నా విషయం చర్చించి సలహా ఇవ్వాలన్న ఆలోచనే ఆయనను అలా మాట్లా డించింది.

రఘురామ్ వ్యక్తిత్వం ఏమిటో తెలిసిన వాడుకావడంతో వంశీకృష్ణకు ఆయన మన సులోని భావం అర్థమయింది.

"అవును సార్' అన్నాడు వంశీకృష్ణ.

"అదే... ఈ రోజు పురుషోత్తమ్‌గారు కూడా ఈ టాపిక్ తీసుకొచ్చారు. పెళ్లికాని అమ్మాయిలు ఎంతోమంది అతడిని పెళ్లాడా లని కోరుకుంటూ ఉంటే తను ఇలా చేశాడే మిటయ్యా అని వాపోయాడు''

వంశీ చురుగ్గా ఆయన కళ్లలోకి చూశాడు. ఆ చూపులు గమనించిన రఘురామ్ కాస్త కంగారుపడి "అప్పటికీ నేను అన్నానోయ్ మన వంశీ అలాంటివాడుకాడు. చివరికి రేణుక కూడా ఆ అమ్మాయిని సపోర్టు చేసిందంటే అర్థం చేసుకోండి. అతడు చేసిన మంచిపనిని హర్షించండి అన్నాను''

అతడికి గొంతు పూడుకుపోయినట్లని పించింది. నోటమాట రావటం కష్టంగా ఉంది. అందుకే అతడు నిశ్శబ్దాన్ని ఆశ్ర యించాడు.

ఈసారి రఘురామ్ గొంతులో మార్దవం ధ్వనించింది. "కాని పురుషోత్తమరావుగారు ఏమంటున్నారంటే 'నీకూ నాకూ వంశీ ఎలాంటివాడో బాగా తెలుసు. కాని ఈ సంఘం ఉంది చూశావూ. దానికి నిజానిజా లు అక్కర్లేదు. బయటకు కనిపించేదే నిజ మని భ్రమించడమేకాదు, ఆ నిజానికి మరి రెండు విశేషణాలు జోడించి ప్రచారం చే స్తుంది. అది సంఘం అంతే! మరి ఇలాంటి సంఘంలో వంశీ చేసింది మంచే అయినా అది చెడుగానే కనిపిస్తుంది. ఇప్పటివరకూ మచ్చలేని చంద్రుడిలా ఉన్న మనవాడు తెలిసోతెలియకో జీవితంలో చాలా పెద్ద తప్పు చేశాడు.. అని. ఆయన మాటలు వింటుంటే నాకూ అందులో ఎంతో కొంత నిజం ఉందనే అనిపిస్తోంది''

ఆయన అలా అంటే తనేం మాట్లాడగల డు. అయినా ఓ మంచి పని చేసినప్పుడు ఆత్మతృప్తి ముఖ్యం అనుకోవాలిగానీ చుట్టూ ఉన్న జనం ఏమనుకుంటారోనని ఆలో చించడం అనవసరమనుకుంటా.

"అంతేకాదు వంశీ! ఇప్పటివరకూ

నీమీద అభిమానం చూపించి నిన్ను గౌరవించేవాళ్లు ఈ విషయం తెలిశాక నిన్ను అదోలా చూస్తారు. నీకు తమ అమ్మాయినిచ్చి పెళ్లి చేద్దామనుకున్నవాళ్లు వెనుకడుగువేస్తారు. అర్థం చేసుకో. నేను నిన్నేదో తప్పుపట్టి ఇలా మాట్లాడడంలేదు. నువ్వేమిటో నాకు తెలుసు. నీమీద నాకా నమ్మకం ఉంది కానీ''

అప్పుడు పెదవి విప్పాడు అతడు అతికష్టంమీద "మరి ఆ అమ్మాయిని ఏం చేయమంటారు సార్! ఆ రాక్షసుడి బారిన వదిలేసి నాకెందుకు నేనూ నా కుటుంబం హాయిగా ఉన్నాం అంటూ ఆత్మవంచన చేసుకోమంటారా? నా ఎదురుగా ఓ స్త్రీ దారుణ కష్టాలు అనుభవిస్తుంటే చూసీ చూడనట్టు పొమ్మంటారా? చెప్పండి సార్! మీరే చెప్పండి'' ఆ సమయంలో అప్రయత్నంగానే అతడిలో ఆవేశం తొంగిచూసింది.

"అదికాదు వంశీ! నీ గురించి బయట ఎలాంటి ప్రచారం జరుగుతోందో నీకేమయినా అర్థమవుతోందా?"

"పోనివ్వండి సార్! ఎలాంటి ప్రచారమయినా జరగనివ్వండి! నేను మంచి అనుకున్నది చేస్తాను. చేసి తీరుతాను అంతే'

మరికాసేపటి తర్వాత రేణుక వచ్చి డిన్నర్‌కి పిలిచింది.

డిన్నర్ అయ్యాక వంశీ ఇంటికి చేరాడు.

బెడ్‌మీద వాలితే చాలాసేపటివరకూ నిద్రపట్టలేదు. రఘురామ్ మాటలే గుర్తుకురాసాగాయి. అంటే ఇప్పటికే జనమంతా తనను గురించి రకరకాలుగా అనుకుంటున్నారా? అయితే కొద్ది రోజుల తర్వాత ఈ విషయం గురించి తనకు ఎదురుగా నిలబడి అడిగినా ఆశ్చర్యపోనవసరంలేదు. ఏదేమయినా ఈ విషయంలో తను గట్టిగా నిలబడాలి. గౌతమిని ఆ రాక్షసుడి చేతిలో పడనివ్వకూడదు.





అలా ఆలోచిస్తూనే అతడు ఎప్పటికో నిద్రలోకి జారుకున్నాడు.



ఆఫీసుకెళ్ళేముందు టిఫిన్ చేస్తుండగా జరిగిందా సంఘటన.

అతడి ప్లేట్‌లో ఇడ్లీ పెడుతున్న ఆమె 'వాక్' అంటూ వాష్‌బేసిన్‌వైపు పరుగెత్తింది.

ఆ సమయంలో హాలులో పార్వతమ్మ, వరాలు కూడా ఉన్నారు. ముగ్గురూ ఆమెకేసి అదోలా చూశారు.

గౌతమి వాష్ బేసిన్‌లో వాంతి చేసుకుంది.

వరాలు వడివడిగా ఆమె దగ్గరగా వెళ్ళి, రెండు చేతులతో చెవులుమూస్తూ "ఏమిటమ్మా! ఏమయింది'' అడిగింది.

వాంతి చేసుకోవడం ఆగాక గౌతమి సమాధానం చెప్పింది. "కడుపులో ఏదో తిప్పేసినట్టనిపించింది వరాలూ''

పార్వతమ్మ ముఖంలో మొట్టమొదటిసారిగా ఏదో అనుమానం ప్రవేశించింది. మరో గంటకంతా ఆవిడ అనుమానం నిజమేనని కన్‌ఫర్మ్ అయిపోయింది.

గౌతమి గర్భవతి!

ఊహించని ఈ మలుపు ఆ ఇంట్లోవాళ్లందరూ కంగారుపడేలా చేసింది. ము

ఖ్యంగా పార్వతమ్మ బాగా దిగులుపడిపో యింది.

ఆవిడ భయం ఒక్కటే- గౌతమి ఆ ఇంట్లోకి వచ్చి కేవలం పదిహేనురోజులే అయింది. ఆమె కడుపులోని బిడ్డకు తండ్రి సత్యమూర్తి అని తమకు తెలిసిపోతూనే ఉంది. కాని మరో నెల తర్వాతో, రెండు నెలల తర్వాతో గౌతమి గర్భవతి అన్న విషయం జనానికి తెలిశాక వాళ్ళు చెవులు కొరుక్కుంటారు. ప్రత్యేకించి వంశీకృష్ణకేసి అసహ్యంగా చూస్తారు.

పక్కింటి ఆడపిల్ల మీద తాత్కాలికంగా జాలి ఏర్పడి ఉండొచ్చు. అయితే ఆ జాలి తన బిడ్డమీద 'నింద' పడేలా చేస్తుందనిపిస్తే ఏ తల్లి మాత్రం భరించగలదు?... భరించలే దు.

అందుకే ఆమె ఆ మధ్యాహ్నమే రేణుకకు ఫోన్ చేసి తన దగ్గరకు పిలిపించుకుంది. రేణుక వచ్చాక సమస్య ఆమెతో చర్చించింది.

"ఏమిటమ్మా రేణూ! ఇప్పుడయితే ఏంచే యాలో నాకయితే ఏమీ తోచటంలేదు. నువ్వే ఏదయినా సలహా చెప్పమ్మా''

రేణుక, పార్వతమ్మలు ఆవిడ బెడ్రూ మ్లో ఉన్నారు. గౌతమి మరో రూమ్లో పడుకుని తన పరిస్థితికి ఏంచేయాలో తోచక కుమిలిపోతూ ఉండొచ్చు.

పార్వతమ్మ మాటలు విన్నాక రేణుక చాలాసేపు మౌనంగా ఉండిపోయింది. దీర్ఘా లోచనలో మునిగిపోయినట్టు ఆమె పైకప్పు కేసి చూడసాగింది.

మూడు నిముషాలు తర్వాత తలదించి పార్వతమ్మ ముఖంలోకి చూస్తూ అంది. "ఇప్పుడు మనకున్న ఒకే ఒకదారి, గౌతమిని తిరిగి సత్యమూర్తి దగ్గరకు పంపడం. ఈమె ను పంపుతామంటే అతడు ఎంతవరకూ ఒప్పుకుంటాడో అన్న విషయం నమ్మకం తక్కువే అయినా, ఒకవేళ ఒప్పుకున్నా గౌత మికి ఎదురుకాబోయే పరిస్థితి చాలా ఘో రంగా ఉంటుందన్నది నిజం. మనం ఇంతా చేసింది గౌతమిని ఆ రాక్షసుడికి అప్పగించడా నికేనా?"

"మరేం చేద్దామంటావ్ రేణూ'' తనకేం తోచనట్టు ప్రశ్నించింది పార్వతమ్మ.

"ఏమీ చేయొద్దు. మునుపటి నిర్ణయాన్నే అమలుపరుద్దాం. కొన్ని ప్రశ్నలకు జవాబు కాలమే చెపుతుందంటూ వదిలేద్దాం"

"ఏదేమయినా వంశీ ఆరోజు అలా చేసి ఉండకూడదేమోనని నాకిప్పుడు అని పిస్తోంది రేణూ''

రేణుక చప్పున అంది. "అలా అనకండి ఆంటీ! ఎందుకంటే, మనం ఒక అడుగు ముందుకేశాక, వెనుకడుగు గురించి ఆలో చించకూడదు. అలా ఆలోచిస్తే అసంతృప్తి మొదలవుతుంది. ఆ అసంతృప్తి ఎదుటివాళ్ళ మీద వ్యక్తం చేయాల్సిన పరిస్థితి కలుగు తుంది. అది అంత మంచిది కాదు."

అది నిజమేనన్నట్టు పార్వతమ్మ నెమ్మది గా తలాడించింది.

"అయితే ప్రస్తుతానికి ఈ విషయం గు రించి మర్చిపోమంటావ్'

"అంతే... గౌతమి ప్రెగ్నెంట్ అన్న విషయం ఈ ఇంట్లో వాళ్ళందరూ మర్చిపో తారు. రేపటి నుండే ఆమెను కంప్యూటర్ క్లాసెస్కి పంపిద్దాం"

"అలాగే చేద్దాం" ఇష్టంగా అందో, అయి ష్టంగా పలికిందో తెలియదుగానీ, మొ త్తంమీద తలాడించింది పార్వతమ్మ.

ఆవిడతో మాట్లాడాక రేణుక లేచి వెళ్ళి గౌతమి ఎక్కడుందో వెతికింది. ఆమె తనకు కేటాయించిన గదిలో వెల్లకిలా పడుకుని, తిరుగుతున్న సీలింగ్ ఫ్యాన్కేసి తదేకంగా చూడడం గమనించింది.

"గౌతమీ'' పిలిచింది రేణుక.

ఆమె ఉలిక్కిపడి అటు చూసి, చప్పున లేచి కూర్చుంది. "రండక్కా''



రేణుక గదిలోకి వెళ్ళింది. ఆమె పక్కనే కూర్చుంటూ "ఏమిటి ఆలోచిస్తున్నావ్?" అడిగింది.

"ప్రత్యేకించి ఏమీలేదక్కా. ఏవో పిచ్చి పిచ్చి ఆలోచనలు." గౌతమి నవ్వలేక నవ్వి నట్టుగా నవ్వింది.

"ఎనీహౌ! కంగ్రాచ్యులేషన్స్''

"ఎందుకు?"

"తల్లివి కాబోతున్నందుకు''

"కాని... నేను తల్లిని కాదలచుకోవడం లేదక్కా''

విస్మయంతో బిగుసుకుపోయి, అలాగే ఉండిపోయి అడిగింది. "నువ్వు నువ్వనేదేమిటి గౌతమీ''

"నేను అబార్షన్ చేయించుకోవాలనుకుంటున్నాను''

లాగి చెంపమీద కొట్టాలన్న ఆవేశాన్ని అతికష్టంమీద అణుచుకుంది రేణుక. ముఖంలో ఆశ్చర్యం స్థానంలో ఆవేశం కదలాడింది. "నువ్వేం మాట్లాడుతున్నావో నీకే అర్థమవుతున్నట్టులేదు''

"లేదక్కా! పరిస్థితులను అర్థంచేసుకుని అన్నివిధాలా ఆలోచించాకే నేను ఈ నిర్ణయానికి వచ్చాను''

"ఏంటా పరిస్థితులు?"

"నా కారణంగా... నా కారణంగా ఈ ఇంట్లోని వ్యక్తులు నిందలు మోయటం నాకిష్టంలేదు. అందుకే..."

చాలాసేపటి తర్వాత రేణుక మాట్లాడింది. "చూడు గౌతమీ! నువ్వు అలాంటి త్యాగాలేమీ చేయొద్దు. మాతృత్వం అనేది ఓ వరం. దేవుడిచ్చిన ఆ వరాన్ని దూరం చేసుకోకు''

"అది కాదక్కా!..." గౌతమి మరింకేదో మాట్లాడబోయింది.

గౌతమి మాటలు మధ్యలోనే కట్‌చేసింది రేణుక. "ఈ కుటుంబశ్రేయస్సు గురించి నేనూ ఆలోచిస్తూనే ఉన్నాను. కాబట్టి, నేను చెప్పినట్టు నువ్వు చెయ్యి. ఎందుకంటే ఈ కుటుంబశ్రేయస్సుతోపాటు, నీ గురించి కూడా నేను ఆలోచిస్తున్నాను...అందుకే రేపటి నుండి నువ్వు కంప్యూటర్ క్లాసెస్‌కి వెళ్ళబోతున్నావు''

రేణుక తన నిర్ణయం స్థిరంగా చెప్పాక, తనిక మాట్లాడవలసింది మరేం లేనట్టు గౌతమి మౌనంగా ఉండిపోయింది.

★ ★ ★

గౌతమి ఉదయమే అన్ని పనులూ చేసేసి, రెడీ అయి ఉండేది. వంశీకృష్ణ ఆమెను ఆఫీసుకెళుతూ ఇన్‌స్టిట్యూట్ ముందు దించేసి వెళ్ళేవాడు.

మధ్యాహ్నం ఆమె ఆటోలో ఇంటికి వచ్చేసేది. ఆ తర్వాత మళ్ళీ ఇంటిపనులు, ప్రభాకరరావు, పార్వతమ్మల పనులు చేసేది.

ప్రభాకరరావు ఇప్పుడు కాస్త కోలుకున్నాడు. మనిషి ఆసరాతో అటు ఇటు తిరగగలుగుతున్నాడు. ఆయన అలా తిరగటం చూస్తుంటే, పార్వతమ్మ సంతోషంతో పొంగిపోతోంది. తమ ఇంట్లోకి క్రమంగా ఉత్సాహం ప్రవేశించి, మనసులను ఆహ్లాదపరుస్తున్నట్టు అర్థమయింది.

ఓరోజు గౌతమి మాటలమధ్య ఆవిడతో అంది. "నేను మీకెంతో ఋణపడిపోయి ఉన్నాను. ఈ ఋణం ఎలా తీర్చుకోవాలో అర్థంకావట్లేదు''

"మేమే నీకు ఋణపడి ఉన్నామని అనుకుంటూ ఉంటే, నువ్వేమిటమ్మా అలా మాట్లాడుతావ్?"

"నా కంప్యూటర్ చదువులకు మీరే ఫీజులు కట్టారు. నాకు నిలువనీడనిచ్చి పోషిస్తున్నారు. ఇదంతా నాకు ఋణభారమే కదా?"

పార్వతమ్మ ఈసారి కాస్త సీరియస్‌నెస్ కొనితెచ్చుకుంది. "అలా అయితే నువ్వు చేసే ఈ సేవలన్నింటికి మేమూ నీకు ప్రతిఫలం ముట్టచెప్పాలికదమ్మా... ముట్టచెప్ప




మంటావా?"

"ఆంటీ..." ఈసారి గౌతమి స్వరంలో బాధ ధ్వనించింది.

అది గమనించినట్టుగా పార్వతమ్మ పలికింది. "నువ్వు మాకు చేసే సేవలకి ప్రతిఫలం ముట్టచెపుతానంటే నువ్వెంత బాధపడుతున్నావో, మాకు రుణపడిపోయినట్టు నువ్వు మాట్లాడితే మేమూ అంతే బాధపడతాం అర్థమయిందా?"

నిలువుగా తలాడించింది గౌతమి.

కొద్దిక్షణాలు గడిచాక పార్వతమ్మే అడిగింది. "కంప్యూటర్ చదువు నీకు ఇంట్రస్ట్‌గానే ఉందామ్మా?"

"చాలా ఇంట్రస్ట్‌గా ఉంది ఆంటీ. అందులోనూ నాకు మొదటనుండి బొమ్మలు వేయటం అంటే ఇంట్రస్ట్ కాబట్టి 'యానిమేషన్' కోర్స్ చాలా బాగా నచ్చేసింది. కంప్యూటర్ స్క్రీన్‌మీద బొమ్మలు తయారు చేయటం ఎంత బాగుందో?" చదువుకునే వయసులో ఉండే ఉత్సాహం ఆ క్షణం ఆమెలో కదలాడడం గమనించింది పార్వతమ్మ. ప్రపంచంలో అది ఏరంగమైనా కావచ్చు. ఒక సబ్జెక్ట్‌ని ఇష్టపడి, కష్టపడి నేర్చుకునే వ్యక్తి ఆ సబ్జెక్ట్ గురించి ఇతరులకు చెప్పాల్సి వచ్చినప్పుడు చిన్నపిల్లాడిలా మారిపోతాడేమో!

కంప్యూటర్‌మీద కలిగిన ఆమె ఇంట్రస్ట్‌ను చూసి, కాసింత క్యూరియాసిటీగానే అడిగింది పార్వతమ్మ "కంప్యూటర్‌లో బొమ్మలు తయారుచేయడం ఏమిటమ్మా?"

"అవునాంటీ! కంప్యూటర్‌లో బొమ్మలు కూడా తయారుచేయొచ్చు మనం. దాన్నే 'యానిమేషన్' అంటారు. మన టి.విల్లో కార్టూన్ ఫిల్మ్స్ వస్తాయే, అవన్నీ ఇప్పుడు కంప్యూటర్ మీదే చిత్రీకరిస్తున్నారు. అంతకుముందు డిస్నీ స్టూడియోవాళ్ళు వరుసగా బొమ్మలు గీసి కార్టూన్‌ఫిల్మ్ తీసేవాళ్ళు. కంప్యూటర్ వచ్చాక కార్టూన్ ఫిల్మ్ తీయడం సులభమయింది. అదీగాక ఈమధ్య సినిమాల్లో కూడా పాటల మధ్య కార్టూన్ బొమ్మలు కదలాడడం చూపిస్తున్నారు. అవీ కంప్యూటర్‌లో తయారుచేసేవే... మనదేశంలోకన్నా విదేశాలలో కంప్యూటర్ యానిమేషన్ నేర్చుకున్నవాళ్లకి ఎంత డిమాండ్ ఉందో తెలుసా? నెలకు ఆరేడువేల డాలర్లు జీతం ఇస్తారు. అంటే రెండున్నర మూడు లక్షల రూపాయల వరకూ జీతం అన్నమాట"

"అయితే ఇదంతా మీకు కంప్యూటర్ క్లాసెస్‌లోనే చెపుతారా గౌతమీ?"

"అవునాంటీ"

"మరయితే, ఈ కోర్స్ చదివాక హాయిగా విదేశాలకు వెళ్ళిపో. అక్కడ నాలుగేళ్ళు కష్టపడి నెలకో లక్షరూపాయలు దాచుకున్నా, ఆ తర్వాత ఇండియాకు వచ్చేసి జీవితాంతం కష్టపడకుండానే బతికేయొచ్చు"

ఆమె కాసేపు మౌనం వహించింది. ఆ సమయంలో తన అరచేతులకేసి చూసుకుంది. మెల్లగా తలెత్తి పార్వతమ్మ ముఖంలోకి చూసి "లేదాంటీ! నేను... నేను ఎట్టి పరిస్థితుల్లోనూ విదేశాలకు వెళ్ళనుగాక వెళ్లను" చెప్పింది స్థిరంగా.

పార్వతమ్మ కనుబొమలు ముడివేసి, గౌతమికేసి అదోలా చూసింది. "ఏం, ఎందుకెళ్ళవ్?"

మాటరావడం కష్టమయినట్టుంది. అయినా సమాధానం చెప్పడం అవసరం కాబట్టి పెదవి విప్పక తప్పదనిపించిందేమో! పెదవి విప్పితే గుండెలోతులనుండి మాటలు పెగిలివచ్చాయి. "నేను విదేశాలకు వెళ్ళిపోతే, మిమ్మల్నీ అంకుల్‌ని ఎవరు చూసుకుంటారాంటీ?"

మనసు మూగబోవడం అంటే ఏమిటో తెలిసింది పార్వతమ్మకు. అప్పుడెప్పుడో తమకు యాక్సిడెంట్ అయినప్పుడు, పుత్రవాత్సల్యం కొడుకు పైచదువులు చదవాలని కోరుకున్నా, అతడు తనిక చదువు జోలికి వెళ్ళను అన్నప్పుడు ఇదిగో ఇలాగే మనసు

మూగబోయింది. తిరిగి ఇంతకాలానికి ఈ అమ్మాయి తమ కోసం, తన భవిష్యత్‌లో ఎదురొచ్చే సదవకాశాన్ని వదులుకోబో తోందని తెలిసినప్పుడు... మరోసారి మూగ బోయింది.

ఆమె చాలా సేపు ఆ ఆనందాన్ని ఆస్వాది స్తూ మాట్లాడలేకపోయింది.

పార్వతమ్మ మౌనం వహించడంతో గౌ తమి ఆమె దగ్గరనుండి లేచి వెళ్ళిపోయింది.

ఆ సాయంత్రం వంశీ తన గదిలోకి వచ్చినప్పుడు పార్వతమ్మ కొడుక్కి గౌతమి చెప్పిన విశేషం యధాతథంగా చెప్పింది.

అతడు నవ్వి ఊరుకున్నాడు. నిజానికి అతడూ చాలా సంతోషపడేవాడే. కాని ఆ సమయంలో అతడికి మూడ్ బాగోలేదు. మధ్యాహ్నం ఆఫీసుకి వచ్చిన ఓ కాలేజీ ఫ్రెండ్ మూడ్ పాడుచేశాడు.

వంశీకృష్ణ తల్లితో కాసేపు మాట్లాడి తన గదిలోకి వచ్చాడు. బెడ్‌మీద వాలితే మధ్యా హ్నం మిత్రుడు అన్నమాటలే గుర్తుకురాసా గాయి.

శశికుమార్ తనకు డిగ్రీలో క్లాస్‌మేట్. అప్పట్లో రేణుక, తనూ కలసి తిరగడం చూసి రకరకాల పుకార్లు పుట్టించాడనీ తెలుసు. అయినా అలాంటి విషయాలు పట్టించు కుంటే మరీ పెద్దవిగా మారి, మరింత పబ్లిసిటీ తెచ్చుకుంటాయి కాబట్టి పట్టించుకు నేవాడు కాదు.

ఆరోజు మధ్యాహ్నం లంచ్ అవర్‌లో ఆఫీసుకు వచ్చాడు శశికుమార్. వంశీని విష్‌చేసి ఎదురుగా కూర్చుంటూ చెప్పాడు. "సెకండ్‌ఫ్లోర్‌లో ఉండే కొరియర్ ఆఫీసులో పని ఉండి వచ్చాన్రా. సరే! ఎలాగూ ఇంత దూరం వచ్చాను కదా అని నిన్ను చూసి వెళ్దామని ఇలా పైకి వచ్చాను''

"అలాగా'' అని వంశీకృష్ణ బెల్‌కొట్టి ఆఫీస్‌బాయ్ వచ్చాక కూల్‌డ్రింక్స్ తెమ్మని





చెప్పి పంపాడు. "చాలారోజులకు కలిసావ్. చెప్పు ఏమిటి విశేషాలు?" అడిగాడు అతడే.

"నా దగ్గరేమున్నాయి. విశేషాలంటూ ఉంటే అవి నీ దగ్గరే ఉన్నాయి''

"నా దగ్గర విశేషాలా? నా దగ్గరేము న్నాయి'' అని ఆశ్చర్యపోయినట్టు ముఖంపె ట్టి, అంతలోనే గుర్తొచ్చినట్టు నవ్వేశాడు. "ఓహో! ప్రెసిడెంట్‌నుండి తీసుకున్న బిజి నెస్ ఎక్సలెన్సీ అవార్డ్ గురించిన విశేష మా?" అన్నాడు.

అది చాలా మామూలు విషయం అన్న ట్టూ, తను అంతకన్నా ముఖ్యమైన విషయ మేదో విన్నట్టూ శశికుమార్ ముందుకు వంగా డు. "ఆ విశేషం కాదోయ్. అమ్మాయిల గురించిన మరో విషయం విన్నాను... అది నిజమేనా?" అదేదో అత్యంత రహస్యమయి నట్టు గొంతు తగ్గించి మరీ అడిగాడు.

శశికుమార్ ఎవరి గురించి ప్రస్తావించాడో అర్థమయింది. అతడికి చాలా చిరాకని పించింది. అయినా ఓ మనిషి సాధించిన 'సక్సెస్' గురించి ఏమాత్రం పట్టించుకోని జనం, ఇలాంటి విషయాల్లో అంత ఆసక్తి చూపుతారు ఎందుకని? నిజానికి తను సాధించిన 'అవార్డ్' విశేషం ముందు పోల్చు కుంటే, గౌతమి విషయంలో ప్రత్యేకత ఏముంది? కాని ఈ జనానికి ఆ 'విశేషం' అక్కర్లేదు, ఈ 'విషయమే' కావాలి.

మనసంతా చీకాకుగా మారడంతో అతడు అసహనంగా జవాబు చెప్పాడు. "నిజమే! మా పక్కింటివాడి పెళ్ళాన్ని తెచ్చుకుని మా ఇంట్లో ఉంచుకున్నాను. ఆ అమ్మాయి చాలా అందంగా ఉంటుంది. అందులోనూ నాకు బాగా నచ్చింది''

వంశీకృష్ణనుండి అలాంటి సమాధానం ఊహించకపోవడంతో శశికుమార్ కాస్త కంగుతిన్నాడు. కాని అంతలోనే తేరుకుని, ప్రపంచంలోని దిగులంతా తన ముఖంలోకే తెచ్చుకుని "అయితే నేను విన్నది నిజమేన న్నమాట. ఏదయితే నేను నమ్మలేకపో యానో అది నిజమేనన్నమాట. నేను జరగ

కూడదని కోరుకున్నది, జరిగిపోయిందన్న మాట" అన్నాడు నిట్టూరుస్తూ.

తన విషయంలో తనకు లేని దిగులు అతడికెందుకో వంశీకృష్ణకు అర్థంకాలేదు. "ఏం చెయ్యమంటావ్‌రా! ఆ సిట్యువేషన్‌లో అలా చేయక తప్పలేదు''

శశికుమార్ అప్పటికీ అతడు వ్యంగ్యంగా మాట్లాడుతున్నాడన్న విషయం గమనించలేదు. దాంతో బాధను తట్టుకోలేనట్టు, ముఖం అదోలా పెట్టి అన్నాడు. "తప్పురా... పెళ్ళయిన ఆడదాన్ని భర్తనుండి విడదీసి తీసుకురావడం చాలా తప్పురా అయినా అలా చేయడంవలన ఏమవుతుందో ఒక్కసారి ఆలోచించు. నీ జీవితమంతా ఆ పెళ్ళయిన ఆడదాని చుట్టూనే అల్లుకుపోతుంది. చివరికి ఆవిడే నీకు దిక్కుగా మారిపోతుంది. కన్నెపిల్లను కాపురానికి తెచ్చుకోవాల్సిన నువ్వు పెళ్ళయిన ఆడదానితో బతుకు ముడివేసుకోవడం ఏమిట్రా మన మిత్రులంతా ఈ విషయంలో ఎంత బాధపడిపోతున్నారో నీకర్థంకాదు''

తను చేసిన పని తెలియని వ్యక్తులకు కూడా ఇతడే కల్లబొల్లి కబుర్లు నాలుగు అల్లి రసవత్తరమైన కథగా మలచి వినిపించి ఉంటాడని తనకు తెలుసు. ఇది మనుష్యుల కామన్ సైకాలజీ. ఏదేమయినా తను చేసిన మంచిపని చెడ్డపనిగా రూపుదిద్దుకుని జనంలో ప్రాచుర్యం పొందిందని అప్పుడే వంశీకృష్ణకు తెలిసింది.

ఇంతలో ఆఫీస్‌బాయ్ కూల్‌డ్రింక్ బాటిల్స్ తెచ్చి టేబుల్‌మీద పెట్టి వెళ్ళిపోయాడు.

కూల్‌డ్రింక్స్ తాగడం పూర్తయ్యాక శశికుమార్ చెప్పాడు. "ఏదేమయినా నువ్వు చేసిన పని గురించి మరోసారి సమీక్షించుకోవడం మంచిదిరా. చాలామంది సినిమా హీరోలు కూడా పెళ్ళయిన ఆడదాన్ని విడాకులిప్పించి మళ్ళీ పెళ్ళిచేసుకుంటున్నారు. ఇక హీరోయిన్‌లయితే మగాడికి మొదటి పెళ్ళాం ఉన్నప్పటికీ రెండోపెళ్ళాలుగా సెటిల్ అయిపోతున్నారు. మన ఆంధ్రాలో తక్కువగానీ, ముఖ్యంగా ఉత్తరాది రాష్ట్రాలలో డైవోర్సీ ఆడవాళ్ళను పెళ్లిచేసుకోవడం చాలా మామూలయిపోయింది. పెళ్ళయిపోయిన ఆడది, శీలం... ఇలాంటి మాటలేవీ మాట్లాడనుగానీ, ఎందుకో తెలియకనే పెళ్ళయిన ఆడదాన్ని మొదటిసారే పెళ్లిచేసుకోవడం కాస్త ఇబ్బందిగా అనిపిస్తుంది. అఫ్‌కోర్స్! రెండోసారి పెళ్లిచేసుకోవడమో లేదా చిన్నింటి సెటప్‌లాంటిదయితే నో ప్రాబ్లమ్. అదీ అలా ఎందుకు అని ఆలోచించుకుంటే, ఏదో తెలియని అసంతృప్తి మగాడికి కలుగుతుందన్నది నిజం"

'అయ్యా మిత్రుడా! నాకు మీరు చెప్పే 'విశాలమైన' ఆలోచనలేవీ లేవు. నేను కేవలం ఓ స్త్రీ కష్టాలలో ఉందని తెలిసి నాకు చాతనయిన సహాయం చేశాను. దాన్ని మీరు ఎలా భావించినాసరే! ఏమనుకున్నా సరే!' అని అరిచి చెప్పాలనిపించింది. కాని వంశీకృష్ణ అలా చేయలేకపోయాడు. ఎందుకంటే తను ఎంత నమ్మబలకాలని ప్రయత్నించినా అతడు నమ్మడు.

శశికుమార్ చాలాసేపు ఏవేవో హితబోధ చేసి, అలసట వచ్చాక లేచాడు. "వస్తాన్రా'' అంటూ వెళ్ళిపోయాడు.

వాడు బయటకెళ్ళిన మరుక్షణమే ఛాంబర్‌లో మిత్రుడికి ఏం చెప్పాడో మర్చిపోయి ఉంటాడు.

'కాని తనకు ఆ బాధ ఇదిగో ఇప్పటికీ అలాగే ఉంది' బెడ్‌మీద పక్కకు పొర్లుతూ మనసులో అనుకున్నాడు వంశీకృష్ణ.

★ ★ ★

వంశీకృష్ణ కార్లో డ్రైవింగ్‌సీట్లో కూర్చుని, గౌతమి కోసం ఎదురుచూస్తూ ఉన్నాడు.

మరో పదిసెకనుల తర్వాత గౌతమి వచ్చాక కారు బ్యాక్‌డోర్ తెరచుకుని వెనుక సీట్లో కూర్చుంది.

సత్యమూర్తి గేటు తెరుచుకుని లోపలికి వస్తూ కనిపించాడు.

ఈమధ్యకాలంలో అసలు కనిపించని అతడు, హఠాత్తుగా లోపలికి వస్తూ కనిపించడంతో వంశీకృష్ణ కంగారుపడ్డాడు. మనసు కీడు శంకించింది.

సత్యమూర్తి కారుకి దగ్గరగా వచ్చాకే గౌతమి అతడిని చూసింది. మళ్ళీ ఏ గొడవ మొదలెట్టేందుకు వచ్చాడో అనుకుని భయపడింది. అప్రయత్నంగానే పెదవులు బిగపట్టి అతడికేసి చూడసాగింది.

అతడు కారు దగ్గరగా వచ్చాక కాస్త వంగి చెప్పాడు. "గౌతమీ! జరిగిందేదో జరిగిపోయింది. ఇక మన ఇంటికి వెళ్ళిపోదాం వచ్చేయ్''

సత్యమూర్తి అంత నెమ్మదిగా మాట్లాడడం వంశీకృష్ణకు ఆశ్చర్యమనిపించింది. అతడు సత్యమూర్తి ముఖంలోకే విస్మయంగా చూడసాగాడు.

మగాడు లేకపోతే ఆడది బతుకు వెళ్ళదీయడం కష్టమే కావచ్చు. కాని మగాడికి కూడా ఆడది లేకుండా జీవితం గడపడం అంత సులభమేమీ కాదు. ఆడది లేని మగాడి జీవితంలో అసౌకర్యం చోటుచేసుకుంటుంది. అది దైనందిన జీవితంమీద ప్రభావం చూపుతుంది.

ఇప్పటివరకూ గౌతమి చేసిపెడితే సుష్టుగా తింటున్న అతడికి ఇప్పుడే ఆడదాని అవసరం ఏమిటో తెలిసివచ్చినట్టుంది. వంట వండుకోవడం చాతకాకనో, రోజూ హోటల్ తిండి తినలేకనో లంకణాలు చేసినవాడిలా అతడి ముఖం పీక్కుపోయి ఉంది. బట్టలు మాసి ఉన్నాయి. ఇప్పుడు ఆ ఇంట్లోకి వెళితే ఆ ఇల్లు చూడలేనంత అసహ్యంగా ఉండి ఉంటుందన్న విషయమూ ఊహించుకోవచ్చు.

వంశీకృష్ణ సత్యమూర్తిమీద నుండి చూపు మరల్చి, గౌతమి మీద నిలిపాడు.

సత్యమూర్తి మాటలు ఆమె నమ్మినట్టులేదు. కారు మరో డోర్‌కి దగ్గరగా ముడుచుకుపోయి "వద్దు... నేను రాను. నన్ను తీసుకెళ్ళి చంపేస్తావ్ నువ్వు'' అంటూ అరవసాగింది.

అతడు ఆమె మాటలకు కోపం తెచ్చుకోకుండా నవ్వుతూ పలికాడు. "లేదు గౌతమీ! నేను నిన్నేం చేయను. అసలు నేను తాగుడు కూడా మానేశాను. నీమీద ఒట్టు..." అతడు తన చెయ్యి కారు లోపలికి పెట్టబోయాడు.

అంతే... ఆమె చప్పున మరోవైపు కారు డోర్ తెరుచుకుని దిగింది.

"నాకు...నాకు నీ గురించి బాగా తెలుసు. నువ్విప్పుడు నన్ను అనునయంగా ఇంటికి తీసుకెళ్ళి, అక్కడికెళ్ళాక నీ రాక్షసత్వం చూపుతావ్. రెట్టించిన కోపంతో నన్ను చంపేస్తావ్... అందుకే నేను రాను. నా కడుపులో పెరిగే బిడ్డను కాపాడడం కోసమయినా నేను ఆ ఇంటికి రాను''

సత్యమూర్తి అనుమానంగా కారుకి అవతల ఉన్న ఆమెను కొద్దిక్షణాలు చూశాడు. 'కడుపులో బిడ్డను కాపాడడం...' అప్పటికి అతడికి అర్థమయినట్టుంది. ముఖంలో రక్తం చుక్క లేనట్టుగా పాలిపోయింది. ఆ స్థితి నుండి తేరుకునేందుకు చాలా సమయం పట్టింది.

అప్పటివరకూ వేసుకున్న మంచితనం ముసుగు ఒక్కసారిగా తొలగిపోయింది. ఒక వికృతమైన నవ్వు ముఖంలో కదలాడింది.

"అయితే అయిపోయిందన్నమాట... అంతా అయిపోయిందన్న మాట. ఇచ్చేశావ్. వాడికి నీ దగ్గరున్నదంతా సమర్పించేశావ్. నాదనుకున్న సొమ్ము వాడి సొంతమయిపోయింది. చివరికి వాడి బిడ్డకు తల్లివవుతున్నావ్... వాహ్! కలియుగ పతివ్రతా శిరోమణీ నీకు హేట్సాఫ్..."

అసలు అతడు బాధతో కుమిలిపోవాలి. కాని రాటుదేలిన అతడి మొండితనం,





సంస్కారంలేని వ్యక్తిత్వం, పరువుమర్యాదలకు భయపడని గుణం... పిచ్చివాడిలా నవ్వేలా చేశాయి. అతడు నవ్వసాగాడు... పిచ్చివాడిలా నవ్వసాగాడు.

వంశీకృష్ణ కారు దిగాడు. అయోమయంగా సత్యమూర్తినీ, గౌతమిని మార్చిమార్చి చూడసాగాడు. సత్యమూర్తి గౌతమిని ఇంటికి తీసుకెళ్తానన్నప్పుడు, ఆమెకు నచ్చచెప్పి అతడి వెంట ఆమెను పంపించాలనే ఆలోచన మనసులో ప్రవేశించింది. కాని క్షణాల్లోనే పరిస్థితి మలుపు తిరిగింది.

సత్యమూర్తి ఒక్కసారిగా గొంతు పెంచాడు. పక్కింటి మిద్దెమీద నిలబడి ఉన్న ఓ వృద్ధుడికేసి తిరిగి చేతులూపుతూ అరిచాడు.

"హలో సార్ రండి! మీ ఇంటి పక్కనే ఉన్న ఈ మహానుభావుడు చేసిన గొప్పపనిని చూడండి. ఈయన పెళ్లి చేసుకోలేదండి. పెళ్లి చేసుకుంటే పెళ్లాన్ని పోషించాల్సి వస్తుందని, నా పెళ్ళాన్ని లేవదీసుకుపోయి, హేపీగా బిడ్డను కనేస్తున్నాడు. రేపు బిడ్డ పుట్టాక నా పెళ్లాన్ని నా దగ్గరకు పంపించేస్తాడులా ఉంది. అయినా నేనంత సిగ్గులేనివాడిని కాదండోయ్''

అతడి అరుపులకు చుట్టుపక్కల ఇళ్ళ మిద్దెల మీద జనం మూగసాగారు. దారిన వెళ్ళేవాళ్లు ఆ ఇంటిగేటు దగ్గరే నిలబడిపోయి లోపల జరిగే చోద్యం చూడసాగారు.

"నేను తాగుబోతునే. కాని నాకూ మనసుందండీ మనసు... చెడిపోయిందని ఖచ్చితంగా తెలిసిపోయాక దీన్ని నా ఇంటికెందుకు తీసుకెళ్తాను. అప్పట్లో వీడు నామీద కేసు పెట్టాడు. ఇప్పుడు నేను పోలీస్‌స్టేషన్‌కెళ్ళి వీడు నా పెళ్ళాన్ని తీసుకెళ్లి కడుపు చేశాడని కేసు పెడతాను''

గౌతమి ఇక అక్కడ ఉండలేకపోయింది. ఆమె వస్తున్న ఏడుపును ఆపుకుంటూ ఇంట్లోకి పరుగెత్తింది.

అతడి అరుపులకు పార్వతమ్మ వీల్‌ఛెయిర్ నెట్టుకుంటూ గడపవరకూ వచ్చింది. ఆమె వెనకే వరాలు నిలబడివుంది.

పరుగెత్తుకెళుతున్న గౌతమిని, పార్వతమ్మను, వరాల్ని చూశాక సత్యమూర్తి పార్వతమ్మమీద చూపు నిలిపి నాటకఫక్కీలో పలికాడు "...ఆహా! ఎంత గొప్పదానివమ్మా నువ్వు. పురాణాల్లో ఏ తల్లీ కూడా నీ అంత విశాలహృదయంతో ఆలోచించలేదు. ఏ తల్లయినా తన కొడుక్కి పెళ్లిచేసి కోడలి ద్వారా మనవడిని పొందాలనుకుంటుంది. కాని నువ్వు పక్కింటివాడి పెళ్లాన్ని నీ కొడుకు లేవదీసుకు వస్తే సంబరపడిపోయావ్. నా పెళ్లాం ద్వారా నీకు మనవడు పుడుతున్నాడని సంతోషపడిపోతున్నట్టుంది''

పార్వతమ్మ పెదవులు బిగపట్టింది. తనిక అక్కడ నిలవలేనట్టు వంశీకృష్ణ ఇంట్లోకి నడిచాడు.

అప్పటివరకూ నిశ్శబ్దంగా చూస్తున్న వరాలు విసురుగా బయటకు వచ్చింది. సత్యమూర్తి దగ్గరగా వెళ్ళి తుపుక్కున అతడి ముఖంమీద ఉమ్మింది. అతడు తేరుకునేలోగానే మాటల తూటాలు వదిలింది.

"దొంగచచ్చినోడా! పెళ్ళాన్ని కాల్చుకు తింటూనే కడుపు చేసిందిగాక, ఆ నేరం బంగారంలాంటి మా చినబాబుగారిమీదకు నెడతావా? ఇలా మంచివాళ్ళమీద అభాండాలు వేసినవాళ్లు పురుగులుపడి చస్తార్రా! పిలవరా! పోలీసుల్ని పిలుచుకురారా. వాళ్ళను కూడా ఇలాగే కాలర్ పట్టుకుని హాస్పిటల్‌కెళ్ళి పరీక్ష చేయించమంటాను. అప్పుడయినా బిడ్డకు తండ్రి ఎవరో తెలిసిపోతుంది కదా'' వరాలు చప్పున అతడి చొక్కా పట్టుకుంది.

ఓ ఆడది తనను అంత నీచంగా మాట్లాడడంతో సత్యమూర్తి బిక్కచచ్చిపోయాడు. ఆమెకు 'గౌతమి కడుపు' విషయంలో కొన్ని ఆధారాలు ఉండి ఉండకపోతే అంత స్పీడ్‌గా మాట్లాడదనీ అర్థమయిపోయింది. దాంతో కొంత కంగారు, మరికొంత దబాయింపు



ప్రదర్శిస్తూ "ఏయ్... ఏంటే నువ్వు మాట్లా దేది? అసలు నువ్వెవరే నాతో మాట్లా డేందుకు?" అన్నాడు.

"మరి నువ్వు కూడా ఇరుగుపొరుగు వాళ్ళందర్నీ పిలుస్తున్నావ్‌కదరా. వాళ్ళేదో పెద్ద నీతిపరులయిపోయినట్టు మధ్యవర్తి త్వానికి రమ్మంటున్నావ్‌కదా, రమ్మను. ఈ వీధిలో ఒక్కో ఇంట్లో వ్యవహారమేమిటో నాకు బాగా తెలుసు. ఎవడొచ్చి మాట్లాడతా డో మాట్లాడమను''

ఆమె అరుపులు వినిపించడంతో మిద్దెల మీద నిలబడిన జనం మెల్లగా ఇళ్ళలోకి జారుకోసాగారు.

తను మరికాసేపు అక్కడుంటే వరాలు తననూ చెప్పుతో కొట్టినా కొట్టొచ్చు అని పించింది. తను ఆమెను దెబ్బకొడితే అది మామూలే. కాని ఆమె తనను కొడితే దానికి మించిన అవమానంలేదు.

అందుకే అతడు ఎలాగోలా ఆమె చేతిలో నుండి కాలర్ విడిపించుకుని ఆ ఇంట్లోనుండి బయటపడ్డాడు.

ఆ ఇంట్లో మరోరోజు ఎవ్వరూ సరిగా తిండి తినకుండా గడిచిపోయింది.



రేణుక ఇంటిముందు కారు ఆపి కిందికి దిగినప్పుడు అటు చూశాక ముందుకు అడు గువేయలేక అక్కడే ఆగిపోయాడు వంశీకృ ష్ణ.

లాన్‌లో కూర్చుని మరో యువతితో మా ట్లాడుతోంది రేణుక. తను వాళ్ళ మధ్యకు వెళ్ళి డిస్టర్బ్ చేయడం ఇష్టంలేనట్టు కారెక్క బోతూ ఉంటే రేణుకే చూసి అరిచింది "వంశీ!... వంశీ! మళ్ళీ ఎక్కడికి వెళ్తు న్నావ్?"

"జస్ట్! చిన్నపని గుర్తుకొచ్చింది. చూసు కుని మళ్లీ అర్థగంటలో వచ్చేస్తాను''

"పని ఉంటే మళ్ళీ చూసుకోవచ్చు. ఫీల్ కాకుండా ముందిలా రా''

ఆమె అలా అన్నాక ఇక వెళ్ళక తప్పని పరిస్థితి ఏర్పడినట్టు అతడు భుజాలు ఎగరేసి వారి దగ్గరగా నడిచాడు.

వంశీకృష్ణ దగ్గరగా వచ్చాక రేణుక ఎదుట ఉన్న యువతివైపు చెయ్యి చూపించి అతడితో చెప్పింది "మీట్ మిస్ డాక్టర్ సమన్విత"

ఆమెవైపు తిరిగి అంది "ఈయన వంశీకృ ష్ణ గ్రూప్ ఆఫ్ ఇండస్ట్రీస్ యం.డి. వంశీకృ ష్ణ''

వంశీకృష్ణ అప్పుడే "నమస్తే'' అంటూ ఆమెవైపు చూశాడు. ఆమె కూడా అప్పుడే అతడికి చేతులు జోడించి "నమస్తే'' అంది.

పాతికేళ్లలోపే ఉంటాయి ఆమెకు. తెల్లటి మేనిఛాయతో, ఆకర్షణీయమైన రూపంతో చూపులు మరల్చుకోవడం కష్టమనిపించేంత అందంగా ఉందామె.

రేణుక చెప్పింది "కూర్చో వంశీ''

అతడు కూర్చున్నాడు. చూడకూడదను కుంటూనే మరోసారి ఆమెకేసి చూశాడు. అప్పుడే ఆమె కూడా తలెత్తి అతడికేసి చూడటంతో చూపులు మరోసారి కలుసుకు న్నాయి. ఆమె ఎవరో తెలుసుకోవాలన్న కోరిక కూడా మనసులో కలిగింది.

అతడి మనసు గ్రహించే చెప్పిందో, యధా లాపంగా పలికిందో తెలియదుగానీ రేణుక

అతడితో చెప్పింది "సమన్విత నాకు కజిన్, ఢిల్లీలో యం.బి.బి.యస్. పూర్తిచేసింది. ఎలాగూ ప్రాక్టీస్ అవసరం కాబట్టి, రఘురామ్ కట్టబోయే హాస్పిటల్‌లో డాక్టర్‌గా పనిచేయాలని ఢిల్లీనుండి వచ్చింది''

వంశీకృష్ణ 'అలాగా' అన్నట్టు తలాడించాడు.

అంతలో సమన్విత అంది, "ఈ రెండురోజుల్లోనే అక్కయ్య చాలాసార్లు మీ గురించి ప్రస్తావించింది. మీ గురించి అంతా చెప్పింది. ఐయామ్ రియల్లీ అప్రిసియేటింగ్ యూ.... ఈ కాలంలో మీలాంటి మనుష్యులు ఉండడం అరుదు''

అతడు అయోమయంగా రేణుక ముఖంలోకి చూశాడు. ఆమె నిలువుగా తలాడిస్తూ నవ్వింది. వెంటనే లేస్తూ "మాట్లాడుకుంటూ ఉండండి. కాఫీ తీసుకొస్తాను'' సమాధానం ఆశించకుండానే లోపలికి వెళ్లిపోయింది.

లాన్‌లో వాళ్లిద్దరే మిగిలారు.

ఇద్దరి మధ్యా నిశ్శబ్దం చోటుచేసుకుంటుందేమో అని అతడు అనుకున్నాడు గానీ, ఆమె అలా జరగనివ్వలేదు. ఎంతయినా ఢిల్లీలో పెరిగిన అమ్మాయి కాబట్టి మాటలు కలపడం కష్టంకాలేదు.

"ఏదేమయినా మీరు చాలా డేరింగ్‌గా ప్రవర్తించారండీ. మీరే కనుక లేకపోతే పాపం ఆ అమ్మాయి... ఏం పేరూ? గౌతమి తనేమయిపోయి ఉండేదో? ఈ రోజుల్లో కంటి ఎదురుగా మానభంగం జరుగుతున్నా మనకెందుకులే అని తలతిప్పుకుని వెళ్ళిపోయే మగాళ్లున్న సమాజంలో అన్ని అవమానాలూ భరించి మీరు ఆమెను ఆదరించి దగ్గరుంచుకున్నారంటే మిమ్మల్నేమని పొగడాలో అర్థం కావడంలేదు''

'ఈ ఢిల్లీ అమ్మాయికి మాటలు కలపడమే కాదు, మనసులో ఉన్నది బయట పెట్టకపోతే నిద్రపట్టదనుకుంటా' మనసులోనే అనుకున్నాడు అతడు. అయినా ఆ చోట గౌతమి గురించి సంభాషణ ఇష్టం లేకపోవడంతో టాపిక్ డైవర్ట్ చేస్తూ అడిగాడు.

"మీరెక్కడ దిగారు?"

"బాగుంది మీ ప్రశ్న! పిన్నిగారి కూతురు, నాకు అక్కయ్య ఇక్కడ ఉంటే, అందులోనూ నేను వాళ్ల హాస్పిటల్‌లోనే పనిచేస్తుంటే, నేను వాళ్ళింట్లో దిగక హోటల్లో దిగమంటారా?"

తన చిన్ని ప్రశ్నకు, ఆమె చెప్పిన అతిపెద్ద జవాబు నవ్వు తెప్పించింది. అయితే అతడు తన నవ్వు దాచుకునే ప్రయత్నం చేయలేదు. మనసారా నవ్వాడు.

ఆ సమయంలో అతడికి గౌతమి గుర్తొచ్చింది. గౌతమి ఎప్పుడూ ఎక్కువగా మాట్లాడదు. తను చెప్పదలచుకున్న మాట నోటితో కాకుండా కళ్లతోనో లేదా చేతులతోనో చెప్పటం ఆమెకు ఇష్టం. అందుకే ఆమె అంటే తనకు అదో రకమైన అభిమానం. ఆమె దగ్గర తను ఓ రకమైన ఉద్విగ్నత, ఉత్తేజం ఫీలవుతాడు.

ఇక రేణుక తనూ ఎక్కువ మాట్లాడకపోయినా సమస్య గురించి లోతుగా ఆలోచించి చక్కని సలహా ఇస్తుంది. అంతేకాకుండా తన తప్పొప్పులను సమీక్షించి నిలదీసే చనువు, ధైర్యం ఆమెకే ఉన్నాయి. బహుశా ఆ కారణాలవల్లనే కాబోలు తను రేణుక సమక్షంలో ఓదార్పు పొందుతుంటాడు.

పోతే ఇప్పుడే పరిచయమైన ఈ అమ్మాయి ఆ ఇద్దరికన్నా భిన్నమైన వ్యక్తిత్వం కలది. వాళ్ళిద్దరూ కష్టాలనే అడ్డంకులను అధిగమించి, జీవితంలో ఎదురయ్యే మిట్టపల్లాలను అర్థం చేసుకున్న ప్రశాంత ప్రవాహాలైతే, ఈమె వరదపొంగు. ఎంతటి సమస్యనయినా ఉత్సాహంతో అధిగమించగలననుకునే ఉధృతి, తనకు పూర్తిగా భిన్నమయిన వ్యక్తిత్వం.



అందువల్లే కాబోలు మిగిలిన ఇద్దరి దగ్గరా తను మనసారా నవ్వలేకపోయాడు గానీ ఈమె పరిచయమైన పది నిముషాలలో నే హాయిగా నవ్వేలా చేయగలిగింది. 'ఈమె సమక్షంలో తను ఆహ్లాదాన్ని అనుభవించగ లడు' మనసులోనే అనుకున్నాడు అతడు.

"ఏవయినా కబుర్లు చెప్పండి సార్"

ఆమె ఫాస్ట్‌నెస్‌కి అతడు కొద్దిగా కంగారు పడి "కబుర్లా నేనా?... ఏం చెప్పమంటా రు?" అంటూ ఆమె ముఖంలోకి చూశాడు.

"ఇద్దరు వ్యక్తులు కాసేపు కులాసాగా మాట్లాడేందుకు ఈ లోకంలో ఎన్ని కబుర్లు లేవు సార్. కుష్వంత్‌సింగ్‌గారి జోకులు గు రించి మాట్లాడండి. లేదంటే అమితాబ్ సిని మాల గురించి చెప్పండి. చంద్రబాబునాయు డి పరిపాలన ఎలా ఉందో వివరించండి. కాదూ కూడదంటే రియల్ ఎస్టేట్ బిజినెస్ పరిస్థితి ప్రస్తుతం ఏవిధంగా ఉందో చె ప్పండి"

'గలగలా గోదారి అనే పోలిక ఆ అమ్మాయి విషయంలో చక్కగా సరిపో తుంది' అనిపించింది అతడికి. మనసులోని వత్తిడి మెల్లగా దూరమవుతున్న అనుభూతి.

"నేను మాట్లాడటంకన్నా, మీరు మాట్లా డుతూ ఉంటే వినాలనిపిస్తోంది నాకు" అత డు నవ్వుతూ అన్నాడు.

"అలా అంటారా?" సమన్విత కూడా నవ్వింది. "అయితే నేను విన్న కొన్ని జోకు లు మీకు చెపుతాను. వింటారా?"

"ఓ మెహా! తప్పకుండా" అతడు తలా డించాడు.

సమన్విత ఏదో చెప్పబోతుంటే, వెనుకే రేణుక గొంతు వినిపించింది "ఏంటే సమా! నీ మాటలతో వంశీని భయపెట్టేస్తున్నావా?"

"నేనేం భయపెట్టడంలేదు. హాయిగా నవ్వుకోండి అంటూ జోకులు చెప్పబోతున్నా ను"





"అయితే పర్వాలేదు. జోకులకు ముందు ఈ కాఫీ కాస్త తాగండి. ఆ తర్వాత తమరి సెన్సాఫ్ హ్యూమర్ చూపించండి" రేణుక సమన్వితతో చెప్పాక కాఫీ ట్రే టీపాయ్‌మీద పెట్టింది.

"అలాగే" సమన్విత కాఫీకప్ చేతిలోకి తీసుకుంది.

కాఫీ తాగడం పూర్తయ్యాక సమన్విత జోక్స్ చెప్పడం మొదలుపెట్టింది.

సమన్విత రెండుజోకులు చెప్పాక రేణు కకు ఉత్సాహం వచ్చింది. "ఏయ్! ఆగాగు. నాకో జోక్ గుర్తుకు వచ్చింది" అంటూ తను ఓ జోక్ చెప్పింది.

వాళ్ళిద్దరే జోక్‌లు చెపుతూ ఉంటే మరీ బుద్ధావతారంలా నవ్వుతూ కూర్చోవటం నా మోషీ అనిపించిందేమో వంశీ తనకు తెలి సిన జోక్‌లన్నీ గుర్తుకు తెచ్చుకుని వాటిలో బెస్ట్ అనుకున్నవి ఓ రెండు వినిపించాడు.

మళ్ళీ సమన్విత జోకులు, తిరిగి రేణుక చెప్పింది. తనూ తక్కువ తినకూడదన్నట్టు వంశీ ఆటంబాంబ్‌లాంటి జోక్ పేల్చడం.

జోకులు, నవ్వులు... వీళ్ళ ముగ్గురూ పగలబడి నవ్వుకోవడం చూసిన రఘురామ్ కారు దిగి వారి దగ్గరగా వచ్చి తనూ వాళ్ళలో కలిసిపోయి తనకు గుర్తొచ్చిన మరో రెండు జోకులు చెప్పాడు.

మరో గంటసేపటికి ఆ నలుగురికీ పొట్ట లు పగిలిపోతాయేమోనన్న అనుమానం వచ్చేసింది.

ఇంకో పావుగంట తర్వాత వంశీ నవ్వు కుంటూనే వాళ్లనుండి వీడ్కోలు తీసుకుని కారెక్కాడు.

అతడు కారు కదిలించే ముందు రేణుక చెప్పింది. "సమన్విత మీ ఇల్లు చూడాలను కుంటోంది. రేపు సాయంత్రం ఇంటికొస్తు న్నాం. ఆఫీసునుండి త్వరగా వచ్చేయగల వా?"

"తప్పకుండా వస్తాను. అవసరమను కుంటే ఆఫీసుకు ఫోన్ చెయ్యి. ఇక్కడికే వచ్చి పికప్ చేసుకుని వెళ్తాను"

"అవసరంలేదులే'

అతడు అక్కడివాళ్ళందరికీ "బై" చెప్పి కారు ముందుకు పోనిచ్చాడు.

కారు ముందుకుపోతూ ఉంటే, అతడి ఆలోచనలు మాత్రం సమన్విత దగ్గరే ఆగిపోయి ఆమె చుట్టూనే తిరగసాగాయి. 'ఈమధ్యకాలంలో తనింత హుషారుగా గడిపినరోజు ఇదేనేమో' మనసులోనే అనుకున్నాడు. సమన్వితతో కాసేపు గడిపితే బాధలు, వత్తిడులు మర్చిపోయి సరికొత్త ఉత్సాహం వస్తుంది.

అతడి కారు వీధిమలుపు తిరుగుతుండగా అటు చూశాడు.

సత్యమూర్తి తూలుతూ రోడ్డు అంచునే నడవలేక నడుస్తున్నాడు. అతడి వంటిమీద షర్ట్ కూడా లేదు. బహుశా మితిమీరిన మత్తులో ఎక్కడో విప్పిపారేసి ఉంటాడు.

వంశీకృష్ణ మనసులోకి జాలి ప్రవేశించింది. 'పోనీ కారాపి అతడిని ఎక్కించుకుని ఇంటి దగ్గర దింపేద్దామా' అనుకున్నాడు. కాని అంతలోనే అతడు అంత మత్తులోనయినా తనను గుర్తిస్తే బండబూతులు తిట్టడం ఖచ్చితమని తెలియటంతో ఆ ప్రయత్నం మానుకున్నాడు.

కారు ముందుకు సాగిపోయింది.

★ ★ ★

సమన్విత పార్వతమ్మ, ప్రభాకరరావులకేకాదు గౌతమికి కూడా బాగా నచ్చింది. ఆ ఇంటికి వచ్చిన కొద్దినిముషాలలోనే ఆ ఇంట్లో ఒకరిగా కలిసిపోయిందనే చెప్పాలి.

ఆమె ఆ ఇంటికి వచ్చిన కొద్దిసేపటి తర్వాత గౌతమిని చెకప్ చేసింది. "మీరు బాగా బలహీనంగా ఉన్నారు. శ్రమపడడం తప్పని అననుగానీ, ఆ శ్రమకు తగినవిధంగా ఆహారం తీసుకోవాలి. ఆకుకూరలు, పండ్లు తినడం చెయ్యాలి మీరు"

"అలాగే' తలాడించింది గౌతమి.

ఆ తర్వాత ప్రభాకరరావు, పార్వతమ్మలను పరీక్షించి చూసింది. వాళ్ల ఆరోగ్యానికేవో సలహాలు అందించింది.

సమన్విత, రేణుకలు ఆ రాత్రి అక్కడే భోంచేసి వెళ్ళారు.

వాళ్ళు వెళ్ళిన వెంటనే, ఆ ఇంట్లో నిశ్శబ్దం గాఢంగా పేరుకుని ఏదో తెలియని ఇబ్బంది కలగచేసింది. 'ఆ ఉత్సాహం ఎప్పటికీ తమ ఇంట్లో ఉంటే ఎంత బాగుణ్ణోకదా?' అనిపించింది వాళ్ళందరికీ.

ఆ తర్వాత రెండురోజులకు పార్వతమ్మ చెప్పగా వంశీకృష్ణ రేణుక ఇంటికెళ్ళి సమన్వితను కారులో ఎక్కించుకుని ఇంటికి తీసుకువచ్చాడు.

ఈసారి పార్వతమ్మ సమన్వితను తన దగ్గరే కూర్చోబెట్టుకుని చాలా సేపు మాట్లాడింది. ఆ అమ్మాయి తల్లిదండ్రుల వివరాలు, కుటుంబ పరిస్థితులు అడిగి తెలుసుకుంది.

మరో వారంరోజులకు పురుషోత్తమరావు, రఘురామ్‌లు కలిసి కట్టుకున్న హాస్పిటల్ ప్రారంభమయింది. ఆ ఫంక్షన్‌కి వంశీకృష్ణ వెళ్లాడు.

కొందరు తనను చూసి చాటుమాటుగా గొణుక్కోవడం అర్థమయినా రేణుక, సమన్వితలు తననే అంటిపెట్టుకుని అసలా ఫంక్షన్‌కి తనే చీఫ్‌గెస్ట్ ఏమో అన్నంతగా ప్రవర్తించడం సంతోషాన్నే మిగిల్చింది.

మొత్తంమీద దిగులు స్థానంలో వంశీలో ఏదో తెలియని ఉత్తేజం ప్రవేశించింది.

అతడి జీవితంలో పేరుకుపోతున్న స్తబ్దత పటాపంచలయిపోతోందన్న నిజం ఇప్పుడిప్పుడే అర్థం కాసాగింది.

★ ★ ★

కాలం మరికొంత ముందుకు సాగింది.

గౌతమి మగబిడ్డను ప్రసవించింది. ఆమె ప్రసవ సమయంలో సమన్విత పక్కనే ఉండి డాక్టర్‌గా తన బాధ్యతలు నిర్వర్తించింది.



బిడ్డా, తల్లి క్షేమం తెలిశాకే, పార్వతమ్మ గౌతమి తల్లిదండ్రులకు ఉత్తరం రాసింది. వాళ్లొచ్చి తమ బిడ్డకు పుట్టిన నలుసును చూసుకుని వెళ్లారు.

గౌతమి తల్లి మాత్రం 'కూతుర్ని తమతో పాటు తీసుకెళ్లి కొద్దిరోజులు ఉంచుకుని పంపుతాం' అంటూ అడిగింది. తమ బిడ్డను ఇంటికి తీసుకెళ్ళే హక్కు ఏ తల్లిదండ్రులకయినా ఉంటుంది కాబట్టి పార్వతమ్మ 'అలాగే నన్నట్టు' తలాడించింది. అయితే గౌతమి పుట్టింటికి వెళ్లేందుకు ఒప్పుకోలేదు. తను అక్కడికి వెళితే, సత్యమూర్తి అక్కడికే వచ్చి, బలవంతానయినా తనను ఇంటికి తీసుకెళ్ళిపోతాడేమోనని ఆమె అనుమానం.

వాళ్ళు చేసేదేమీలేక రెండురోజులపాటు హాస్పిటల్‌లోనే ఆమెతో గడిపి ఆ తర్వాత వెళ్ళిపోయారు.

హాస్పిటల్ నుండి ఇంటికిచేరిన నెల తర్వాత బిడ్డను వరాలుకి అప్పగించి కంప్యూటర్ క్లాసెస్‌కి వెళ్ళడం మొదలుపెట్టింది గౌతమి.

క్లాసెస్ నుండి ఇంటికొచ్చాక మాత్రం క్షణమైనా కూర్చునేది కాదు. ఎప్పటిలానే ఇంటిపనులు, పార్వతమ్మ, ప్రభాకరరావుల పనులు చేసేది. ప్రభాకరరావు ఇప్పుడు లేచి తిరగగలుగుతున్నాడు. చెయ్యి మాత్రం ఇంకా బాగుపడలేదు. అయినా ఆయన చాలా వరకూ తన పనులు తానే చేసుకుంటున్నాడు. మొత్తంమీద ఆ ఇంట్లో ఓ రకమైన ఉత్సాహం కదలాడుతోంది.

పైగా పిల్లవాడి ఏడుపు, వాడి పని పార్వతమ్మకు ఉండే నీరసం పోయేలా చేశాయి. ఆవిడ ఎక్కువగా వాడి ఊయల పక్కనే వీల్‌ఛెయిర్‌లో కూర్చుని వాడిని ఆడించుకుంటూ, ముద్దుచేస్తూ మురిసిపోసాగింది.

అప్పటివరకూ తన మనసులో ఉన్న కోరిక మరో రూపంలో తీరుతున్నట్టు ఆమె అనుకోసాగింది.

అయితే ఆ ఇంట్లోని అందరి వ్యక్తుల మనసుల్లో కదలాడుతున్న బాధ ఒక్కటే! తల్లీ, బిడ్డ హాయిగా పెరుగుతారు. ఆ తల్లికి బిడ్డను పోషించుకునేందుకు ఏదో జీవనాధారం కూడా దొరకొచ్చు. కాని... కాని ఆమె ఎంతకాలం ఇలా మోడువారిన జీవితం గడపాలి? గౌతమి జీవితానికి 'వసంతం' లేదా? ఇక రాదా?

ఏం చెయ్యాలి? ఏం చేస్తే గౌతమి జీవితం ఇంతకన్నా సుఖంగా, సంతోషంగా గడుస్తుంది?

ఊహుఁ... ఆ ప్రశ్నలకి జవాబు దొరకడంలేదు.

★ ★ ★

వంశీ ఆఫీసునుండి ఇంటికి బయలుదేరబోతుంటే ఇంటర్‌కమ్‌లో అహల్య చెప్పింది. "సార్! డాక్టర్ సమన్వితగారట. లైన్లో ఉన్నారు. మాట్లాడతారా?"

సమన్విత తనకు ఫోన్ చేయటం ఏమిటబ్బా అనుకుంటూనే "కనెక్షన్ ఇవ్వు'' అన్నాడు అతడు. మరుక్షణమే సమన్విత లైన్‌లో కొచ్చింది.

"హలో సార్! ఏం చేస్తున్నారు?"

"ఇంటికి బయలుదేరబోతున్నాను''

"అయితే పదినిముషాలు ఆగండి. నేను మీ ఆఫీసుకు వస్తున్నాను''

'ఎందుకు?' అన్న ప్రశ్న నోటి చివరివరకూ వచ్చింది. కాని ఆ ప్రశ్నను అతికష్టంమీద నొక్కి "అలాగే" అన్నాడు.

మరో ఐదునిముషాల తర్వాత అహల్య లోపలికొచ్చింది. "సార్! మీరు ఉంటున్నారా?" అడిగింది.

"ఆఁ! ఉంటున్నాను. మీరు వెళ్ళండి'' చెప్పాడు ఆమెతో.

అహల్య తలాడించి, "గుడ్‌నైట్ సర్" అంటూ అవతలికెళ్ళిపోయింది.

వంశీ కుర్చీలో రిలాక్సింగ్‌గా వెనక్కువాలాడు. అహల్య మునుపటిలా తనతో అసహ్యం కలిగించేలా ప్రవర్తించటంలేదు. తన పట్ల చనువు ప్రదర్శించకుండా, గౌరవం





చూపిస్తోంది. ఏ మనిషి ప్రవర్తనయినా హుందాగా ఉంటే ఎదుటివాళ్ళు గౌరవం ఇస్తారేమో!

అంతలోనే అతడికి సమన్విత ఫోన్ గుర్తుకు వచ్చింది. 'సమన్విత తన ఆఫీసుకి ఎందుకు వస్తున్నట్టు?' మనసులో ప్రశ్న ఉదయించింది.

అతడా ప్రశ్నకు జవాబు ఆలోచిస్తూ ఉండగానే, తియ్యని కంఠం వినిపించింది "మే ఐ కమిన్"

వంశీ తలెత్తి అటు చూశాడు. సమన్విత డోర్ తెరచి తల మాత్రమే లోపల పెట్టి నవ్వుతోంది. ఆమె నవ్వు చూస్తుంటే అతడికి కలిగే భావం ఒక్కటే- ఈమెకి ఏ బాధలూ, సమస్యలూ లేవా?

"కమిన్... కమిన్"

సమన్విత లోపలికి అడుగుపెట్టింది.

"కూర్చోండి"

ఆమె అతడు చూపించిన కుర్చీలో కూర్చున్నాక, ఛాంబర్ లోపల పరిశీలనగా చూసింది. కొద్దిక్షణాల తర్వాత "మంచి టేస్ట్" మెచ్చుకోలుగా అతడిని చూస్తూ అంది.

అతడు నవ్వాడు. ఆఫీస్‌బాయ్‌ని పిలిచాక ఆమెవైపు చూసి "చెప్పండి ఏం తీసుకుంటారు? కాఫీ ఆర్ కూల్‌డ్రింక్?"

"కాఫీ" వెంటనే అందామె.

ఆఫీస్‌బాయ్ అవతలికి వెళ్ళిపోయాడు.

"చెప్పండి" అతడు టేబుల్‌మీద చేతులు ఉంచి ముందుకు వంగాడు.

"రేపు నా బర్త్‌డే" ఆమె తలొంచుకుని చెప్పింది.

"వాట్? బర్త్‌డే... వెరీగుడ్! సో! అడ్వాన్స్ విషెస్... వెరీ వెరీ హేపీ బర్త్‌డే టూ యూ"

ఆమె తల పైకెత్తింది. "ఇప్పుడే చెప్పేసి రేపు రాకపోతే వప్పుకునేది లేదు. ఎవ్వర్నీ పిలవడంలేదు. మీరూ, గౌతమి, అక్కయ్య బావగారు- అంతే. సింపుల్ పార్టీ. ఆ తర్వాత అందరం 'కలిసి సినిమాకి"

"సినిమాకా?" ఎప్పుడో కాలేజీలో చదువుకునేటప్పుడు సినిమాలకు వెళ్లేవాడేగానీ, బిజినెస్‌లోకి ఎంటరయ్యాక అతడు సినిమాలకు, షికార్లకు దూరంగా ఉంటున్నాడు. అందుకే అలా ఇబ్బందిపడుతూ అన్నాడు.

"మీ గురించి అక్కయ్య చెప్పిందిలెండి. మీరీ మధ్యకాలంలో సినిమాలు చూడటం అసలు మానేశారట. నిజం చెప్పాలంటే మీ కోసమే నేను సినిమా ప్రోగ్రాం ఫిక్స్ చేశాను. ఎందుకంటే కొన్నిరకాల ఆనందాలను అప్పుడప్పుడూ అనుభవిస్తూ ఉండాలి సార్! అప్పుడే మనిషి జీవితంలో ఉత్సాహం చోటు చేసుకుని, లైఫ్‌పట్ల బోర్ దూరమవుతుంది"

అతడు చిన్నగా నవ్వి "సరే. అలాగే చేద్దాం. రేపంతా మీరెలా చెపితే అలా నడుచుకుంటాం" అన్నాడు వినయాన్ని ప్రదర్శిస్తూ.

సమన్విత కూడా నవ్వింది.

అంతలో ఆఫీస్‌బాయ్ రెండు కప్పులతో కాఫీ తీసుకొచ్చి టేబుల్‌మీద పెట్టి వెళ్ళిపోయాడు.

"తీసుకోండి" తనో కప్ అందుకుంటూ ఆమెతో చెప్పాడు అతడు.

సమన్విత కాఫీ తాగుతూ అతడి బిజినెస్ గురించి ప్రశ్నలు వేయసాగింది. అతడు సమాధానాలు చెప్పసాగాడు.

కాఫీ తాగడం పూర్తయ్యాక "వెళ్దామా" అన్నాడు వంశీ.

"పదండి" ఆమె లేచింది.

ఇద్దరూ ఆఫీసులోనుండి బయటకొచ్చారు. మెట్లు దిగి కిందికొచ్చాక అతడు ఆమెవైపు తిరిగి అడిగాడు "మీరెలా వచ్చారు?"

"ఆటోలో"

"అయితే రండి. మిమ్మల్ని ఇంటి దగ్గర డ్రాప్ చేసి వెళ్తాను" అతడు పార్కింగ్‌ప్లేస్ వైపు నడుస్తుంటే ఆమె అనుసరించింది.

అతడు డోర్ లాక్ తీసి "కూర్చోండి"



అంటూ లాగాడు. ఆమె కారులో కూర్చుంది. అతడు చుట్టు తిరిగి వెళ్ళి డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాడు. కారు కదిలింది.

ఎందుకో తెలియకనే ఆ క్షణం వంశీకృష్ణ మనసులో ఓ ఆహ్లాదకరమైన భావం కదలాడింది. ఆమెతో కలసి సాగుతున్న ప్రయాణం సరికొత్త అనుభూతిలా మనసులో మిగిలిపోతుందేమో అనిపించింది.

అతడు అలా ఏదో ఆలోచించుకుంటూ డ్రైవింగ్ చేస్తున్నట్టు అనిపించడంతో ఆమె అతడి భుజంమీద తట్టి చెప్పింది. "సార్! పెళ్ళి కావలసిన అమ్మాయిని పక్కన ఉన్నాను''

"అయితే?"

"కాస్త కాన్‌సన్‌ట్రేషన్‌తో డ్రైవింగ్ చేయండి సార్! నాకేదయినా జరిగితే, 'అమ్మాయి అందంగా ఉందిగానీ, కాలు, చెయ్యి లేకపోతే కష్టంకదా?' అంటారు రేపు పెళ్ళిచూపులకు వచ్చినవాళ్ళు''

అతడు నవ్వకుండా ఉండలేకపోయాడు.

"అంతేకాదండోయ్. ఇంత కష్టపడి చదివిన డాక్టర్ కోర్స్ కూడా వృధా అయిపోతుంది. ఒక్కచేత్తో ఆపరేషన్ చేయలేంకదా?"

"మీకా భయం అక్కర్లేదు. మిమ్మల్ని క్షేమంగా ఇంటి దగ్గర దించే బాధ్యత నాది'' అతడు చిరునవ్వుతో చెప్పాడు.

"మీ డ్రైవింగ్ మీద నాకా నమ్మకం ఉంది. కానీ మీ పరధ్యాసను చూస్తేనే నాకు భయమేస్తోంది''

"అయితే మిమ్మల్ని భయపెట్టనులెండి. ఏకాగ్రతగా డ్రైవ్ చేస్తాను''

వంశీకృష్ణ రోడ్డుమీదనే చూపు నిలిపాడు. ముఖ్యంగా సాయం సమయంలో హైదరాబాద్ మహానగరంలో రోడ్లన్నీ మహారద్దీగా ఉంటున్నాయి. ఒక్కో ట్రాఫిక్ సిగ్నల్ దగ్గర రెండుసార్లు గ్రీన్‌సిగ్నల్ వచ్చినా క్రాసింగ్ దాటడం కష్టమయిపోతోంది. రోజురోజుకీ పట్టణాలనుండీ, పల్లెలనుండి వలస వచ్చే జనాలతో మహానగరం మరీ ఇరుకయిపోయిన భావన కలుగుతోంది.

"హలోసార్! నేను పరధ్యాస వద్దన్నాను గానీ మరీ ఇంత ఏకాగ్రత చూపమని మాత్రం చెప్పలేదు''

సమన్విత మాటలకు అతడు ఆలోచనలు కట్టిపెట్టి నవ్వుతూ ఆమెకేసి చూశాడు. జవాబుగా మరేం మాట్లాడలేదు.

ఆమె అంది "మీరు మాట్లాడుతూనే ఉన్నట్టుండి ఆలోచనల్లోకి జారిపోతుంటారు. ఏదయినా ఓ సమస్య గురించి అన్ని కోణాల నుంచి ఆలోచించే వ్యక్తులే ఇలా అప్పుడప్పుడూ పరధ్యాస ప్రదర్శిస్తుంటారని నేను విన్నాను. మీలో ఆ లక్షణం చూశాకే నాకు మీరు బాగా నచ్చారు''

అతడు ఉలిక్కిపడ్డాడు. 'నచ్చడం'... కాసింత అయోమయంగానే అతడు ఆమె ముఖంలోకి పరిశీలనగా చూశాడు.

తను చప్పున మాట జారానన్న విషయం ఆమెకూ అర్థమయింది. కాని తననుతాను కాపాడుకునే ఆలోచనతో కాబోలు అంది. "ఐ మీన్! మీలో కనిపించే ఆ మేధావుల లక్షణం అంటే నాకు ఇష్టం ఏర్పడింది. ఐ లైక్ ఇట్''

వంశీ నిట్టూర్చాడు. పెరిగిన గుండెవేగం కొంత తగ్గింది. మరో ఐదు నిముషాల తర్వాత కారు రేణుక ఇంటిముందు ఆగింది. సమన్విత కారు దిగాక అతడితో "రండి! కాసేపు కూర్చుని వెళ్లొచ్చు'' అంది.

అంతకుముందులా హడావుడిగా ఇంటికి వెళ్లాల్సిన అవసరం లేకపోవడంతో వంశీకృష్ణ కారు దిగి ఆమె వెంట ఇంట్లోకి నడిచాడు.

అతడిని చూసి రేణుక "ఎలాగయితేనేం నా చెల్లి నిన్ను ఇక్కడివరకూ వచ్చేలా చేసిందన్నమాట" అంది నవ్వుతూ.

"ఏంకాదు! ఆమెను ఇక్కడ డ్రాప్ చేశాను కాబట్టి, నిన్నూ పలకరించి వెళ్లొచ్చని లోపలికి వచ్చాను'' చెప్పాడు అతడు.

"సరే! ఎలాగోలా వచ్చావ్. కూర్చుని




కాఫీ తాగి వెళ్లు''

"విత్ ప్లెజర్' అని హాలులోని సోఫాలో కూర్చున్నాడు వంశీ.

రేణుక కాఫీ కలుపుకొచ్చేందుకు కిచెన్‌లో కెళ్లింది. సమన్విత అతడికి ఎదురుగా మరో సోఫాలో కూర్చుంది.

అయితే రేణుక కాఫీ పట్టుకొచ్చేవరకూ వాళ్లిద్దరూ మాట్లాడుకోలేదు.

ఆమె వచ్చి వాళ్లిద్దరికీ కాఫీ కప్పులు అందించి ఎదురుగా కూర్చుని యధాలాపంగా అడిగింది. "చెప్పు వంశీ ఏమిటి విశేషాలు."

"ఏమున్నాయి రొటీన్. ఆఫీసుకెళ్లడం, రావడం, తినడం, పడుకోవడం. అదే డైలీ టైంటేబుల్. నో ఛేంజ్' నవ్వాడు అతడు అదోలా.

"నేనో మాట చెప్పనా?"

"చెప్పు రేణూ''

"జీవితంలో మార్పు రావాలంటే పెళ్లి చేసుకోవాలి వంశీ''

అతడు కంగారుపడి రేణుక ముఖంలోకి చూశాడు. ఆమె చాలా రిలాక్స్‌డ్‌గా ఉంది. అంటే ఆ మాట యథాలాపంగా అనలేదని అర్థమవుతూనే ఉంది. గత కొద్ది రోజులుగా ఆలోచించుకున్నాక అలా అందేమో.

చాలాకాలం తర్వాత తామిద్దరిమధ్యా పెళ్లిగురించి ప్రస్తావన వచ్చింది. ఈమధ్యకాలంలో గౌతమి గురించిన ఆలోచన, ఆందోళన కారణంగా తను అసలు పెళ్లి గురించే ఆలోచించలేదు. కనిపించినప్పుడల్లా ఆ విషయమే ప్రస్తావించి వత్తిడి చేసే రేణుక కూడా ఈమధ్య ఆ పదం మర్చిపోయినట్టుగానే ఉండిపోయింది. మరిప్పుడు...

వంశీకృష్ణ నవ్వాడు. తల దించుకుని అరచేతులకేసి చూసుకోసాగాడు.

"ఇదిగో.. మళ్లీ మొదటికొస్తున్నావ్. మునుపటిలానే ఓ నవ్వు నవ్వి నన్ను మభ్యపెట్టి మాట దాటించే ప్రయత్నం చేస్తున్నట్టుంది''

"లేదు. అలాంటి ప్రయత్నంకాదిది''

సమన్విత వాళ్లిద్దరికేసి చూపులు మరల్చుతూ చూస్తోంది.

"మరేంటిది. ఒకప్పుడంటే 'నేను పెళ్లి చేసుకుంటే నా ఇంటికొచ్చే ఆడది తన కలలన్నీ దూరం చేసుకోవలసి వస్తుంది. ఆమె ఉదయం లేచి మా అమ్మానాన్నల పని చేస్తూ స్త్రీ సహజ సిద్ధమయిన కోరికలను బలిపెట్టుకోవడం తప్పదు. ఓ స్త్రీ కలలు కల్లలు కావడం నాకిష్టంలేదు...' అంటూ పెళ్లి వద్దన్నావ్. కాని ఇప్పుడు నీకా సమస్యలేదు. అంకుల్ లేచి తిరుగుతున్నారు. ఆయన తన పనులుతాను చేసుకోవడమేకాదు ఆంటీకి కూడా సహాయపడుతున్నారు. అంతేకాదు వాళ్లిద్దరికీ ఏదయినా అవసరం అనుకుంటే గౌతమి దగ్గరుంది. ఇక ఇప్పుడు నీ పెళ్లికి సమస్య ఏముంది? ఇప్పుడు నువ్వు పెళ్లి చేసుకుంటే ఓ స్త్రీ కోరికలు, కలలు కల్లలవ్వవుకదా?"

రేణుక సీరియస్‌గా మాట్లాడడం పూర్తిచేశాక వంశీ పెదాలమీద కదలాడే చిరునవ్వు తొలగిపోనివ్వకుండానే చెప్పాడు. "ఓ సమస్య పరిష్కారమయింది. కాని మరో సమస్య మొదలయింది రేణూ''

ఆమె విస్మయంగా అతడి ముఖంలోకి చూసింది. "మరో సమస్యా ఏమిటది?" ప్రశ్నించింది.

అతడు ఇబ్బందిపడ్డాడు "అది అది'' అంటూ నసిగాడు.

"చెప్పు వంశీ మళ్లీ ఏం సమస్య వచ్చింది నీకు?"

వంశీ కొద్దిక్షణాలు తర్వాత దీర్ఘంగా నిట్టూర్చాడు. మనసులోని అనుమానమో లేదా నమ్మకమో మనసులోనే దాచుకోవలసిన అవసరం ఏముంది? అదేదో రేణుకకు చెపితే తప్పేంటి? ఆమె కూడా ఆలోచిస్తుంది. మానవ సహజ గుణాల గురించి మరోసారి

ఆలోచిస్తుంది.

అందుకే అతడు పెదవి విప్పాడు "రేణూ నువ్వు నన్ను పెళ్లి చేసుకోమంటున్నావ్ గానీ ఒక్కటి ఆలోచించు. నాకిప్పుడు అమ్మాయి నిచ్చేందుకు ఏ ఆడపిల్ల తల్లిదండ్రులయినా ముందుకొస్తారా?"

వంశీ ప్రశ్న ఏమిటో ఆమెకు మొదట అర్థంకాలేదు. అర్థమయ్యాక కాస్త అనుమానిస్తూ ఎదురు ప్రశ్న వేసింది. "ఆడపిల్లల తల్లిదండ్రులు నిన్ను అల్లుడుగా చేసుకునేందుకు ఆనందిస్తారే తప్ప వెనుకడుగెందుకు వేస్తారనుకుంటున్నావ్?"

వెంటనే చెప్పాడు అతడు 'గౌతమి కారణంగా'.

రేణుక సోఫాలో వెనక్కివాలింది. ఆ గదిలో హఠాత్తుగా నిశ్శబ్దం పేరుకుంది. అప్పటివరకూ ఆమె ముందు పేరుకున్న కొన్ని పొరలు క్రమంగా తొలగిపోయి ఓ నిజం సాక్షాత్కరిస్తున్నట్టనిపించింది.

నిజమే! వంశీకృష్ణ మాటలలో ఎంతో సత్యం ఉంది. అవునూ! ఇంట్లో ఓ పెళ్లయి బిడ్డ ఉన్న ఆడదాన్ని ఉంచుకున్న మగాడికి తమ కూతుర్ని ఇచ్చేందుకు ఏ ఆడపిల్ల తల్లితండ్రులు మాత్రం ఇష్టపడతారు. ఒకప్పుడు వంశీకృష్ణను తమ అల్లుడిగా చేసుకోవాలని ఆరాటపడినవాళ్లంతా అతడు గౌతమికి ఆశ్రయం ఇచ్చాడని తెలుసుకున్నాక కామెంట్స్ విసరడం తను విన్నది. ఒక స్త్రీకి విధిలేని పరిస్థితుల్లో కేవలం మానవతా దృక్పథంతో అతడు తన ఇంట్లో ఆశ్రయం ఇచ్చాడని ఈ జనం నమ్మరు కాక నమ్మరు. మానవత్వంతో నీడనిచ్చిన అతడు సంఘం దృష్టిలో తప్పుచేసిన వ్యక్తి! అలాంటి తప్పు చేసిన వ్యక్తిని తమ అల్లుడిగా చేసుకునేందుకు చాలామంది ఇష్టపడరు. ఒకరూ అరా ఇష్టపడినా ఆ ఇంట్లోనుండి గౌతమి వెళ్లిపోవాలనే కండీషన్ పెట్టి తీరతారు. అలా కండీషన్ పెట్టకుండా ఉండాలంటే కన్నబిడ్డకు పెళ్లి చేయలేని నిరుపేద తండ్రి దొరకాలి. ఆయన తన కూతురు మెడలో మూడు ముళ్లు పడిపోయి గుండెలమీద కుంపటి తొలగిపోతే చాలు అనుకునే స్థితిలో ఉండాలి. అప్పుడు ఆ ఇంట్లో భార్య హోదాలో కాకపోయినా కనీసం పనిమనిషిగానయినా పడి ఉంటుందికదా అని గుండెదిటవు పరచుకోగలగాలి. ఈ సంఘం ఎంత చిత్రమయింది. మనిషి చేసిన గొప్ప పనికి కూడా భూతద్దంలోంచి చూసి కేవలం అపోహలో అతడి జీవితాన్నే నాశనం చేస్తుంది. అలాంటి ఆలోచనల మధ్య కూడా ఆమెకు నవ్వొచ్చింది. ఆమె నవ్వింది.

రేణుక నవ్వు చూసి వంశీ కూడా నవ్వాడు. "బహుశా పరిస్థితి గురించి ఆలోచించి అర్థం చేసుకున్నావనుకుంటానూ?"

ఆమె నిలువుగా తలాడించింది.

"అదీ పరిస్థితి. దేవుడు ముందుగానే మన నుదుట రాత రాసి ఉంచుతాడు అన్నమాట నిజమయితే ఏదో కారణంవలన నాకు పెళ్లి జరిగే పరిస్థితి తారుమారు అవుతూ వస్తోంది. దానర్థం నాకు వివాహయోగం లేదనేకదా?"

రేణుక అతడికేసి జాలిగా చూసింది.

ఇక అక్కడ ఉండడం ఇబ్బంది అనిపించిందేమో అతడు లేస్తూ "రేణూ! నేనిక బయల్దేరుతాను" చెప్పాడు.

చాలాసేపటినుండి తదేకంగా అతడి ముఖంలోని భావాలనే చూస్తున్న సమన్విత తనూ లేస్తూ "అయితే రేపు మీరూ, గౌతమిగారు ఇక్కడికి రాబోతున్నారు. రేపు ఎలాగూ ఆదివారమే కాబట్టి మనం కాస్త ఎంజాయ్ చేద్దాం" చెప్పింది.

అతడు తలాడించాడు.

వాళ్లిద్దరూ పోర్టికోవరకూ వెళ్లి అతడు కారెక్కి రోడ్డు మలుపు తిరిగేవరకూ నిలబడ్డారు.

ఇంట్లోకి వచ్చాక రేణుక చాలా నీరసంగా





సోఫాలో కూలబడి ఏదో దీర్ఘాలోచనలో ముని గిపోవడం గమనించి, సమన్విత ఆమె పక్క నే కూర్చుని భుజం మీద చెయ్యేసి అడి గింది. "అక్కా! ఏంటాలోచిస్తున్నావ్?"

"వంశీ గురించి సమా?"

ఆ విషయం సమన్వితకూ అర్థమ యింది. కాని ఏమాలోచిస్తోందో అర్థం కావ డంలేదు. అదే అడిగింది. "ఏమాలోచిస్తున్నా వక్కా?"

"పాపం వంశీ! ఓ మంచిపని చేశాడు. కాని ఆ మంచిపని సంఘం దృష్టిలో చెడ్డది గా మారింది. సంఘం దృష్టిలో చెడ్డ ముద్రప డిన వ్యక్తి జీవితం కష్టాల పాలవుతుందని ఇప్పుడిప్పుడే అతడికి అర్థమవుతోంది. నిర్మ లమైన అతడి మనసులోతుల్లోకి తొంగి చూ సే తీరిక, ఓపిక ఈ జనానికి లేవు. కాని అతణ్ణి ఓ ఆడదాన్ని ఉంచుకున్న మగాడిగా ముద్రవేసేసింది. అంత కోటీశ్వరుడికి కూడా అమ్మాయినిచ్చే విశాలహృదయం ఉన్న తల్లిదండ్రులే కరువయ్యారు''

"అంటే వంశీకి అమ్మాయినిచ్చేందుకు ఆడపిల్లల తల్లిదండ్రులు భయపడుతున్నా రంటావా?" సమన్విత అడిగింది.

"అంతేగా మరి! ఉదాహరణకి నిన్ను వంశీకిచ్చి పెళ్లి చేయాలని మీ మమ్మీడాడీలు అనుకున్నారనుకో అప్పుడు అతడి గురించి తెలిసీతెలియని జనం ఏం చెపుతారో తె లుసా? అయ్యో బంగారంలాంటి మీ అమ్మా యిని ఆ దుర్మార్గుడికి ఇచ్చి ఎందుకు గొంతు కోస్తారండీ బాబూ! అతడు ఇప్పటికే పక్కింటి ఆడదాన్ని తెచ్చి ఇంట్లోనే ఉంచుకు న్నాడు. వాళ్లిద్దరికీ ఓ బాబు కూడా పుట్టాడు. వాళ్లిద్దరికీ పెళ్లికాలేదనేగానీ ఆవిడే ఆ ఇంటికి పెద్ద కోడలు. అలాంటి ఇంట్లోకి మీ అమ్మాయి వెళ్తే సవతిపోరు భరించాల్సి రావడమేకాదు ఆ తర్వాత మీ అమ్మాయి కడుపున పుట్టే బిడ్డల పరిస్థితి కూడా ఏమిటో చెప్పలేం. ఆలోచించుకోండి ఇలాంటి మాట లు విన్నాక ఏ తండ్రి కూడా నిజానిజాలు తెలుసుకుని ముందుకు అడుగువేస్తాడని నే ను అనుకోను''

సమన్విత కొన్ని సెకనులు తటపటా యించాక అడిగింది. "పోనీ వంశీ గౌతమినే పెళ్లి చేసుకునే ప్రయత్నం చేయొచ్చుకదా? ఐమీన్ ఆమెకు భర్తనుండి విడాకులు ఇప్పించి''

రేణుక సమన్విత కళ్లలోకి సూటిగా చూ సింది. ఆ చూపులను ఎదుర్కొనే శక్తి లేనట్టు తలదించేసింది సమన్విత. తను తప్పుగా మాట్లాడేనేమోననిపించింది. అందుకే అంది "నిజమేలే అక్కా! పెళ్లయిన ఆడదాన్ని పెళ్లి చేసుకోవడం అంటే ఏ మగాడయినా కాస్త ఇబ్బంది ఫీలవుతాడు. అందులోనూ ఆమె తొలి భర్త ద్వారా బిడ్డనూ కలిగి ఉంది. ఏ మగాడయినా తన జీవితంలోకి కన్నెపిల్ల రావాలని కోరుకుంటాడుగానీ..."

ఇక వినే ఓపికలేనట్టు "వంశీ గురించి చాలా తక్కువే తెలుసు నీకు సమా! అతడి మనసు గురించి పూర్తిగా తెలిసి ఉంటే నువ్విలా మాట్లాడవు'' సమన్విత మాటలు మధ్యలోనే కట్ చేస్తూ అంది రేణుక.

సమన్విత తలెత్తి రేణుకకేసి చూసింది.

రేణుక కంటిన్యూ చేసింది. "వంశీ నువ్వు ఊహించుకునే స్థాయి వ్యక్తిత్వం ఉన్నవాడు కాదు సమా! నీకు తెలుసో లేదో నేను, వంశీ మూడేళ్లపాటు కాలేజీలో కలసి చదువుకు న్నాం. పదేళ్లుగా స్నేహంగా మసలుకుంటు న్నాం. ఆడమగా స్నేహాన్ని రకరకాల కోణా ల్లోంచి చూసి ఏదో ఊహించుకుని తృప్తిప డడం ఈ సంఘానికి అలవాటు. కాని వంశీకి అలాంటి ఆలోచనల గురించే తెలియదు. తనకు క్లోజ్‌గా ఉండే ఓ మగ స్నేహితుడితో ఎలా ప్రవర్తిస్తాడో నాతోనూ అలాగే మసలు కుంటాడు. చివరికి స్నేహాన్ని దుర్విని యోగం చేయడం కూడా అతడికి చేతకాదు. అలాంటి వంశీ మనసులోతుల్లోకి వెళ్లి తొంగి చూసిన నాకు అర్థమయిందేమిటంటే అతడి

కి గౌతమి పట్ల ఎలాంటి కోరికా లేదు. ఆమె ఓ అందమైన స్త్రీ. గొప్ప ఆకర్షణ ఉన్న సౌందర్యం ఆమె సొంతం. అయితే వంశీ, పరాయి ఇంటికెళ్లినప్పుడు అక్కడి ఓ చెట్టుకు వేలాడుతున్న అందమైన పుష్పాన్ని ప్రకృతి ప్రేమికులు తనువు మరచి చూసినట్టు ఆమెను చూశాడేగానీ, ఆ పుష్పాన్ని సొంతం చేసుకోవాలనే కోరిక మాత్రం అతడికి లేదు. కాని ఆ పుష్పం సొంతదారుడు మూర్ఖంగా ఆ పుష్పాన్ని నలిపేయబోతుంటే ఓ అందమైన పువ్వు నాశనం కావడం ఇష్టంలేక ఆ సొంతదారుని ఎదిరించి ఆ పువ్వును తెచ్చి తన ఇంట్లోపెట్టుకున్నాడు. అంతే! అంతే తప్ప వంశీకి గౌతమి మీద కోరికా వ్యామోహంలాంటివి లేవు. నువ్వు నమ్మినా నమ్మకపోయినా ఇది నిజం సమా!"

సమన్వితకు చాలామంది మగాళ్లు గుర్తుకు వచ్చారు. ఆడదాని పరిచయం అంటే సుఖం కోసం తాపత్రయపడడమే అనేలా వాళ్లు ప్రవర్తించేవాళ్లు. మరి ఈ ప్రపంచంలో ఆడదాన్ని కోరికా వ్యామోహాలు లేకుండా దగ్గరకు తీసే మగాళ్లు ఉన్నారా? ఉన్నారని చెపితే ఈ సంఘం నమ్మదుగాక నమ్మదు.

అప్పుడే తన మనసులో ఉదయించిన మరో ప్రశ్నను అక్కయ్య ముందు ఉంచింది సమన్విత. "వంశీగారికి గౌతమి మీద అలాంటి అభిప్రాయం లేకపోయి ఉండొచ్చు. కాని ఆమె భవిష్యత్ దృష్ట్యా అయినా మరింత పెద్దమనసుతో ఆ మూడుముళ్లు వేసి సొంతం చేసుకోవచ్చుకదా?"

"అలా చేస్తే జనం ఏదయితే ఊహించారో ఆ ఊహను నిజం చేసినట్టు అవుతుంది. ఈ విషయం మేము ఎప్పుడో ఊహించాం అన్న కామెంట్స్ మొదలవుతాయి. అయినా వంశీ జనం గురించి భయపడడు. అతడి ఆలోచన ఆమెకు సహాయం చేయడం గురించే తప్ప ఆమెను సొంతం చేసుకోవడం మీదలేదు. అలా చేయడానికి అతడు ఎట్టి పరిస్థితుల్లోనూ ఒప్పుకోడు''

ఇంతవరకూ తనకు ఎన్నడూ ఎదురుకాని ఓ మహోన్నత వ్యక్తిత్వం ఎదురయిన నిముషాలలో సమన్విత మనసు అదోరకమైన అనుభూతికి లోనయింది. కొద్ది నిముషాల్కితం తన పక్కనే కూర్చున్న వంశీ రూపం వేల రూపాలుగా మారి ఎటుచూసినా అతడే కనిపిస్తున్న అనుభూతి కలిగింది.

ఆ రాత్రి సమన్వితకు నిద్రపట్టలేదు. ఏవో ఆలోచనలు, తర్జనభర్జనలు, అనుమానం, ఆశావాదం.

చివరికి రాత్రి పన్నెండు దాటాక పుట్టినరోజు నాడు ఆమె ఓ నిర్ణయం తీసుకుంది. ఆ తర్వాతే ఆమెకు నిద్రపట్టింది.

అప్పుడే కలలు మొదలయ్యాయి. కలల ప్రపంచంలో విహరిస్తూ సరికొత్త అనుభూతులను అనుభవంలోకి తెచ్చుకుంది సమన్విత.



ఉదయమే తలంటుస్నానం చేసి కొత్త బట్టలు కట్టుకుంది సమన్విత. దేవుడి పూజ తర్వాత అక్కాబావల ఆశీర్వాదాలు అందుకుంది.

మరో అర్ధగంట తర్వాత వంశీకృష్ణ, గౌతమిలు కారులోనుండి దిగారు.

వంశీకృష్ణ "హేపీ బర్త్‌డే టూ యూ'' అంటూ చేతిలోని బొకే, మరేదో గిఫ్ట్‌ప్యాకెట్ అందజేశారు.

గౌతమి సమన్విత చేతిని తన చేతిలోకి తీసుకుని "జన్మదిన శుభాకాంక్షలు'' అంటూ ఆప్యాయంగా ఆమె చేతిని నొక్కి వదిలింది.

"థాంక్యూ'' సమన్విత పలికింది.

రేణుక అప్పటికే స్వీట్ తయారుచేసి ఉండడంతో ఆ గిన్నె తీసుకొచ్చి టీపాయ్ మీద ఉంచింది. అక్కడున్న వాళ్లందరూ స్పూన్‌తో తలా కాసింత స్వీట్ ఆమె నోటికి అందించారు.

ఆ తర్వాత సమన్విత స్వయంగా గిన్నెలోని స్వీట్ కప్పుల్లో సర్ది అక్కడున్న వా





ళ్లందరికీ అందించింది.

స్వీట్ తినడం ముగిశాక అందరూ వెళ్లి డైనింగ్‌టేబుల్ ముందు కూర్చున్నారు. సమన్వితే అందరికీ ప్లేట్స్‌లో టిఫిన్ పెడుతుంటే రఘురామ్‌గారు నవ్వుతూ అన్నారు. "అదేంటి? బర్త్‌డే బేబీకి అందరూ పనులు చేసిపెట్టాల్సింది, తనే అందరి పనులూ చేస్తోందే?"

"దటీజ్ సమన్విత బర్త్‌డే స్పెషల్' అంటూ భుజాలెగరేసింది సమన్విత.

ఎప్పటిలానే సమన్విత జోక్‌లు చెపుతుంటే అందరూ నవ్వుతూ టిఫిన్ చేయసాగారు.

అయితే వంశీకృష్ణ నవ్వుతూనే అప్పుడప్పుడూ ఆమెకేసి ఓరగా చూడసాగాడు. ఎందుకనో తెలియదుగానీ ఆ రోజు సమన్విత మరీ అందంగా ఉన్నట్టుగా కనిపిస్తోంది. ఆమెకేసి మరీమరీ చూడాలని మనసు కోరుకుంటోంది. తనలో ఎన్నడూ ఎవరిని చూసినా కలగని భావం ఆమెను చూస్తే ఎందుకు కలుగుతోందో అతడికే అర్థం కావటంలేదు. అయితే తనకు పూర్తిగా భిన్నంగా ఉండే ఆమె స్వభావం భిన్నధృవాలు ఆకర్షించుకుంటాయి అన్న సామాన్య సూత్రాన్ని నిజం చేస్తూ మనసును కదిలిస్తోందని తెలుస్తోంది.

అంతేకాదు తనకు గౌతమి పట్ల ఉండే భావాన్ని సమన్వితను చూడడంతో కలిగే అలజడిని బేరీజు వేసుకుని చూసుకుంటున్నాడు. గౌతమి పట్ల కలిగిన భావం జాలి, అభిమానం, గౌరవంకాగా, సమన్విత పట్ల ఉన్న భావం ఊహూఁ ఇంకా ఏదో ఖచ్చితంగా అర్థం కావడంలేదు. బహుశా మనసు లోతుల్లోకి వెళ్లి చూసుకుంటే తెలిసిపోతుందేమో. కాని అలా మనసులోతుల్లోకి వెళ్లి చూసుకునే ధైర్యం మాత్రం అతడు చేయలేకపోతున్నాడు.

ఆ భావం అర్థమయితే మనసు మరింత బాధపడుతుందేమోనన్న అనుమానం. ఆ తర్వాత ఎదురయ్యే పరిణామాలను ఎదుర్కొని తను తట్టుకోలేడు.

సమన్విత కూడా అప్పుడప్పుడు వంశీకేసి నవ్వుతూ చూస్తోంది. ఆమె చూపుల్లో కదలాడే భావం అతడికి అర్థం కాకపోవచ్చుగానీ, అక్కడున్న మరో వ్యక్తి గమనించింది.

ఆమె గౌతమి.

సమన్విత చూపులు, చేష్టలు గమనించిన గౌతమి మనసులోనే నవ్వుకుంది. చాలాకాలంగా తన మనసులో కదలాడుతూ పరిష్కారం దొరకని ఓ సమస్యకు నేడు పరిష్కారం దొరికినట్టుగా సంతోషపడింది.

టిఫిన్ తినడం పూర్తయ్యాక అందరూ హాలులో కూర్చున్నపుడు రఘురామ్ సమన్వితతో చెప్పాడు. "సారీ సమా! నేను అర్జంట్‌గా ఓ ఆపరేషన్‌కి హాజరుకావలసి ఉంది. కాబట్టి ఈ రోజు ఎక్కువసేపు నీతో గడపలేకపోతున్నందుకు ఏమీ అనుకోవద్దు''

ఒక డాక్టర్‌గా ఆయన ప్రాబ్లమ్ అర్థం చేసుకున్నట్టు "ఫర్వాలేదులెండి'' చెప్పింది సమన్విత.

రఘురామ్ కారు తీసుకుని వెళ్లిపోయాడు.

ఆయన వెళ్లిపోయాక సమన్విత అందరికేసి చూస్తూ ప్రశ్నించింది. "చెప్పండి. మనం ఇప్పుడు ఏం చేద్దాం?"

"ఏముంది. గౌతమి మనింటికి మొదటిసారి వచ్చింది. ఆమెకు సాయంత్రం పసుపు కుంకుమ పెట్టి పంపాలి. ఇంట్లో కొత్తచీర, జాకెట్ లేవు కాబట్టి నేను తనను తీసుకుని షాపింగ్‌కి వెళ్తాను. ఓగంటలో వచ్చాక లంచ్ రెడీ చేస్తాను. లంచ్ చేశాక నీ ప్రోగ్రాం ప్రకారం సినిమాకెళ్దాం"

"అలాగే'' తలాడించింది సమన్విత.

"అయ్యో! ఇప్పుడు కొత్తబట్టలు నాకెందుకండీ'' గౌతమి ఇబ్బందిపడిపోతూ అంది.

"ఇంటికి కొత్తగా ఆడవాళ్లు వచ్చినప్పుడు

అలా పెట్టి పంపడం మన సంప్రదాయం కదా గౌతమి''

గౌతమి మరేం మాట్లాడలేక మౌనంగా ఉండిపోయింది.

రేణుక బెడ్‌రూమ్‌లోకెళ్లి బట్టలు మార్చుకుని వచ్చాక రిస్ట్‌వాచ్‌కేసి చూసుకుంటూ "పదిగంటలయింది. షాపులు తీసి ఉండొచ్చు. వెళ్దాంపదా'' గౌతమి చెయ్యిపట్టుకుని బయల్దేరదీసింది.

గౌతమి, రేణుక వెనుకే బయటకు నడుస్తూ వాకిట వరకూ వెళ్లాక వెనక్కు తిరిగి చూసింది. సమన్విత ముఖంలో అదోలాంటి మెరుపు కనిపించింది ఆమెకు. బహుశా వంశీకృష్ణతో కాసేపు మాట్లాడే అవకాశం, ఏకాంతంగా గడిపే అదృష్టం తనకు కలిగినందుకు ఆ అమ్మాయి మురిసిపోతూ ఉండొచ్చు. ఆ ఆనందం ఇచ్చిన మెరుపు ముఖంలో ప్రతిఫలిస్తున్నట్టుంది.

రేణుక, గౌతమిలు వంశీ కారులో ఇంట్లో నుండి బయటపడ్డారు.

ఇంట్లో వంశీ, సమన్వితలు మాత్రమే మిగిలారు.

ఆ ఇంట్లో తామిద్దరే అన్న ఫీలింగ్ సమన్వితకు ఉత్సాహాన్నిచ్చింది. రాత్రి తను తీసుకున్న నిర్ణయం చెప్పడానికి ఇంతకు మించిన సమయం మరోటి రాదనిపించిందేమో! అతడికి ఎదురుగా కూర్చుని "నేను నేను మీకో విషయం చెప్పాలనుకుంటున్నాను'' అంది. అయితే ఎంతయినా అది జీవితానికి సంబంధించిన విషయం కాబట్టి కాస్త టెన్షన్‌గా ఉంది. మనసుకు చెందిన మాట అయినందున సిగ్గుపడాల్సిన అవసరమూ ఏర్పడింది.

వంశీ ఆమె ముఖంలోకి చూశాడు. సమన్విత సిగ్గుపడడం గ్రహించాక ఆశ్చర్యపోయాడు. ఆమె తన ముందు ఎప్పుడూ అలా సిగ్గును ప్రదర్శించలేదు. మరి ఇప్పుడు...

"చెప్పండి'' ఆశ్చర్యంగానే అడిగాడు.

"అది... అది...'' నిజానికి ఆమెకు కూడా తను మరోవ్యక్తి ముందు ఇంతగా సిగ్గుపడగలననే విషయం తొలిసారిగా అర్థమయినట్టుంది.

నిజానికి అతడికీ ఆమె ఏం చెప్పబోతోందో అసలు అర్థం కాలేదు. బహుశా మరేదయినా పర్సనల్ విషయమేమో అనుకున్నాడు. అందుకే "మీరు ఏ విషయమైనా నిరభ్యంతరంగా చెప్పొచ్చు. అలాగే మీకేదయినా సలహా కావాలన్నా ఇస్తాను'' అన్నాడు.

అతడలా అనేసరికి ఆమెకు నవ్వొచ్చింది. ఫక్కున నవ్వింది.

తానేం జోక్ చేయకుండానే ఆమె నవ్వడం ఏదోలా అనిపించినా అతడు మరేం మాట్లాడకుండా ఆమెనే చూడసాగాడు.

అరనిముషం తర్వాత సమన్విత నవ్వడం ఆపి "అది అదేమిటంటే నేను...'' మరో సెకను ఆగి ఉంటే చెప్పేసి ఉండేదే. అప్పుడే ఫోన్ మోగింది.

ఆమె విసుగ్గా ఫోన్‌కేసి చూసింది. "ఒన్ మినిట్'' అంటూ అటు వెళ్లింది.

సమన్విత రిసీవర్ చేతిలోకి తీసుకుని హలో అంది. అవతలివైపు గొంతు గుర్తుపట్టడంతోనే హుషారుగా "హాయ్! మమ్మీ... హౌఆర్‌య్యూ... థాంక్యూ.. హాయ్ డాడీ... థాంక్యూ డాడ్.. సింపుల్ బర్త్‌డే పార్టీ డాడీ! తలస్నానం చేయడం, దగ్గరగా అనిపించిన మరో ఇద్దరు వ్యక్తుల్ని పిలిచి లంచ్ ఏర్పాటు, సినిమా.. ఇంకేంటి డాడ్! విశేషాలూ... బిజినెస్ ఎలా ఉంది? అన్నట్టు ఈరోజు రాత్రి నీతో ఫోన్‌లో మాట్లాడాలి... యస్‌డాడ్! అర్జంటే... నా లైఫ్‌కి సంబంధించిన ఓ ముఖ్యమైన విషయం మాట్లాడబోతున్నాను. అది సస్పెన్స్! మీరు చాలా రోజులుగా కోరుకుంటున్నదే. గుడ్‌న్యూస్ అని చెపుతున్నాగా''

వంశీ ఫోన్‌లో మాట్లాడుతున్న ఆమెనే చూస్తున్నాడు. ఆమె ఢిల్లీలోని తన మమ్మీడా





డీలతో మాట్లాడుతోందన్న విషయం అర్థమయిపోయింది. ఆమె ఫోన్‌లో మాట్లాడుతోంటే అతడు సాలోచనగా వెనక్కు వాలా 'డు. ఎంతాలోచించినా ఆమె సిగ్గుపడి పోతూ తనకు చెప్పదలచుకున్న విషయమేమిటో ఎంతకీ అర్థం కావడంలేదు.

అతడు అలా ఆలోచనలలో మునిగి ఉండగానే ఆమె ఫోన్ పెట్టేసి అతడి దగ్గరగా వచ్చింది. "ఢిల్లీ నుండి మమ్మీడాడీలు ఫోన్ చేశారు. బర్త్‌డే విషెస్ చెప్పారు'' అంది.

"అలాగా! అన్నట్టు మీ డాడీ ఏం చేస్తుంటారు?" యథాలాపంగా అడిగాడు.

"మీరు ఆయన పేరు వినే ఉంటారు. ఆయన పేరు కృష్ణకిషోర్. సుమ గ్రూప్ ఆఫ్ హెూటల్స్ మావే''

వంశీ ఇంచుమించు ముందుకు తూలాడు. భారతదేశంలో మూడోస్థానంలో ఉన్న గ్రూఫ్ ఆఫ్ హెూటల్స్ అధిపతి కృష్ణకిశోర్ కుమార్తె ఈమె... అయినా మరీ ఇంత సింపుల్‌గా...

"నాకు ఈ విషయం ఇంతవరకూ తెలియదు. మీరూ ఎప్పుడూ చెప్పలేదు''

"అది అంత ఇంపార్టెంట్ విషయమని నాకు అనిపించలేదు'' నవ్వేసింది ఆమె.

అతడు ఆ ఆశ్చర్యం నుండి తేరుకోక ముందే మరోసారి ఫోన్ రింగవడంతో ఆమె లేచి అటువైపు నడిచింది.

"రఘురామ్ బావగారికోసం ఫోన్' వచ్చాక చెప్పింది సమన్విత.

అయితే ఇలా టాపిక్‌లు డైవర్ట్ అయ్యాక తను చెప్పదలచుకున్న మాట మరుగునపడింది. ఇక అప్పటికి చెప్పేమూడ్ కూడా పోయింది.

దాంతో అతడు "మీరేదో చెప్పాలనుకున్నారు'' అని ప్రశ్నించినా "లేదండి తర్వాత చెపుతాను'' అంటూ మాటదాటేసింది.

మరో అర్ధగంటలోనే గౌతమి, రేణుకలు తిరిగొచ్చారు. రేణుక, గౌతమికి పసుపు కుంకుమలు అందజేసింది.

తర్వాత వంట ప్రయత్నాలు మొదలయ్యాయి.

లంచ్ అయ్యాక సినిమాకెళ్లినప్పుడు థియేటర్‌లో సమన్విత వంశీ పక్కన సీటువచ్చేలా సర్దుకుని కూర్చోవడం గమనించింది గౌతమి.

ఈసారి రేణుక కూడ సమన్విత ప్రవర్తనలోని తేడాను గమనించింది. ఇంటర్వెల్‌లో పక్కకు తీసుకెళ్లి అడిగింది. "ఏంటే సమా! వంశీని రాసుకుపూసుకు తిరుగుతున్నావ్? ఏమయింది నీకు?"

"లవ్వయ్యింది'' చప్పున చెప్పింది సమన్విత.

రేణుక గుండెవేగం పెరిగింది. "ఏమిటే సమా! నువ్వు... నువ్వనేది నిజమా?"

"నీమీద ఒట్టు రేణూ?"

"కాని మీ మమ్మీడాడీలు''

"నేను పెళ్లి చేసుకుంటానంటే చాలు ఎగిరిగంతేస్తారు. ఎవరూ ఏమిటి అని అడగను కూడా అడగరు. నాకా నమ్మకం ఉంది''

"చివరికి గౌతమి విషయం తెలిసినా కూడానా?"

"ఆ విషయంలో వంశీకృష్ణ మీద సదభిప్రాయం కలిగేలా వాళ్లతో చెప్పే బాధ్యత నీదే. అఫ్‌కోర్స్! నేనూ సహాయం చేస్తాననుకో'

"అమ్మో! చాలా పెద్ద బాధ్యత ఇది''

"నీ స్నేహితుడి మేలుకోసం నీ చెల్లి కోరిక తీరడంకోసం నువ్వు ఆ మాత్రం బాధ్యత మోయక తప్పదు''

క్షణమాగి రేణుక నవ్వుతూ "అలాగే'' అంది. నిజానికి రేణుక మనసులో ఆనందం అంబరాన్నంటుతోంది. అయితే మరో అనుమానమూ మనసులో కదలాడుతోంది. వంశీ సమన్వితను పెళ్లాడేందుకు ఇష్టపడతాడా? అని. ఒక వేళ అతడు అంగీకరించినా సమ



న్విత మమ్మీడాడీలు. ఏదేమయినా ఇది నిజంగా ఆనందించవలసిన సమయమేనని ఆమె నమ్మకం.

సమన్విత కూల్‌డ్రింక్ బాటిల్స్ తీసుకుంది. నాలుగు బాటిల్స్‌తో ఇద్దరూ థియేటర్ లోపలికి వెళ్లారు.

రేణుక కూల్‌డ్రింక్ బాటిల్ నవ్వుతూ వంశీకృష్ణకు అందిస్తూ అతడి ముఖంలోకి చూసిందిగానీ అతడు ఆమె ముఖంలోకి పరిశీలనగా చూడలేదు. కూల్‌డ్రింక్ అందుకుంటూ "థాంక్స్'' అన్నాడు.

సినిమా వదిలాక నలుగురూ ఎదురుగానే ఉన్న రెస్టారెంట్‌లోకి వెళ్ళి, ఎవరికిష్టమైనది వాళ్ళు తెప్పించుకున్నారు. రేణుక పైనాపిల్ కేక్, సమన్విత పిజ్జా, వంశీ, గౌతమిలు మాత్రం ఐస్‌క్రీమ్ ఆర్డరిచ్చారు.

ఆరోజు మొత్తం ఖర్చంతా సమన్వితదే! వంశీ పర్స్ తీయబోయినా ఆమె ఒప్పుకోలేదు. రేణుక కూడా అతడి ప్రయత్నం సాగనివ్వలేదు.

రెస్టారెంట్‌లో కాసేపు మాట్లాడుకుంటూ కూర్చున్నారు నలుగురూ. ఆ సమయంలో సమన్విత మంచి జోకులు చెప్పి వాళ్ళను నవ్వించింది.

అప్పటికి కనుచీకటిపడింది.

రేణుక లేస్తూ "ఇంటికెళ్ళి డిన్నర్‌కి రెడీ చెయ్యాలి. హాస్పిటల్ నుండి రఘురామ్ కూడా వచ్చి ఉంటాడు వెళ్లొంపదండి'' అంది.

మిగిలిన ముగ్గురూ తలలాడించి పైకి లేచారు.

కారు కదిలి, రేణుక ఇంటి ముందు ఆగింది.

రేణుక, సమన్విత కారు దిగారు. "బై..." చెయ్యి ఊపాడు వంశీ.

"బై... ఉంటాను గౌతమీ'' గౌతమికి కూడా చెప్పి ముందుకు కదిలింది రేణుక.

సమన్విత మాత్రం కారు దగ్గరే నిలబడిపోయి, డోర్ దగ్గర తల ఉంచి, గొంతు తగ్గించి అతడితో అంది. "ఉదయం నేను మీకోవిషయం చెప్పాలనుకుని చెప్పలేకపోయాను''

"అవును... ఏమిటది?"

"ఐ లవ్ యూ''

సమన్విత తల తిప్పుకుని ముందుకు నడిచింది.

అతడు తేరుకునేందుకు పదిసెకనులు పట్టింది. అప్పటికే ముఖం ఎర్రగా కందిపోయింది. వంట్లోని రక్తమంతా వడివడిగా పరుగులుతీయటం మొదలయింది. అతడు తలతిప్పి వెనక్కు చూశాడు. గౌతమి డోర్ లోనుండి వీధికి మరోవైపు చూస్తోంది. ఆమె సమన్విత మాటలు వినలేదని కన్‌ఫర్మ్ అయింది.

దీర్ఘంగా నిశ్వసించి అతడు కారు ముందుకు పోనిచ్చాడు. అదే సమయంలో అతడి పెదాలమీద అప్రయత్నంగానే చిరునవ్వు ఉదయించింది.



గౌతమికి నిద్ర పట్టలేదారాత్రి. భవిష్యత్ గురించిన ఆలోచనలు ఆమెను చుట్టుముట్టి నిద్రను దూరంచేశాయి.

తనకు కంప్యూటర్‌కోర్స్ మరో వారంరోజులలో పూర్తయిపోతుంది. ఆ తర్వాత ఉద్యోగం దొరకడం కష్టంకాబోదు. అంటే తన కాళ్ళమీద తను నిలబడగలిగిన శక్తి వచ్చినట్టే! తనిక ఈ విశాల ప్రపంచంలో బతుకుతెరువు కోసం భయపడనక్కర్లేదు. తన కడుపు నింపుకోవడమే కాదు, తన బిడ్డ కూడా సౌకర్యంగా పెరిగేందుకు తగిన సంపాదన తను సంపాదించగలదు. తనకిప్పుడు ఆ నమ్మకం ఏర్పడింది.

ఉద్యోగం చేయాలన్న నిర్ణయం తీసుకోవడం జరిగిపోయిందిగానీ అది ఎక్కడ చేయడం అనే నిర్ణయమే తీసుకోవలసి ఉంది.

ఇండియాలో యానిమేషన్‌కి అంత డిమాండ్ లేకపోయినా నాలుగయిదువేల జీతం వచ్చే ఉద్యోగం సంపాదించడం అంత కష్టంకాబోదు. అదే ఏ పెద్దయాడ్ ఏజన్సీలోనో జాబ్ వస్తే పదివేల వరకూ ఆఫర్ ఇస్తారు.

అయినా తనిప్పుడు ఇండియాలోనే ఉండవలసిన అవసరం ఏముంది? తన కంప్యూటర్ ఇన్‌స్టిట్యూట్‌లో సాటి విద్యార్థులు చాలామంది 'మేన్ పవర్' ఏజన్సీల ద్వారా విదేశాలకు వెళ్ళిపోయే ఉద్దేశ్యంలో ఉన్నారు. కంప్యూటర్ కోర్సులకు విదేశాలలో విపరీతమయిన డిమాండ్ ఉంది. నెలకు ఆరేడువేల డాలర్లజీతం వచ్చే అవకాశమూ ఉంది. మూడు నాలుగేళ్ళ అగ్రిమెంట్ కుదుర్చుకుని ఏ అమెరికాకో వెళ్ళిపోతే తిరిగి వచ్చాక, మరేఉద్యోగమూ చేయక్కర్లేదు. బ్యాంక్‌వాళ్ళు పంపే వడ్డీ డబ్బులతో కూర్చుని తింటూ ఉండిపోవచ్చు.

ఇప్పుడు పిల్లవాడి విషయమూ ప్రాబ్లమ్‌కాదు. నెలకు పదివేలు ఇంటికి పంపుతూ ఉంటే అమ్మ,నాన్న వాడిని పువ్వుల్లోపెట్టి చూసుకుంటారు.

మరి విదేశాలకు వెళ్ళడానికి సమస్య ఏముంది?

సమస్య కాదుగానీ తనకో బాధ్యత ఉంది. అది ఈ విషయం వంశీకృష్ణకు, పార్వతమ్మ, ప్రభాకరరావులకు చెప్పి ఒప్పించాలి. విదేశాలకు వెళ్ళడానికి వాళ్ళు కాదనరనే తన నమ్మకం.

'పైగా ఈ ఇంటికి కోడలు రాబోతూ ఉంది...'

ఆ సాయంత్రం జరిగిన సంఘటన తలచుకుంటే గౌతమి పెదాలమీద చిరునవ్వు ఉదయించింది.

'సమన్విత స్పీడ్ ఉన్న అమ్మాయి. ఆమె వంశీకృష్ణతో 'ఐ లవ్ యూ' అనగానే అతడెంత కంగారుపడ్డాడనీ! ఒకవేళ తను విని ఉంటుందేమోనని వెనక్కు తిరిగి మరీ చూశాడు. తను చప్పున తల తిప్పుకుని, ఆ మాట విననట్టు నటించడం ఎంతో మంచిదయింది. లేకపోతే ఆ తర్వాత కూడా తనకు ముఖం చూపించడానికి మరింత ఇబ్బందిపడిపోయేవాడు'

వంశీకృష్ణను సమన్విత ఇష్టపడడం చూస్తుంటే త్వరలో వాళ్ళ పెళ్ళి జరిగిపోయే అవకాశాలు కనిపిస్తున్నాయి. సమన్విత ఈ ఇంట్లోకి వచ్చినా తనకు ఏ సమస్యా ఉండకపోవచ్చు. తను ఈ ఇంట్లో ఎంతకాలమయినా ఇలాగే ఉన్నా, వాళ్ళు ఎలాంటి అభ్యంతరమూ చెప్పరు. ఎందుకంటే వాళ్ళు మనుష్యులు. మానవత్వం ఉన్న మనుష్యులు... కాదు, కాదు...మనుష్యుల్లో దేవుళ్ళు.

అయినా సరే, తను ఈ ఇంట్లో ఉండడం భావ్యంకాదు.

తుఫాను తాకిడికి కొంప కూలిపోయిన వేళ, చెట్టునీడలో తలదాచుకోవచ్చు. కాని చెట్టునీడనే శాశ్వతంగా ఆశ్రయం చేసుకుందామనుకోవడం సరయిన ఆలోచన కాదు. అందుకు చెట్టు అభ్యంతరం చెప్పకపోవచ్చు. ఎందుకంటే ప్రతిఫలాపేక్షరహితంగా దగ్గర చేరినవారికి నీడనిచ్చి సేదతీర్చడమే చెట్టుకు తెలిసిన ధర్మం. అలాంటి మహా

వృక్షం ఈ వంశీకృష్ణ.

ఒకవేళ అతడే కనుక తనకు ఈ 'నీడ' కల్పించకుండా ఉండిఉంటే తనేమయిపోయిఉండేదో? ఆ రాక్షసుడి హింసను భరించలేక ఈ దేశంలోని సగటు ఆడది చేసినట్టే ఎప్పుడో ఆత్మహత్య చేసుకుని జీవితం ముగించి ఉండేది. ఈ మొక్కను పశువులాంటి మొగుడు నలిపి నాశనం చేయకుండా కాపాడి పదిలంగా పెంచినవాడు అతడే!

ఈదేశంలో లక్షకొక్కరు అలాంటి వాళ్ళున్నా, మగాడి క్రూరత్వానికి బలిపశువులుగా మారుతున్న ఎందరో ఆడవాళ్ళలో కొందరయినా రక్షింపబడతారు.

అలాంటి మంచిమనిషికి కృతజ్ఞతాపూర్వకంగా తను ఇవ్వగలిగింది ఏమీ లేదని తెలుసుకున్న ఆమె మనసులోనే అతడికి నమస్కరించింది.

మర్నాటి నుండి, విదేశాలలో ఉద్యోగం చేసేందుకు కావలసినవి సమకూర్చుకునే ప్రయత్నాలు మొదలుపెడుతూ ఆ ఇంట్లోవాళ్ళకు ఆ విషయం తెలియచేసింది.

ఆమె ఆలోచన విన్నాక వంశీకృష్ణ మౌనంగా ఉండిపోయినా పార్వతమ్మ అంది. "నాకు తెలిసి అది చాలా మంచి ఆలోచనమ్మా. అందువల్ల నీ భవిష్యత్తు బాగుపడుతుంది. నీ బిడ్డ కూడా కష్టాలు తెలియకుండా పెరుగుతాడు. మరేం ఆలోచించకుండా నీ ప్రయత్నాలు నువ్వు చెయ్యి''

గౌతమి వంశీకృష్ణ ముఖంలోకి చూసింది. 'మరి మీరేం చెపుతారు?' అన్న ప్రశ్న ఆ చూపుల్లో ఉంది.

అది గమనించాక అతడు "మీరు విదేశాలకు వెళ్తానంటే, నేను కాదననుగానీ, మరీ అంత అవసరం ఉందేమో ఆలోచించండి. ముఖ్యంగా ఆ పసివాడికి తండ్రి దూరమయ్యాడు. ఇప్పుడు మీరుకూడా మూడునాలుగేళ్ళపాటు కనిపించకుండా ఉండడమంటే, చిన్నతనంలో తల్లీతండ్రి లేకుండా బతకడం నరకంలాంటిది ఆలోచించండి'' అన్నాడు.

నిజమేనన్నట్టు తలాడిస్తూ ఉండిపోయింది గౌతమి.

అంతలో పార్వతమ్మ అంది "పిల్లవాడిని మనింట్లోనే ఉంచుకుందాంరా వంశీ. వాడికి ఏ లోటూ లేకుండా ఎవ్వరూ గుర్తురాకుండా పెంచుకుందాం"

"మనం ఎంత సుఖంగా పెంచినా తల్లీబిడ్డల మధ్య ఉండే ఆప్యాయతలు వేరుగా ఉంటాయమ్మా. అక్కడికెళ్ళాక ఆమెకు తన బిడ్డ గుర్తుకురావచ్చు. సాటి పిల్లలను చూసి పిల్లవాడూ తల్లి ప్రేమకోసం అల్లాడిపోవచ్చు''

"అదీ నిజమేననుకో' నసిగింది పార్వతమ్మ. కొడుకు మాటల్లో ఉన్న నిజాన్ని అప్పుడే ఆమె గ్రహించింది.

ఆ విషయం గౌతమికి కూడా తెలుసు. ఆమెది తల్లిమనసు. ఆ నిజాన్ని ఎప్పుడో అర్థంచేసుకుంది. అయినా ఆమె విదేశాలకు వెళ్ళాలనే ఎందుకనుకుంటూ ఉందంటే తను ఈ దేశంలోనే ఉంటే, ఈ ఇల్లు వదిలేందుకు ఆ తల్లీకొడుకులు ఒప్పుకోరు. ఈ ఇంట్లో ఇంకా ఉండడం ఆమెకు ఇష్టంలేదు. అదీ... వాళ్ళ మేలుకోరే!

ఆమె ఇంకా డైలమాలో ఉన్నట్టుగా అనిపించడంతో అతడు చెప్పాడు, "నా అభిప్రాయం నేను చెప్పాను. నిర్ణయం మీదే... ఒకవేళ మీరు ఫారిన్‌కి వెళ్ళదలచుకుంటే పిల్లవాడిని ఈ ఇంట్లోనే ఉంచి వెళ్ళొచ్చు. అలాకాదు వెళ్ళిపోవాలనే ఆలోచనను విరమించుకుంటే, ఐదారువేల రూపాయలు జీతం వచ్చే ఉద్యోగం చూపిస్తాను. మీరు ఈ ఇంట్లోనే ఉండి, పిల్లవాడిని చూసుకుంటూ హాయిగా ఉద్యోగం చేసుకోవచ్చు''

'అదిగో! అదే తనకు ఇష్టంలేనిది. నీడనిచ్చిన చెట్టునే ఆశ్రయంగా మార్చుకోవడం... అందులోనూ తను ఆచోట ఉంటే అతడికే నష్టం అని తెలిశాక కూడా... ఊహు! వెళ్ళిపోవాలి అతడి సంసారం సాఫీగా సాగా





లంటే తను ఈ ఇల్లు విడిచి వెళ్ళిపోవాలి'

ఎలాంటి నిర్ణయాలు జరగకముందే, రేణుక వాళ్ళమధ్య ప్రవేశించింది. అక్కడ ఏదో తీవ్రమైన చర్చ జరుగుతున్నట్టు అర్థంచేసుకుని, "ఆంటీ! ఏం జరుగుతోందిక్కడ?" అంటూ ప్రశ్నించింది.

పార్వతమ్మ గౌతమి మనసులోని మాట రేణుక చెవినవేసింది. అది విన్నాక రేణుక ఆశ్చర్యంగా గౌతమికేసి చూసింది.

"మనం అలా ఆ గదిలోకి వెళ్ళి మాట్లాడుకుందాంపదా'' రేణుక గౌతమి చెయ్యి పట్టుకుని పక్కగదిలోకి తీసుకెళ్ళింది. "ఇప్పుడు చెప్పు! నువ్విలాంటి నిర్ణయం ఎందుకు తీసుకున్నావ్?"

గౌతమికి మనసులోని మాట వెనుకఉన్న అంతరార్థం ఎలా చెప్పాలో అర్థంకాలేదు. అందుకే మౌనం వహించింది.

"నీకూ డబ్బు సంపాదన మీద మనసు పోయిందా? కార్లు, బంగళాలు సంపాదించాలనే కలలు మొదలయ్యాయా?"

"కాదు'' వెంటనే చెప్పింది గౌతమి.

"మరెందుకు విదేశాలకెళ్ళడం... సాధారణంగా విదేశాలకెళ్ళాలనుకునేవారి ఆశ ఒక్కటే. డబ్బు సంపాదించడం. అక్కడ దొరికే విలాసవంతమయిన జీవితం, అక్కడి సంపాదనతో వచ్చే కార్లు, మేడలు సొంతం చేసుకోవాలనుకోవడం. అలాంటి కోరికతోనే ఎక్కువ మంది, ఈ దేశంలో ఉద్యోగం దొరికే అవకాశం ఉన్నా విదేశాలకు వెళ్తుంటారు. దానికి వాళ్ళు 'బెటర్ ఆపర్ట్యునిటీ' అనే పేరు పెట్టుకుంటారు. మరి నీది అలాంటి కోరిక కాదా?"

"నాకు కారులు, మేడల మీద ఆశలేదు. కేవలం ఆ ఆశతో నేను నా బిడ్డకు ప్రేమను పంచాలనే బాధ్యతను మరచి దూరం వెళ్ళాలనుకోవడం లేదు'' గౌతమి గొంతు జీరవోయింది.

"మరెందుకు వెళ్ళడం'''

"నాకు నీడనిచ్చి, నా కాళ్ళమీద నేను నిలబడేలా చేయడమే కాకుండా, అసలు నేను బతికి ఉండడానికి కారకులైన ఈ ఇంట్లోని వాళ్ళు ఇంకా నావల్ల బాధపడడం నాకిష్టంలేదు అందుకే'

గౌతమి విదేశీ ప్రయాణం వెనుక అంతరార్థం అర్థంకావడంతోనే, ఆమె మంచి మనసు రేణుకకు అర్థమై సంతృప్తిపడింది. అప్పుడే ఆమె భుజంమీద చెయ్యివేసి "పిచ్చిదానా!" అంది. "ఎవరో ఏదో అనుకుంటారని నువ్వు భయపడి పారిపోవడం నాకు నచ్చలేదు. అయినా ఈమధ్యకాలంలో నేను గమనించింది ఏమిటంటే, ఈ 'సంఘం'లోని జనం మనల్ని గురించి ఏమనుకుంటారో, ఏం చేస్తారోనని మనం భయపడటమేగానీ, అసలు మనం ఏం చేసినా ఈ 'సంఘం'కి అవసరంలేదు.

పక్కింట్లో అల్లరి జరుగుతుంటే, ఏమిటో అని తొంగిచూస్తాడే తప్ప, ఏం జరిగిందో తెలుసుకుని చర్చలు జరిపేంత 'టైమ్' నేటిమనిషికి లేదు. పైగా నేటి మనిషి లౌక్యుడు. ఎదుటివాడితో ఎప్పుడు ఏం అవసరపడుతుందోనని తన మనసులోని భావాలను మనసులోనే దాచుకుంటున్నాడే తప్ప, పక్కవాడితో కూడా చెప్పడంలేదు... ఇదే నేటి 'సంఘం' పరిస్థితి. కాబట్టి జనం ఏమను

కుంటారో ఏమో అనుకుని నువ్వు పారిపోనక్కర్లేదు. నిన్ను ఇబ్బందిపెడితే ఇంట్లోని వారే ఇబ్బంది పెట్టాలి. కాని నీకా పరిస్థితిరాదు. ఎందుకంటే, ఈ ఇంటికి కోడలుగా రాబోతున్న అమ్మాయి సమన్విత. ఆమెకు నీ గురించి పూర్తిగా తెలుసు. కాబట్టి భవిష్యత్తులో కూడా ఈ ఇంట్లో నీ ఉనికికి ఎలాంటి ప్రమాదమూ లేదు. అది నా హామీ. అలాకాకుండా ఈ ఇంట్లోని మనుష్యులకు కాస్త దూరంగా ఉండడమే మంచిదని నీకనిపిస్తే విదేశాలకే పారిపోనక్కర్లేదు. సిటీలోనే మరో చోట ఇల్లు తీసుకుని, ఉద్యోగం చేస్తూ నీ



బిడ్డతో నువ్వు బతకొచ్చు. సత్యమూర్తి నీ జోలికి రాకుండా కాపాడే బాధ్యత వంశీది. ఏమంటావ్?"

రేణుక చెప్పినదంతా శ్రద్ధగా విన్నాక గౌతమి తలాడించింది.

"అలాగే, మీరు ఏం చెప్పితే అదే చేస్తాను'' చెప్పింది ఆమె.

"సరే పదా'' రేణుక ఆమె చెయ్యిపట్టుకుని హాల్లోకి తీసుకెళ్ళింది.

హాల్లోకి వెళ్ళాక పార్వతమ్మను చూస్తూ చెప్పింది రేణుక "నేను గౌతమికి చెప్పాను. తను ఫారిన్ వెళ్ళే ఆలోచనను మానుకుంది. ఉద్యోగంలో చేరినా తను ఈ ఇంట్లోనే ఉంటుంది''

పార్వతమ్మ 'అలాగే' నన్నట్టు తలాడించింది. వంశీకృష్ణ ముఖంలో సంతృప్తి కదలాడింది.

రేణుక పార్వతమ్మ పక్కనే కూర్చుని చెప్పింది. "నేను మీకో విషయం చెప్పాలని వచ్చాను''

"ఏమిటమ్మా అది?"

"రేపు సాయంత్రం సమన్విత మమ్మీడాడీలు ఈ ఇంటికొస్తున్నారు''అని కాసేపాగి

"కాబోయే అల్లుడు ఎలా ఉన్నాడో ఓసారి చూసుకుని వెళ్దామనీ''అంది.

సూదిపడితే వినపడేంత నిశ్శబ్దం ఒక్కసారిగా హాలులో ఏర్పడింది. ఏదో పనిమీద హాలులోకి రాబోయిన వరాలు, వాళ్ళందరి ముఖాలకేసి చూసి అయోమయంగా కిచెన్‌దగ్గరే ఆగిపోయింది.

హాలులోని ఆ ముగ్గురూ చిత్తరువుల్లా నిలబడిపోతే, రేణుక మాట్లాడింది. "ఏంటీ? నా మాటలకు అందరూ షాక్ తిన్నట్టు అలా అయిపోయారు... నేను చెప్పిన మాటలు మీకు నమ్మబుద్ధేయట్లేదా?"

పార్వతమ్మ గొంతు పెగల్చుకుంది. "ఇది... ఇదెలా సాధ్యం రేణూ''

"ఎందుకు సాధ్యంకాదు? అమ్మాయి అబ్బాయిని ఇష్టపడి, అతడినే పెళ్ళిచేసుకుంటానన్నాక, కాదనేందుకు వాళ్ళు మూర్ఖులయిన తల్లిదండ్రులు కాదు. అందులోనూ వంశీని వాళ్ళు చూస్తే నిజంగానే ఆనందపడిపోతారు. మా పిన్నికి ఇప్పటికే నేను వంశీ గురించి చెప్పవలసినంత వరకూ చెప్పాను. బాబాయ్ కూడా ఇష్టపడ్డట్టే మాట్లాడాడు'' రేణుక చెప్పింది.

పార్వతమ్మ ముఖం మెరిసిపోవడం రేణుకతోపాటు, గౌతమి కూడా గమనించింది. గౌతమి తలతిప్పి వంశీకృష్ణకేసి చూసింది. అతడి ముఖంలో కదలాడే భావమేమిటో ఆమెకు అర్థంకాలేదు.

మర్నాడు...

సమన్విత తండ్రి కృష్ణకిశోర్‌గారూ, తల్లి వేదవతి ఆ ఇంటికొచ్చారు.

ఆస్తి విషయంలో తప్ప అన్నివిధాలా వంశీ తమ అమ్మాయికి తగిన వరుడు అని నిర్ణయించుకున్నాక కృష్ణకిశోర్‌గారు ప్రభాకరరావు, పార్వతమ్మలతో చెప్పారు.

"అమ్మాయిని చూసుకునేందుకు పెళ్ళికొడుకు తరఫువాళ్ళు రావడం సాంప్రదాయం. కాని మా అమ్మాయిని ఇంతకుముందే మీరు చూసి ఉన్నారు కాబట్టి, ఇక మిగిలిన వ్యవహారం. మేము అబ్బాయిని చూడడమే అయినందున ఇలా వచ్చాం. మీరు మరోలా భావించవద్దని మనవి. అలాగే... మీకు మా అమ్మాయి నచ్చిన విషయం చెపితే, మిగిలిన విషయాలు మాట్లాడుకుందాం"

"అమ్మాయి మాకు ఎప్పుడో నచ్చింది''

"మరింకేం" అంటూ ఆయన, నిశ్చితార్థం గురించి మాట్లాడడం మొదలెట్టాడు.

ఆరోజునుండే ఆ ఇంట్లో పెళ్ళిసందడి మొదలయింది.

★ ★ ★

ప్రతి మనిషి తాను ఏదో చేయాలనుకుంటా




డు. అలా వ్యక్తి తలచినవి కొన్ని యథాత థంగా . చేయగలుగుతాడు. మరికొన్ని మా త్రం చేయలేకపోతాడు. ముఖ్యంగా విధి వింతనాటకం ఆడి ఊహించని మలుపులకు కారణమవుతుంది.

గౌతమి విదేశాలకు వెళ్ళకపోయినా, ఎట్టి పరిస్థితుల్లోనూ సత్యమూర్తి దగ్గరకు వెళ్ళకూ డదనే అనుకుంది. తనకు ఆ అవసరమూ లేదనే ఆమె నమ్మకమూనూ.

అయితే సత్యమూర్తి ఒకానొకరోజు బాగా తాగి రోడ్డుకు అడ్డంగా తూలుతూ నడు స్తుంటే, వెనుకనుండి వస్తున్న లారీ అతడిని గుద్దింది. అతడు ముందుకు పడ్డాడు. లారీ టైర్ అతడిచేతిని నుజ్జునుజ్జు చేస్తూ ముందు కెళ్ళిపోయింది.

సత్యమూర్తిని హాస్పిటల్లో చేర్చారు.

ఈ విషయం గౌతమికి కబురందింది.

ఆమె అసలు హాస్పిటల్కి వెళ్ళకూడదనే అనుకుంది. అతడు పెట్టిన హింస ఆమె మనసును అంతగా విరిచేసింది. కాని ఏ మూలో మిగిలిన మానవత్వం 'తప్పు చే యకు' అంటూ ఘోషపెట్టింది. మెడలో వేలాడుతున్న మంగళసూత్రాలు సెంటి మెంట్ను గుర్తుచేశాయి.

అందుకే ఆమె హాస్పిటల్కి వెళ్ళింది.

హాస్పిటల్లోని డాక్టర్స్ ఆమెకూ, అతడికి మధ్యనున్న సంబంధం తెలిశాక జాలిగా చూస్తూ చెప్పారు. కుడిచెయ్యి నుజ్జునుజ్జయి పోయింది. ఆ భాగం తొలగించక తప్పదు''

'తన మనసులోని' కసి చల్లారిందా? అతడికి తగినశాస్తి జరిగింది కదా?... అలా అనుకుని సంతృప్తిపడాలనుకుంది. కాని మనసు అంగీకరించలేదు. స్త్రీ సహజసిద్ధమ యిన జాలి పొంగిపొరలింది.

డాక్టర్లు తమ పని తాము చేసుకుపోయా రు. సత్యమూర్తి చెయ్యి తీసేశారు.

సత్యమూర్తికి నాలుగు గంటల తర్వాతే స్పృహ వచ్చింది. స్పృహ రావడంతోనే అతడు మోచేతి వరకూ తొలగించబడిన తన కుడిచెయ్యిని చూసుకుని బావురుమన్నాడు.

చాలాసేపు అలాగే ఏడుస్తూ ఉండిపో యాక ఎదురుగా ఉన్న గౌతమిని చూసి "నా చెయ్యి... నా చెయ్యి... ఏమయింది..." మరింత పెద్దగా అరవసాగాడు.

"బహుశా లారీకిందపడడం కూడా ఆ మత్తులో నీకు అర్థంకాలేదని తెలిసిపోతూనే ఉంది. అక్కడివరకూ చెయ్యి తొలగించకపో తే బాడీకే ప్రమాదమని డాక్టర్లు ఆ పనిచేశా రు." అంటున్న గౌతమికి కాస్త దుఃఖం వచ్చింది. అయినా ఆ దుఃఖం అతడి ముందు బయటపడడం ఇష్టంలేక పెదవుల చాటున బిగపట్టింది.

"నా చెయ్యి... నా చెయ్యి... అయ్యో! నేనింక బతికి లాభం ఏమిటి? నేను చచ్చిపో తా..." కాసేపు కప్పు ఎగిరిపోయేలా అర వడం, ఏడవడం చేశాడు సత్యమూర్తి

అతడి అరుపులు, ఏడుపులు విన్న నర్సు వెళ్ళి డాక్టర్ని పిలుచుకొచ్చింది. డాక్టర్ అత డిని సముదాయించాలని చూశాడు. అతడు ఆగకపోవడంతో మత్తు ఇంజక్షన్ ఇచ్చి నిద్ర పోయేలా చేశాడు.

డాక్టర్లు వెళ్ళిపోయాక, గౌతమి భర్తకేసే తదేకంగా చూస్తూ గోడకు ఒరిగిపోయింది. అతడికేసి చూస్తుంటే ఆమెకు ఒకప్పుడు అతడు తనను పెట్టిన చిత్రహింస గుర్తుకువ స్తోంది. గొడ్డును బాదినట్టు బాదేవాడు. మత్తు మరీ ఎక్కువయితే సిగరెట్ పీకలతో వంటి మీద ఎక్కడంటే అక్కడే కాల్చేవాడు... అసలు అతడు ఇంట్లో ఉన్నంతసేపు నర కంలో ఉన్నట్టే ఉండేది. ఏ క్షణం ఏం జరుగుతుందోనని, ఎలాంటి అవమానం, మరెలాంటి బాధ భరించాల్సి వస్తుందోనని ఊపిరి బిగపట్టుకుని బతికేది. అతడు బయ టకెళ్ళిపోయాక కాస్తంత నిశ్చింత. తిరిగి సాయంత్రం కాగానే మళ్ళీ భయం మొదలు. హింసపెట్టే భర్త సమక్షంలో భార్యకు ప్రతిక్ష



ణమూ నరకమే.

చాలామంది అంటూ ఉంటారు. 'ఆడదానికి నిజమైన జీవితం భర్తతోనే' అని! ఆ మాటే నిజమనుకుంటే, తను భర్త నీడలో అంత నరకం ఎందుకు అనుభవించినట్టు? మరి అతడిని వదిలేసి వంశీకృష్ణ నీడ చేరాక తనకు ఎలాంటి అసంతృప్తీ కలగలేదు. పైగా ఎంతోకొంత సంతోషంగానే కాలం గడిపింది. ఇంకా తన భవిష్యత్ గురించి కష్టపడి ఓ విజయం సాధించింది. బతుకుమీద నమ్మకం కలిగేలా చేసుకుంది. తన కాళ్ళ మీద తను నిలబడగలననుకునే ధైర్యాన్ని తెచ్చుకుంది.

అందుకే తనకిప్పుడిప్పుడే ఓ సత్యం బోధపడుతూ ఉంది. 'భర్తనీడ భార్య సేదతీర్చుకోగలిగేలా ఉండాలే తప్ప, ఆమె అనుక్షణం అభద్రతాభావంతో వణికిపోయేలా ఉండకూడదు. ఒకవేళ అలాంటి పరిస్థితే ఆడదానికి ఎదురయితే భర్తను వదిలి బయటకురావటం తప్పుకాదేమో' అనే తను నమ్ముతోంది. అయితే అలాంటి స్త్రీకి వంశీకృష్ణలాంటి మంచివ్యక్తి చేయూత అందితే అది అదృష్టంగా భావించాలి. అలా జరగకపోయినా మరింత కష్టపడి తన వ్యక్తిత్వాన్ని కాపాడుకుంటూనే ఏదో సాధించి సంఘంలో గౌరవంగా బతికేలా తననుతాను తీర్చిదిద్దుకోవాలి. అందుకే... అందుకే తను ఆరోజు వేసిన అడుగు తప్పుకాదనే ఆమె మనస్ఫూర్తిగా నమ్ముతోంది.

మత్తు ప్రభావం వదిలి ఈ లోకంలోకి వచ్చాక సత్యమూర్తి మళ్ళీ అరవడం, పెద్దగా ఏడవడంలాంటి పనులు చేయలేదు. జరిగిన ఘోరాన్ని జీర్ణించుకుంటున్నట్టు పెదవులు బిగపట్టాడు. అతడి కళ్ళనుండి నీళ్ళు ధారాపాతంగా కారసాగాయి. అతడు మనసులోనే కుమిలిపోతున్నాడని అర్థమయిందామెకు.

'ఏదయినా బాధ ఏ మనిషినయినా బాధిస్తుంది. బాధించటం బాధ యొక్క సహజ గుణం. కాని ప్రతి మనిషి తన బాధలకు మాత్రమే స్పందిస్తాడు. ఎదుటిమనిషి బాధలను అసలు పట్టించుకోడు' అతడలా కుమిలిపోవడం చూసి మనసులోనే అనుకుందామె.

గౌతమి ఆ విషయాలు ప్రస్తావించి అతడిని బాధపెట్టదలచుకోలేదు. అలా అని ఓదార్చే ప్రయత్నమూ చేయలేదు. మనిషికీ మనిషికీ మధ్య మానసికంగా సత్సంబంధాలు ఉన్నప్పుడు మాత్రమే మనసులోనుండి బాధ పొంగుకొస్తుంది. అప్పుడే ఎదుటి మనిషికి ఓదార్చాలనీ అనిపిస్తుంది.

ఆమె మనసులోని ఏ భావమూ ముఖంలో ప్రతిఫలించేలా లేకుండా జాగ్రత్తపడి, భావరహితంగా అతడికి సేవలు చేయడం మొదలుపెట్టింది.



**స**త్యమూర్తికి జరిగిన యాక్సిడెంట్ గురించి తెలియటంతోనే వంశీ చాలా బాధపడ్డాడు. వెంటనే వెళ్ళి అతడిని చూడాలనిపించింది. స్పృహలో ఉండిఉంటే పరామర్శించాలనీ మనసు కొట్టుకులాడింది.

కాని అంతలోనే భయమో లేక అనీజీనెస్ లాంటి ఫీలింగ్ కదలాడి, ఆలోచనలోపడేలా చేశాయి. సత్యమూర్తికి తనంటే అసలు గిట్టదని తెలుసు. ఇప్పుడు తను హాస్పిటల్‌కి

వెళ్తే అతడు తన మీద విరుచుకుపడొచ్చు. అక్కడ ఓ పెద్దసీన్ క్రియేట్ చేయొచ్చు. చివరికి 'నా యాక్సిడెంట్‌కి కారణం ను వ్వా! యాక్సిడెంట్ చేయించి నన్ను చంపే స్తే నా పెళ్ళాన్ని శాశ్వతంగా నీ దగ్గరే ఉంచుకోవచ్చని ఈ ప్రయత్నం చేయించావ్. నా అదృష్టం బాగుండి ప్రాణాలతో బయటప డ్డాను' అని నిందవేయడమే కాదు, తోకతొ క్కిన తాచులా బుసలుకొట్టి ఆఖరికి పోలీస్‌రి పోర్ట్ ఇచ్చినా ఆశ్చర్యంలేదు.

ఆ సమయంలో డాక్టర్లు, నర్సులు, పక్క బెడ్ పేషెంట్లు తనకేసి ఎలా చూస్తారు? వారి కళ్ళల్లో అనుమానం, అసహ్యం కదలాడొ చ్చు గదా.

వంశీ తలవిదిలించాడు. 'అలాంటి సన్ని వేశాన్ని ఎదుర్కొనే ఓపిక, ధైర్యం తనకిప్పు డు లేవు'

అందువల్లే అతడు తను హాస్పిటల్‌కి వెళ్ళే ప్రయత్నం విరమించాడు. అయినా మనసు ఊరుకోలేదు. అందుకే అతడు ఆరోజు ఉదయమే తల్లితో అన్నాడు. "అ మ్మా! నువ్వా... ఓసారి గౌతమితో కలిసి వెళ్ళి సత్యమూర్తిని చూసివస్తే బా గుంటుందేమో''

పార్వతమ్మ తల విదిలించింది. "ఎందు కురా నాయనా లేనిపోని గొడవ? గౌతమిమీద అభిమానంతో మనం హాస్పిటల్‌కి వెళ్ళినా ఆ నీచుడు ఆ విషయం అర్థంచేసుకోలేడు. అత డు కష్టాలలో ఉంటే, మనమేదో ఎగతాళి చేయడానికి అక్కడికి వెళ్లినట్టుగా భావించి తను బాధపడిపోతూ, మన మనసుల్ని కష్ట పెడతాడు... వద్దులేరా నాన్నా'' అంది పార్వ తమ్మ.

'సత్యమూర్తి నీచుడు. ఒకప్పుడు మనల్ని తిట్టాడు. అందుకే ఇలా జరిగింది' అంటూ ఆమె కసిగా అననందుకు అతడికి సంతోషం కలిగింది. సాధారణంగా ఓ మనిషి దెబ్బతి న్నప్పుడు, అతడి వల్ల బాధపడినవాళ్ళెవ రూ, అతడి పట్ల సానుభూతి చూపరు. 'తగిన శాస్తి జరిగింది' అనుకుంటారు... కసిగా దెప్పిపొడుస్తారు.

తన తల్లి తనలాగే ఆలోచించడమేకా కుండా, విశాలహృదయం చేసుకుని మాట్లా డడంతో వంశీ మరేం అనుకోలేకపోయాడు. కొద్దిక్షణాల తర్వాత "సరేలేమ్మా'' అంటూ అవతలికెళ్ళిపోయాడు.

అతడు ఆరోజు ఆఫీసుకు వెళ్ళాడేగానీ, బిజినెస్ వ్యవహారాల గురించి ఆలోచించలే కపోయాడు. మనసు నిండా గౌతమి గు రించిన ఆలోచనలే!

గౌతమి ఇప్పుడు హాస్పిటల్‌లో తన భర్తకు సేవలు చేస్తోంది. ఈ సేవలకు సత్య మూర్తి కరిగిపోతాడా? లేక ఇక అడ్జస్ట్‌కాక తప్పదని ఆమెను దగ్గరకు తీసుకుంటాడా?

అయినా తనను ఎంతగానో మాన సికంగా, శారీరకంగా హింసించిన సత్యమూ ర్తికి గౌతమి సేవలు చేయటం ఎంతవరకూ సబబు?

అతడు ఆ ఆలోచనలలో ఉన్నప్పుడే అహల్య లోపలికి వచ్చింది.

"సార్! ఏదయినా డిక్టేట్ చేస్తారా?"

"లేదు''

ఆమె వెనుతిరిగి వెళ్ళిపోక అక్కడే నిలబ డి "సార్..." అంది సంశయిస్తున్నట్టు.

"చెప్పండి'' అన్నాడు అతడు, ఆమె ఏదో అడగాలని అనుకోవడం అతడికి అర్థమ యింది.

"సార్! నాకు రేపు సెలవు కావాలి''

అతడు మందహాసం చేశాడు. "సెలవు అడగడానికి అంత సంశయం ఎందుకు? అలాగే సెలవు తీసుకోండి'' అని చెప్పాక ప్రశ్నించాడు. "ఇంతకీ రేపు ఏదయినా విశేష మా?"

ఈసారి ఆమె సిగ్గుపడింది. చప్పున తల వంచేసి చెప్పింది. "రేపు... రేపు నా పెళ్ళి చూపులు సార్'



"కంగ్రాట్స్ అనాలా లేక బెస్టాఫ్‌లక్ అనాలా?"

"పెళ్లికొడుకు నాకు దూరపుబంధువే సార్! అతడు నన్ను ఇంతకుముందే చూసి ఉన్నాడు. కట్నకానుకల విషయం పట్టింపులేదంటూ చెప్పి పంపారు. అందులోనూ నేను అతడికి బాగా నచ్చేశానట. పెళ్ళంటూ చేసుకుంటే నన్నే చేసుకుంటానని పట్టుబట్టాడని తెలిసింది''

ఆమె బుగ్గలు ఎరుపెక్కడం గమనించి, వంశీ ఈసారి పెద్దగానే నవ్వాడు. "అయితే ఇంకేం? అడ్వాన్స్‌గా పెద్ద పార్టీనే ఇచ్చేయొచ్చు. ఈ పెళ్లిచూపుల తతంగం క్యాజువల్ మీట్‌లాంటిది కాబట్టి, పెళ్ళి ఫిక్స్ అయిపోయినట్టే చెప్పండి! పార్టీ ఎప్పుడిస్తున్నారు?" అని అడిగాడు.

అహల్య తలెత్తి అదోలాంటి భావం ముఖంలో కదలాడుతుండగా, అతడి కళ్లల్లోకి సూటిగా చూసింది. "సార్! నేను నేనీరోజు ఎలాంటి గిల్టీఫీలింగ్ లేకుండా సంతోషంగా పెళ్లిచూపులకు కూర్చుంటున్నానంటే, అది మీ గొప్పతనమే. ఆడపిల్లల అమాయకత్వాన్ని, వాళ్ళు కట్టుకునే గాలిమేడలను ఆసరాగా తీసుకుని..."

ఆమె మనసులో కలిగిన స్పందన అలా మాట్లాడిస్తోందని తెలుసు. కాని ఆమె తనను పొగడటం ఇబ్బందిగా అనిపించింది వంశీకి. "ఇట్సాల్‌రైట్ అహల్యా!" అన్నాడు మాటలు మధ్యలోనే కట్ చేయాలనే ఉద్దేశంతో.

దాంతో ఆమె కూడా తన ఎమోషన్‌ని కొద్దిగా కంట్రోల్ చేసుకుంది. నిజానికి ఆమె ఆరోజు తలనొప్పిగా ఉన్నప్పుడు ఆయింట్‌మెంట్ రాసే నెపంమీద అతడికి సన్నిహితమై తననుతాను అర్పించుకోవాలనే ప్రయత్నం చేస్తే సున్నితంగా మందలించిన ఆ సంఘటనను గుర్తుచేసి అతడికి కృతజ్ఞతలు చెప్పుకోవాలనుకుంది. కాని అతడు అలాంటి వాటికోసం ఎదురుచూసే మనిషి కాదని ఇప్పుడే అర్థమయింది. అతడు అంత గొప్పవాడు కాబట్టే జనమంతా నిందలు వేసినా, ఏమాత్రం తొణకకుండా ఓ స్త్రీకి 'నీడ'ను కల్పించి, ఆమెకూ ఓ దారి చూపించాడు. ఈరోజు గౌతమి తన కాళ్ళమీద తను నిలబడే స్థితికి చేరుకుంది''

అహల్య చాలాసేపటివరకూ మాట్లాడక పోవడంతో వంశీ అడిగాడు. "ఏవండోయ్ అహల్యగారూ! మీరు ఇంతకీ మాకు పార్టీ ఇస్తున్నారా? లేదా?"

ఆమె ఆలోచనలనుండి తేరుకుంది. "మీకు కాకపోతే ఇంకెవరికి ఇస్తాను సార్! తప్పకుండా మీకు మంచి పార్టీనే ఇస్తాను''

"థాంక్యూ''

అహల్య ఛాంబర్‌లోనుండి అవతలికెళ్ళిపోయింది.

అతడు సీట్లో వెనక్కువాలి రిలాక్స్ అవుతూ ఉండగా ఫోన్ మోగింది. రిసీవర్ చేతిలోకి తీసుకుని "హలో' అన్నాడు.

అవతలివైపునుండి సమన్విత గొంతు కంగారుగా వినిపించింది. "హలో వంశీ! ఇప్పుడే... ఇప్పుడే ఓ వార్త అందింది. అదే గౌతమి భర్తకు యాక్సిడెంట్ అయిందనీ, మోచేతివరకూ చెయ్యి తీసేశారని నిజమేకదూ?"

"నిజమే''

"మైగాడ్! రాత్రి నేను ఇంటికెళ్ళలేదు. నైట్ డ్యూటీ చేస్తూ హాస్పిటల్‌లోనే ఉండిపోయాను. ఇప్పుడే ఇంటికి రావటంతోనే రేణక్క చెప్పింది''

"అలాగా'' అన్నాడు అతడు చాలా కాజువల్‌గా.

"సరే! నేను ఓ పావుగంటలో ఆఫీసుకొస్తున్నాను. మనిద్దరం అక్కడినుండి హాస్పిటల్‌కి వెళ్దాం. ఏమంటావ్?"

అతడు కొద్దిసెకనులు నసిగాక చెప్పాడు. "నేను రాలేను సమన్వితా! అతడిని పరామర్శించదలచుకుంటే నువ్వెళ్ళు''





"అదేంటి?" అందామె ఆశ్చర్యంగా.

"మా మధ్య ఉన్న గొడవలు నీకు తెలిసిన వేకదా? అందుకే పరామర్శ పేరుతో వెళ్ళి అతడిని బాధపెట్టడంకన్నా, మనసులో బాధ నిపించినా వెళ్ళకపోవడమే మేలని నిర్ణ యించుకున్నాను. మా అమ్మ ఉద్దేశం కూడా అదే''

ఆమెకు అప్పుడే పరిస్థితి అర్థమయిన ట్టుంది. "ఓహెూ! అదా సంగతి? అందుకే కాబోలు, రేణుకక్కను రమ్మంటే రాలేనని తప్పించుకుందే తప్ప ఇలా చెప్పలేదు. అందులోనూ తను ఓసారి అతడిని పోలీసు లకు పట్టించిందికదా? అందుకే రావడానికి వెనుకడుగేస్తోంది. సర్లే! నేను అతడికి అంత గా తెలియదు కాబట్టి వెళ్ళి చూసివస్తాను... ఏమంటావ్?"

"అక్కడ మన విషయం ప్రస్తావించ కుండా, గౌతమి ఫ్రెండ్‌నని చెప్పుకుంటే మంచిదని నా అభిప్రాయం"

"అలాగే చెపుతాను'' అంది సమన్విత.

"ఒ.కే. హాస్పిటల్‌నుండి ఇక్కడికి వచ్చేందుకు ప్రయత్నించు''

"ప్రయత్నించడమేమిటి? రాబోతున్నా ను. ఎందుకంటే'' అని క్షణమాగి చెప్పింది. "వద్దులే. అక్కడికి వచ్చాకే చెపుతాను''

"సరే, ఉంటాను''

"అలాగే''

ఆమె ఫోన్ పెట్టేశాకే అతడు రిసీవర్ హుక్‌మీద ఉంచాడు.

ఆ తర్వాత అతికష్టంమీద ఆఫీసుపనిలో తలదూర్చాడు.

మధ్యాహ్నమవుతూ ఉండగా సమన్విత ఆఫీసుకొచ్చింది.

ఆమె తన ఛాంబర్‌లోకి రావటంతోనే అతడు అడిగిన మొదటిప్రశ్న "సత్యమూర్తికి ఎలా ఉంది?" అని!

సమన్విత అతడికి ఎదురుగా కుర్చీలో కూర్చుంటూ చెప్పింది. "ఉదయానికీ, మధ్యాహ్నానికీ పెద్ద మార్పేముంటుంది? చాలా దారుణంగా ఉంది పరిస్థితి. అందులోనూ పోయింది కుడిచెయ్యి కావడంతో, తన పనులు తను చేసుకోవటం కూడా కొంతకాలంపాటు కష్టమయిపోతుంది''

"పాపం" అన్నాడు వంశీ జాలిగా.

"అయితే నాకు ఆ గవర్నమెంట్ హాస్పిటల్ వాతావరణం చూస్తుంటే, ఏదోలా ఉంది. అక్కడున్న మనిషి నరకంలో ఉన్నట్టే భావిస్తాడు తప్ప మరోలా ఫీల్ కాలేడు''

అవును! ఒకప్పుడు తన తల్లికి యాక్సిడెంట్ అయినప్పుడు అది పోలీసుకేసు తాలూకు వ్యవహారం కాబట్టి కొద్దిరోజులపాటు ప్రభుత్వ ఆసుపత్రిలోనే ఉంచవలసివచ్చింది. ప్రభుత్వ ఆసుపత్రులు ఎలా వుంటాయో అన్నది అప్పుడే తనకు అనుభవపూర్వకంగా తెలిసింది.

"అంతేకాదు, అక్కడి డాక్టర్ల నిర్లక్ష్యం, వారి ట్రీట్‌మెంట్ పద్ధతులు చూస్తుంటే, అతిత్వరలో అతడి చెయ్యి సెప్టిక్ అయి ఆ కారణంగా భుజంవరకూ తీసేయాల్సివచ్చినా ఆశ్చర్యపోవలసిన అవసరంలేదని పిస్తోంది''

వంశీ టేబుల్‌మీద మరికాస్త ముందుకు వంగాడు. "నిజమే! ప్రభుత్వాసుపత్రులలో ట్రీట్‌మెంట్ అలాగే ఉంటుంది. కాని ఇది యాక్సిడెంట్ కేసు కాబట్టి ప్రభుత్వాసుపత్రిలో చేర్చక తప్పదుకదా?"

ఆమె చెప్పింది. "ఆల్‌రెడీ కేసు ఫైల్ అయిపోయింది. ఇప్పుడు మనం హాస్పిటల్ సూపరిండెంట్‌ని, పోలీస్ ఇన్‌స్పెక్టర్‌ని రిక్వెస్ట్ చేసుకుంటే ప్రైవేట్ హాస్పిటల్‌కి మార్చడానికి వీలవుతుంది''

అతడు కొద్దిసెకనుల మౌనం తర్వాత చెప్పాడు. "సరే! గౌతమితో ఓసారి మాట్లాడాక ఆలోచిద్దాంలే'

అంతలో ఆఫీస్‌బాయ్ లోపలికొచ్చి "సార్! కాఫీ, కూల్‌డ్రింక్ ఏవయినా తీసుకురా



వాలా?" అడిగాడు.

వంశీ ఏదో చెప్పబోతుంటే సమన్విత అతడిని వారిస్తూ చెప్పింది. "వంశీ! కాఫీ లాంటివేవీ వద్దు. నేనింకా లంచ్ చేయలేదు. మనం అలా ఏదయినా రెస్టారెంట్‌కి వెళ్దాం"

అతడు భుజాలెగరేశాడు. "సరే, అలాగే'' అంటూ ఆఫీస్‌బోయ్‌కేసి చూశాడు. అర్థం చేసుకున్నట్టుగా ఆ కుర్రాడు అవతలికెళ్ళిపోయాడు.

అరనిముషం తర్వాత అతడు లేస్తూ "పదా'' అన్నాడు.

ఇద్దరూ ఛాంబర్‌లోనుండి ఇవతలకు వచ్చారు.

రిసెప్షన్‌లో ఉన్న అహల్య వాళ్ళిద్దర్నీ చూసి పెదాలమీదకు చిరునవ్వు తెచ్చుకుంది. వారిద్దరూ కాబోయే భార్యాభర్తలని ఆమెకు తెలుసు.

లిఫ్ట్‌లో ఇద్దరూ కిందికి దిగుతున్నప్పుడు వంశీ ఆమెను అడిగాడు. "ఏదో విశేషం తీసుకుని వస్తున్నట్టు ఫోన్‌లో మాట్లాడావ్. ఇంతకీ ఆ విశేషమేంటో?"

"తొందర ఎందుకు? రెస్టారెంట్‌లో కూర్చున్నాక చెపుతాను''

లిఫ్ట్ గ్రౌండ్ ఫ్లోర్‌లో ఆగింది. ఇద్దరూ ఇవతలికొచ్చారు.

అది బిజీసెంటర్ కాబట్టి చాలా దగ్గరలోనే మంచి హోటల్స్ రెండు, మూడు ఉన్నాయి. అందువల్లే అతడు కారును తీయలేదు.

రోడ్డు పక్కనే నడుచుకుంటూ దగ్గరలో ఉన్న ఓ ఏ.సి. రెస్టారెంట్‌లోకెళ్ళారు వారిద్దరూ.

టేబుల్‌ముందు ఎదురెదురుగా కూర్చున్నాక అతడు కాస్త ఉత్సుకతగా అడిగాడు "ఇప్పుడయినా చెపుతావా ఆ విశేషమేమిటో?"





సమన్విత టేబుల్‌మీదకి వంగి మెల్లగా చెప్పింది. "మనం హనీమూన్ జరుపుకునేందుకు నాన్నగారు ఇప్పటినుండే ఏర్పాట్లు చేస్తున్నారు. మీరు ఏ దేశాలు చూడాలనుకుంటున్నారో కనుక్కోమని రాత్రి నాకు ఫోన్ చేశారు''

అతడు ఆమెమీదనుండి చూపులు మరల్చుకున్నాడు.

వంశీనుండి జవాబు రాకపోవడంతో, ఆమె కొద్దిక్షణాలు అయోమయంగా చూసింది. "వంశీ! ఎందుకు మాట్లాడవ్?" అంది.

"సమన్వితా! మనం... మన హనీమూన్ పేరుతో ఓ నెలరోజులపాటు మా అమ్మానాన్నలకు దూరంగా వెళ్ళడం అవసరమంటావా?"

అతడి గొంతులో పలికిన జీర ఆమె గుర్తించి చప్పున అతడి చెయ్యిమీద తన చెయ్యివేసింది. "నువ్వు అంత ఇబ్బందిపడుతూ రానవసరంలేదు. అయినా ఇందులో ఇబ్బంది పడవలసిన అవసరమేముంది?"

"నా బాధ అమ్మానాన్నల గురించి''

"వాళ్లను చూసుకోవడానికి గౌతమి ఉంది కదా?"

"గౌతమి ఇప్పుడు తన భర్త సేవలో మునిగిపోయింది. బహుశా రేపు ఆమె మనింట్లోనే ఉంటుందన్న నమ్మకం ఏముంది?"

ఆమెకు పరిస్థితి అర్థమయింది. సన్నగా నవ్వేసింది. "ఓహ్! దీని గురించి నువ్వింతగా బాధపడటం ఏమిటి? 'రాలేను' అని ఒక్కమాట అనేస్తే చాలు వంశీ..."

అతడు ఆమెకేసి విస్మయంగా చూశాడు.

"నేను నిన్ను బాగా అర్థం చేసుకున్నాకే ఈ పెళ్లికి ఒప్పుకున్నాను. నీకు ఆంటీ, అంకుల్ అంటే విపరీతమయిన ప్రేమ ఉందని, వాళ్ళ సేవకు లోపం రాకూడదనే ఇంతకాలం పెళ్ళి వాయిదా వేశావనీ తెలిశాక కూడా ఇప్పుడు వాళ్ళ సేవకు

అంతరాయం కలిగిస్తానని ఎలా అనుకున్నావ్? నాన్నగారికి ఈ రోజే ఫోన్‌చేసి నాకే విదేశాలకు వెళ్ళటం ఇష్టంలేదని చెప్పేస్తాను''

అది రెస్టారెంట్ కాకుండా తమ చుట్టూ జనాలు లేకుండా ఉండివుంటే అతడు ఆ క్షణం ఆమెను దగ్గరగా తీసుకుని నుదుటి మీద ముద్దు పెట్టుకుని ఉండేవాడే! తన మనసులో కలిగిన ఆ కోరికను అతడు బలవంతంగా నొక్కేశాడు.

సప్లయర్ దగ్గరగా వచ్చాక ఎగ్‌ఫ్రైడ్‌రైస్ ఆర్డరిచ్చింది.

అతడు వెళ్ళిపోయాక ఆమె వంశీతో చెప్పింది. "అన్నట్టు చెప్పడం మరిచాను. నాన్నగారు ఈ వారంలోనే హైదరాబాదు వస్తున్నారట. ఆయన వచ్చాక మీరు ఓ పూట తనతో ఉండేలా ముందుగానే ప్లాన్ చేసుకోమన్నారు''

"ఎందుకు?"

"ఆడపెళ్లివారు అబ్బాయికి, మగపెళ్లివారు అమ్మాయికి బట్టలు కొనివ్వడం ఆనవాయితీ కాబట్టి''

అతడికి అర్థమయింది. చిన్నగా నవ్వి "అలాగే'' అన్నాడు.

ఎగ్‌ఫ్రైడ్‌రైస్ తిన్నాక, ఐస్‌క్రీమ్ తెప్పించింది సమన్విత.

అవీ పూర్తయ్యాక బిల్లు చెల్లించి ఇద్దరూ బయటపడ్డారు.

సమన్విత ఆమె కారులో వెళ్ళిపోయాక వంశీ ఆఫీసులోకి నడిచాడు.

★ ★ ★

ప్రతిమనిషి 'సాగినంతకాలం తనంతటివాడు లేడు' అనే అనుకుంటాడు. అయితే ఊహించని సంఘటనలు అనుభవంలోకి వచ్చినప్పుడు లేదా గట్టిగా ఎదురుదెబ్బలు తగిలినప్పుడు ఎంతో కొంత రియలైజ్ అవుతాడు.

సత్యమూర్తి కలలో కూడా తనకు అలాంటి పరిస్థితి దాపురిస్తుందని అనుకోలేదు. ఎప్పుడయితే హాస్పిటల్‌లో స్పృహ వచ్చి, తన చెయ్యి తొలగించబడిందని తెలుసుకున్నాడో అప్పుడే సగం కుంగిపోయాడు. అయితే అప్పుడే ఎదురుగా గౌతమిని చూశాక ఆశ్చర్యపోయాడు.

ఆమె తనకు సేవ చేసేందుకే వచ్చిందని మాత్రం అతడు ఊహించలేదు. 'యాక్సిడెంట్ వార్త తెలియటంతోనే, ఏదో పరామర్శించి వెళ్ళేందుకే వచ్చిందని' అనుకున్నాడు.

గౌతమి ఆ మధ్యాహ్నం తనకేమీ చెప్పకుండానే వెళ్ళిపోయాక అతడికి కంగారేసింది. అసలే చెయ్యిలేదు. దానికితోడు బెడ్ మీదనుండి దిగే వీలులేదు. ఇప్పుడు తనకు కావలసిన పనులన్నీ ఎవరు చేసిపెడతారు?

అతడు తనవాళ్ళు అనుకున్నవాళ్ళందరినీ గుర్తు చేసుకున్నాడు. నిజానికి ఏ మనిషికయినా తనవాళ్ళు గుర్తుకొచ్చేది అలాంటి సమయంలోనే. అతడికి ఆ సమయంలో తనవాళ్ళు అనుకునేందుకు ఎవ్వరూ తోచలేదు. చివరికి తను మందు తాగేవేళ పక్కన కూర్చుని మాటలు చెప్పే కొలీగ్స్ ఒకరిద్దరు గుర్తొచ్చారు.

సత్యమూర్తికి చిరుఆశలాంటిది కలిగింది. అతడు పక్కబెడ్ పేషెంట్‌ను చూసేందుకు వచ్చిన విజిటర్‌ని బతిమలాడి తన ఆఫీసుకు ఫోన్ చేయించాడు.

ఫోన్ చేసి వచ్చాక ఆ వ్యక్తి అతడితో చెప్పాడు. "మీ ఆఫీస్ స్టాఫ్ సాయంత్రం మిమ్మల్ని చూడడానికి వస్తున్నారటండీ. మీరు చెప్పిన ఆ వ్యక్తులు అందరితో కలిసి సాయంత్రం వస్తారట"

అతడిలో కొట్టుమిట్టాడుతున్న చిరు ఆశ ఎగిరిపోయింది.

ఇప్పుడు ఏమిటి తన పరిస్థితి? దిక్కుమొక్కులేని అనాథలా ఈ హాస్పిటల్‌లో పడి ఉండవలసిందే. సేవల సంగతి పక్కన



పెట్టినా, కనీసం మాట్లాడేందుకు కూడా లోటు లేకుండా గడపవలసిందేనా?

మనిషికి మనిషి ఎంత అవసరమో అత డికి ఆ సమయంలో అర్థమయింది. ఒంటరి తనం ఎంతటి శాపమో తనకు తెలిసొచ్చింది.

బహుశా చాలామంది మగాళ్ళు ఆడవాళ్లు ఒంటరితనంతోపడే బాధ గురించి అర్థం చేసుకోలేరు. ఉదయం ఆఫీసుకు వెళ్ళిన భర్త సాయంత్రం ఇంటికి రాగానే తనతో కాసేపు మాట్లాడతాడని ప్రతి ఇల్లాలూ ఎదురుచూస్తుంది. కాని చాలామంది మగాళ్లకు ఆఫీసు వదిలాక ఇంట్లో ఓ ఆడది తన కోసం ఎదురుచూస్తుంటుందన్న ఆలోచనే రాదు. కబుర్లు, షికార్లు ముగించుకుని భోజనం వేళకు ఇంటికి చేరుకుంటారు. భోజనం ముగియగానే బెడ్ ఎక్కి గుర్రుపెట్టి నిద్రపోతారు.

ఇక తనలాంటి తాగుబోతుల గురించి అసలు చెప్పక్కర్లేదు. తాగుబోతు మొగుడు కోసం ఎదురుచూసే ఇల్లాలి పరిస్థితి చాలా దారుణంగా ఉంటుంది. అతడు ఇంటికొచ్చే వేళ తెలియదు. అసలు ఇంటికొస్తాడో, రాడో అర్థం కాదు. ఒకవేళ వస్తే లోపలికి వస్తాడులే నిద్రపోదామనుకుంటే, వాకిలివరకూ వచ్చిన మొగుడు లోపలికి రాలేక రోడ్డుమీదే పడి నిద్రపోతాడని భయం. ఆడదాని బతుక్కి అదో నరకంలాంటి స్థితి... తప్పని పరిస్థితి!

మరి ఇంతకాలం గౌతమి ఇలాంటి బాధలు ఎలా భరించిందో? దానికితోడు అనుమానంతో తను పెట్టిన చిత్రహింసలు?!

సత్యమూర్తి మనసు పొరల్లో ఎక్కడో కదలిక మొదలయింది.

అంతకుమించి తన ప్రస్తుత పరిస్థితి గురించి భయం కూడా కలిగింది. అయితే అప్పుడే బ్యాగ్‌లో ఏవో పెట్టుకుని వస్తున్న గౌతమి కనిపించడంతో అతడు స్థిమితపడ్డాడు. ఆమె మళ్ళీ వస్తుందని అనుకోకపోవడంతో ఆశ్చర్యపడ్డాడు.

క్షణాల్లో అతడు మునుపటి సత్యమూర్తిలా మారిపోయి "ఎక్కడికెళ్ళావ్?" కరకుగా అడిగాడు.

ఆమె జవాబు చెప్పలేదు. కనీసం అతడికేసి తలతిప్పయినా చూడలేదు. తను ఇంటి నుండి తెచ్చిన పళ్లరసం తీసుకునే గిన్నె, టవల్స్, బెడ్‌షీట్స్, గ్లాసులు తీసి పక్కన పెడుతోంది.

"అడుగుతుంటే జవాబు చెప్పవేంటి? ఎక్కడికెళ్ళావ్?" ఈసారి అతడు అరిచిన శబ్దానికి పక్క బెడ్‌ల పేషెంట్స్ తలతిప్పి అటు చూశారు.

గౌతమి తలతిప్పి అతడికేసి చూసింది. ఆమె కళ్ళు అతడి కళ్ళలోకి సూటిగా చూశాయి. నీ ప్రశ్నకు జవాబు చెప్పవలసిన అవసరం నాకేంటి? అన్న భావం ఆమె కళ్లల్లో చూసి అతడు ఉలిక్కిపడ్డాడు.

'నిజమే! తన ప్రశ్నకు జవాబు చెప్పవలసిన అవసరం ఆమెకు లేదు. ఎందుకంటే తనేం ఆమెను పోషించడంలేదు. భర్తగా తన బాధ్యతను నిర్వర్తించటమూ చేయట్లేదు. మరి అలాంటప్పుడు ఆమె తనను ఎందుకు గౌరవించాలి? మరెందుకు మాట్లాడాలి?

అప్పటికీ ఏమనుకుందో ఏమో ఆమె జవాబు చెప్పింది. "స్నానంచేసి వచ్చేందుకు ఇంటికెళ్ళాను''

ఆ సమాధానంతో అతడు పరమానందభరితుడయ్యాడు.

మర్నాడు ఉదయం గౌతమి ఇంటికెళ్ళినప్పుడు, వంశీకృష్ణ సమన్విత తనతో అన్న మాటలు ఆమెకు చెప్పాడు. గవర్నమెంట్ ఆసుపత్రిలో ట్రీట్‌మెంట్‌వలన సత్యమూర్తి త్వరగా కోలుకోలేడని సమన్విత అంటోంది. మీరు ఒప్పుకుంటే అతడిని తమ హాస్పిటల్‌లోకి షిఫ్ట్ చేయిస్తానని చెప్పింది.

గౌతమి తలెత్తి అతడి కళ్లలోకి చూస్తూ "మీకు... మీకు సత్యమూర్తిమీద కోపంగా




లేదా?" ప్రశ్నించింది.

అతడు వెంటనే అడిగాడు "ఎందుకు?"

"ఆయనవల్ల నేను కష్టాలు పడ్డాను. మీరూ అవమానాలు పొందారు''

ఈసారి అతడు నవ్వాడు. "అవన్నీ మనసులో ఉంచుకుని ఎదుటివ్యక్తి కష్టపడుతూ ఉంటే సహాయం చేయగలిగేస్థితిలో ఉండి కూడా చేయకపోవటం మానవత్వం అనిపించుకోదు''

అతడి మానవతా దృక్పథానికి చేతులెత్తి నమస్కరించాలనిపించింది ఆమెకు. అప్పటివరకూ తన మనసులో తను చాలా మానవతావాదిలా భర్తకు సేవచేస్తున్నానన్న ఫీలింగ్ ఉండి ఉంటే, దాన్ని పూర్తిగా చెరిపేసింది. మెల్లగా తలాడిస్తూ "మీ ఇష్టం" అంది.

ఆరోజే సత్యమూర్తిని ప్రభుత్వ ఆసుపత్రి నుండి ఖరీదయిన ప్రైవేట్ హాస్పిటల్‌కి మార్చారు.



కాకినాడనుంచి సత్యమూర్తి అన్నావదినలు అతడిని పరామర్శించడానికి వచ్చారు.

వాళ్ళను చూడడంతోనే సత్యమూర్తికి ప్రాణం లేచొచ్చినట్టనిపించింది. తనకూ తన వాళ్ళు ఉన్నారన్న ఆశ చిగురించింది.

"అన్నయ్యా నేను మీకు ఫోన్ చేయించి మూడు రోజులయితే ఇప్పుడా రావడం?" అప్పటికీ అతడు కాస్త నిష్ఠూరంగానే తన అన్నగారయిన కృష్ణమూర్తిని అడిగాడు.

"ఏం చేయనురా. నాకేమో వెంటనే రావాలనిపించింది. కాని అన్నీ సర్దుకుని వచ్చేసరికి మూడోరోజయింది'' కాస్త బాధపడుతూనే చెప్పాడు కృష్ణమూర్తి.

"సర్లే! ఎలాగయితేనేం, కాస్త వెనకో ముందో వచ్చావ్. అదే సంతోషం" అన్నాడు సత్యమూర్తి.

నిజానికి అతడికి మనసు మూలల్లో ఎక్కడో గౌతమిపట్ల కోపం కదలాడుతూనే ఉంది. అంతకుమించి ఇలాంటి కష్టసమయంలో ఆమే దిక్కుగా భావించి సేవలు చేయించుకోవడం, అది తన ఓటమిగా భావిస్తున్నాడు అతడు.

ఇప్పుడు తనవాళ్ళు వచ్చేశారు. ఇక గౌతమి అవసరం తనకు లేదు. 'చేసిన సేవలు చాల్లే పోవే' అని తిట్టేయొచ్చు. ఆమె తన దగ్గరకు రాకుండా వెళ్ళగొట్టొచ్చు.

అతడి మనసు పొరల్లో కదలిక తనవాళ్లను చూడడంతోనే ఆగిపోయింది. కొంత మంది మనష్యుల మనస్తత్వం అంతే. కొన్ని సందర్భాలలో తన ప్రవర్తన మార్చుకోవాలని అనుకుంటారు. కాని పరిస్థితి తమకు అనుకూలం కాగానే ఎప్పటిలా ప్రవర్తించడం మొదలుపెడతారు.

అందులోనూ సత్యమూర్తిది కరడుగట్టిన కఠిన మనస్తత్వం. అవతలివ్యక్తిని అనుమానించడం, శాడిజంతో హింసించడం అతడి అలవాటు. సిగ్గుపడగలిగిన విషయాలు కూడా అతడు సిగ్గెగ్గులు లేకుండా మాట్లాడగలడు. తప్పొప్పుల మధ్య విచక్షణాజ్ఞానం గుర్తించటం అతడు ఎప్పుడో మరిచిపోయాడు.

అలాంటి ఆ వ్యక్తి అంత సులభంగా ఎలా మారగలడు?

కృష్ణమూర్తి ఆయన భార్య నీరద సత్యమూర్తికి యాక్సిడెంట్ ఎలా అయిందో తెలుసుకున్నారు. కొద్దిసేపు జాలి కనపరుస్తూ మాట్లాడారు.

ఇంతలో గౌతమి వారిద్దరికీ కాఫీ అందించింది. వారిద్దరూ ఆమెకేసి కొద్దిక్షణాలపాటు తదేకంగా చూశారు.

సత్యమూర్తి తాగుడు గురించీ, అతడు భార్యను హింసించటం గురించీ వాళ్ళకు తెలుసు. ఈమధ్యకాలంలో ఆమె అతడిని వదిలేసి, పక్కింటివాళ్ళ సహాయంతో చదువు పూర్తిచేసుకున్నదనీ విన్నారు.

కృష్ణమూర్తికి అతడు తోడబుట్టిన తమ్ముడే కావచ్చు. కానీ తన మరదలు తమ్ముడిని వదిలేసి వెళ్ళిపోయిందని తెలిసినప్పుడు ఆయన బాధపడలేదు. 'పోనీలే! ఆ పిల్ల కష్టాలనుండి తప్పించుకుంది' అని సంతోషపడ్డాడు.

నిజానికి ఇప్పుడు కూడా ఆయనకు హైదరాబాద్‌వరకూ రావడం అసలిష్టంలేదు. కాని ఎంతయినా రక్తసంబంధం! జరిగిన ప్రమాదం తీసిపారేయదగినంత చిన్నదేం కాదు. అందువల్లే ఆయన తప్పనిసరై అక్కడికి వచ్చాడు.

కాఫీ అందించాక గౌతమి ఆ గదిలోనుండి బయటకు వెళ్ళిపోతుంటే, నీరద ఆప్యాయంగా అడిగింది. "ఏమ్మా గౌతమీ! బాగున్నావా?"

ఆమె జవాబు చెప్పబోయేంతలో సత్యమూర్తి అందుకుని చెప్పాడు. "తనకేంలే వదినా! గొప్పోళ్ళ అండ దొరికిందికదా? బాగానే ఉంది. అయినా మొగుడిని వదిలేసిన ఏ ఆడదయినా ఆనందంగానే ఉంటుందని నా ఉద్దేశం"

మరిదిని చూస్తుంటే నీరదకు 'చింత చచ్చినా పులుపు చావదు' అన్న సామెత గుర్తుకొచ్చింది.

గౌతమి మాత్రం మౌనంగా అతడి ముఖంలోకి కొద్దిక్షణాలు తదేకంగా చూసింది.

ఆ చూపుల్లో కోపం లేదు. అసహ్యం, జాలి కదలాడడంలేదు. భావరహితమైన చూపు.

నిజానికి ఆ చూపు చాటున దాగిన ఆమె మనసు అర్థం చేసుకునే శక్తి అతడికి లేదు. అందువల్లే ఆమె చూపు చూడటంతోనే అతడు తడబడ్డాడు. అయినా తమాయించుకుని "ఏంటే అలా చూస్తున్నావ్... పో! అవతలికి'' అన్నాడు దబాయింపుగా.

గౌతమి మెల్లగా తలతిప్పుకుని అవతలికెళ్ళిపోయింది.

తన తమ్ముడి ప్రవర్తనకు కృష్ణమూర్తి నొచ్చుకున్నాడు. "అదేంట్రా. అమ్మాయిని అలా అంటావ్?" అన్నాడు కాస్త కోపంగానే.

"నన్ను వదిలేసి వెళ్ళిపోయిన ఆడదాన్ని మరేమనాలి? దగ్గరకు పిలిచి ముద్దెట్టుకోవాలా?" అన్నాడు పక్కనే వదినగారు ఉన్నారన్న ధ్యాస కూడా లేకుండా.

నీరద మరిది కుసంస్కారాన్ని మనసులోనే తిట్టుకోసాగింది.

కృష్ణమూర్తి అడిగాడు. "అమ్మాయి నిన్ను వదిలేసి ఎందుకెళ్ళిపోయిందిరా?"

"ఒళ్ళు కొవ్వెక్కి'' వెంటనే పలికాడు సత్యమూర్తి.

"ఈ ప్రపంచంలో ఒళ్ళు కొవ్వెక్కి మొగుడిని వదిలి వెళ్ళిపోయే ఆడవాళ్ళు ఒకటీ అరా తప్ప ఎక్కువగా ఉండరురా''

"అంటే?"

"గౌతమి వళ్ళు కొవ్వెక్కి నిన్ను వదిలి వెళ్ళిపోలేదని నా నమ్మకం. అలా వెళ్ళిన ఆడదే అయితే కష్టాలలో ఉన్న నిన్ను చూసి కరిగిపోయి, మళ్ళీ వచ్చి నీకు సేవలు చేయదు. అర్థమయిందా?"

తన అన్నగారు కూడా గౌతమిని సమర్థించడంతో అతడు కొద్దిగా తగ్గాడు. వెంటనే టాపిక్ మార్చేస్తూ చెప్పాడు. "సర్లే అన్నా! ఆ మనిషి గొడవ మనకెందుకుగానీ, హాస్పిటల్‌లో నాకు బాగా ఇబ్బందయిపోతోంది. వదినగారిని ఇక్కడ వదిలివెళ్తే ఓ పదిరోజుల తర్వాత నేనే రైలెక్కించేస్తాను. ఏమంటావ్?"

నీరద కంగారుగా భర్త ముఖంలోకి చూసింది. కృష్ణమూర్తి అప్పుడే తలతిప్పి భార్య ముఖంలోకి చూశాడు. భార్య ముఖంలోని కంగారు ఆయనకు స్పష్టంగా తెలుస్తూనే ఉంది.

"నిన్ను చూసుకునేందుకు గౌతమి ఉంది కదరా! ఇంకా మీ వదిన ఇక్కడ ఎందుకు?"

"దాన్ని వదిలించుకుందామని''




ఆయన దీర్ఘంగా నిట్టూర్చాడు. "అలాగా'' అన్నాడు. చాలాసేపటి తర్వాత తల విదిలిస్తూ "కాని మీ వదిన ఇక్కడ ఉండడం వీలుకాదురా'' చెప్పాడు.

సత్యమూర్తి అపనమ్మకంగా అన్నగారి కేసి చూశాడు. "ఎందుకని?"

"పిల్లలకి త్వరలో ఎగ్జామ్స్ మొదలు కాబోతున్నాయి. వాళ్ళకు నా భయంకన్నా వాళ్ళ అమ్మ భయమే ఎక్కువ. ఇప్పుడు వాళ్ళను వదిలేస్తే ఓ సంవత్సరం వృధాగా పోతుంది. అదీగాక వాళ్ళకు వండి వార్చిపెట్టడం నా వల్ల కాదు. అందుకని'' అంటూ నసిగాడు.

సత్యమూర్తి కొద్దిక్షణాలపాటు మాట్లాడలేకపోయాడు. తన అన్నగారు అలా అనగలడని ఊహించకపోవడంతో తేరుకునేందుకు చాలా సమయం పట్టింది.

అప్పుడే అతడు భయంగా అటుఇటు చూశాడు. వదిన ఉంటే ఆమెను తరిమేస్తానని తను అన్నమాట గౌతమి విన్నదేమోననే అతడి భయం. ఆ మాట విని ఆమె ఇప్పుడే వెళ్ళిపోతే, ఆ తర్వాత తన పరిస్థితి మరీ దారుణంగా తయారవుతుంది. కాని అదృష్టవశాత్తు ఆమె పరిసరాల్లో కనిపించలేదు. అతడు తేలికగా ఊపిరి పీల్చుకున్నాడు.

అయితే కారిడార్‌లో కూర్చుని ఉన్న గౌతమికి లోపలి సంభాషణ వినిపిస్తూనే ఉందన్న విషయం అతడికి తెలియదు.

ఆ మాటలు వింటున్న ఆమెకు కోపం రాలేదు. తన భర్త నైజం ఇంకా మారలేదని మాత్రమే అర్థం చేసుకుంది. అంతేకాదు, అతడు మారతాడన్న నమ్మకం కూడా ఆమెకు లేదు.

సత్యమూర్తి నెమ్మదిగా "సర్లే అన్నయ్యా! వీలు కానప్పుడు మీరు మాత్రం ఏం చేయగలరు?" అన్నాడు. నిజానికి తను అంతకన్నా అనగలిగింది మరేంలేదని తెలిసిపోయింది.

ఆ మధ్యాహ్నంవరకూ హాస్పిటల్‌లోనే ఉండేసరికి, వాళ్ళకు బోర్‌కొట్టినట్టుంది. "సత్యం! హాస్పిటల్‌లో ఎంతసేపని కూర్చుని ఉంటాం? మేమిద్దరం అలా వెళ్ళి కాసేపు సిటీలో తిరిగొస్తాం" చెప్పాడు కృష్ణమూర్తి.

తను చెయ్యి పోగొట్టుకొని హాస్పిటల్‌లో ఉంటే, కాస్త తోడుగా ఉండి మరికొంత సహాయం చేస్తారనుకుంటే, మధ్యాహ్నానికే బోరుకొట్టి 'షికార్లు' చేస్తామంటున్న తన అన్నగారిని చూసి కోపం వచ్చింది. అయినా తమాయించుకుని "సరే' అన్నాడు కాసింత చిరాకుగానే.

కృష్ణమూర్తి నీరదలు అతడి చిరాకు గురించి పట్టించుకోలేదు. హుషారుగా హాస్పిటల్‌నుండి బయటపడ్డారు.

అతడు తిరిగి వంటరి!

అప్పుడే అతడికో నిజమూ అర్థమయింది. ఓ మగాడికి పెళ్ళయిన తర్వాత అన్నావదిన, చెల్లి, స్నేహితుడు ఎవ్వరూ... ఎవ్వరూ ఎక్కువ సమయం అతడికి తోడుగా ఉండలేరు. అలా అన్నివేళలా నీడలా కనిపెట్టుకుని ఉండగలిగేది అతడి భార్య మాత్రమే!

అయితే ఆ నిజాన్ని ఇప్పటికీ జీర్ణం చేసుకోలేకున్నాడు. తరతరాలుగా మగాడిలో జీర్ణించుకుపోయి ఉన్న అహం అతడిలో ఎక్కువ శాతంలోనే ఉంది. అతడు ఆ అహంనుండి బయటపడలేకపోతున్నాడు. 'మగాడికి కష్టాలలో భార్య మాత్రమే దిక్కు' అని. అనుకోవడమే అతడికి కష్టంగా ఉంది.

'నిన్నా మొన్నటివరకూ తను తిట్టినా, కొట్టినా, చిత్రహింసలు పెట్టినా ఏడుస్తూ మూలపడి ఉన్న ఆడది, తనను ఎదిరించి వెళ్ళిపోవటమే కాకుండా చదువుకుని తనకన్నా పైస్థితిలో ఉండటమే బాధాకరం అయితే, ఇప్పుడు తనమీద ఆమె సానుభూతి ప్రదర్శించే స్థితిలో తను ఉండడం. ఛీఛీ! ఇంతకన్నా చనిపోవటమే మేలనుకున్నాడు' అతడు. కాని సమస్యలను తట్టుకోలేక చని

పోవడానికి కూడా కొంత ధైర్యం కావాలేమో! ఆత్మహత్య చేసుకునే ధైర్యం తనకు లేదని అప్పుడే అతడికి అర్థమయింది.

అందువల్లే, భయం మరింత పెరిగింది. ఓ గంటనుండి గౌతమి తనకు కనిపించ టంలేదు. అంటే, తన మాటలు విని బాధప డి, ఆమె వెళ్ళిపోయిందా? 'అతడు జీవి తంలో తొలిసారి తననుతాను తిట్టుకున్నాడు. మాటలు మనసును గాయపరిస్తే ఫలితం ఇలా కూడా ఉండొచ్చు' అన్న పరిస్థితిని అవగాహన చేసుకోసాగాడు.

మరోగంట తర్వాత గౌతమి రూమ్‌లోకి రావటం చూసి స్థిమితపడ్డాడు. తలమీద నుండి పెద్దభారం దిగిపోయినట్టనిపించింది.

అతడు నిన్నటిలా కోపంగా ప్రశ్నించలే దు. జీవితంలో మొట్టమొదటిసారి ఆమెతో మృదువుగా మాట్లాడాడు "ఎక్కడికెళ్ళావ్ గౌతమి?"

"ఇంటికెళ్ళి స్నానం చేసి వస్తున్నాను'' అతడు అంత నెమ్మదిగా మాట్లాడడంతో ఆమె అప్రయత్నంగానే జవాబు చెప్పింది.

ఆమె జవాబు అతడి మదిని పులకరింప చేసింది. తను ఆప్యాయంగా అడిగితే, ఆమె ఆనందంగా జవాబు ఇస్తుందని తెలిసింది.

అతడు మరేం మాట్లాడలేదు.

సిటీలో షికారుకెళ్ళిన కృష్ణమూర్తి, నీరద లు సాయంత్రం తిరిగొచ్చారు. రావటంతో నే అతడితో చెప్పాడు కృష్ణమూర్తి "బస్సుకి రిజర్వేషన్ తెచ్చేసుకున్నానురా సత్యం"

అతడు విస్మయంగా అన్నగారికేసి చూశా డు. "అదేంటి అన్నయ్యా! వచ్చినరోజే వెళ్ళి పోవటం?" ప్రశ్నించాడు.

"ఇక్కడ ఉండి మాత్రం చేసేదేముందిరా? అందులోనూ హడావుడిగా రావటంతో ఎక్క డిపనులు అక్కడే వదిలేసి వచ్చాం. పిల్లలూ మా కోసం ఎదురుచూస్తూ ఉంటారు''





అతడు ఏదో అనబోయి ఆగిపోయాడు. "సరే అన్నయ్యా'' అన్నాడు కొద్దిక్షణాల తర్వాత తలూపుతూ.

ఆ రాత్రి ప్రయాణమై వెళ్ళిపోయేముందు కృష్ణమూర్తి తమ్ముడికి దగ్గరగా కూర్చున్నా డు. అటుఇటు చూసి ఆడవాళ్ళిద్దరూ దగ్గ రలో లేకపోవడంతో చెప్పాడు.

"చూడు సత్యం! వయసొచ్చాక నువ్వు చేస్తూ వస్తున్న తప్పుల్ని చూస్తూ మంది లించానే తప్ప నిన్ను మార్చలేకపోయాను. ఇప్పుడు కూడా నా మాటలు నిన్ను మారుస్తా యని నేను భ్రమపడడంలేదు. కాని చెప్పటం నా ధర్మంగా భావించి చెబుతున్నాను. జీవితం అంటే వళ్ళు తెలియకుండా తా గడం, పెళ్ళాన్ని కొట్టడం, తిట్టడం అని ఇప్పటికీ నువ్వు భ్రమలో ఉన్నట్టుంది. నిజా నికి జీవితం అది కాదురా సత్యం. జీవితం అంటే ఏదో సాధించడం! తనకు ఉన్నంతలో భార్యాబిడ్డలను సంతోషంగా ఉండేలా చే యడం!! సమాజంలో తను గొప్పవాడిగానో లేదా మంచివాడిగానో పేరు తెచ్చుకోవడం!! నేనిప్పుడే నీ కొడుకును చూసివస్తున్నాను. వాడిది తల్లి పోలిక. ఎంత ముద్దొస్తున్నాడో తెలుసా? మీ వదినకయితే వాడిని వదలాల నే అనిపించలేదు. గౌతమి ఒప్పుకుంటే వాడిని తీసుకెళ్ళిపోవాలన్నంతగా నచ్చేశా డు వాడు. మందు మనిషిని మత్తులో ముంచి ఆనందపెడుతుంది. కాని పసిపిల్లలు మనల్ని మత్తులో ఉంచకుండానే మరెంతో ఆనందంగా ఉండేలా చేయగలరు. ఇంకో విషయం! కాలం కోల్పోతే తిరిగిరాదు. అలా గే ఒక్కోసారి దూరమయిన మనుష్యులు ఇక జీవితంలో ఎప్పటికీ కలవకపోవచ్చు. నాకు తెలిసి గౌతమి ఇప్పటికీ నీ మనిషిగానే ఉంది. ఆమెను ఇప్పుడు దూరం చేసుకుంటే ఇక ఎప్పటికీ ఆమె నీకు దగ్గర కాలేకపోవ చ్చు. నిజం చెప్పాలంటే అలాంటి అమ్మాయి నీకు దొరకడం, నీ పూర్వజన్మ సుకృతం..."

ఆడవాళ్ళిద్దరూ లోపలికొస్తూ ఉండడంతో ఆయన మాటలాపేశారు.

సత్యమూర్తి అన్నగారి మాటలు ఆసక్తిగానే విన్నాడు. అయితే అతడి ఆలోచన మాత్రం ఒక్కచోటే ఆగిపోయింది. 'తనకు ఓ కొడుకున్నాడు. వాడు ముద్దొచ్చేలా ఉంటాడు'

అప్పుడే అతడికి తన కొడుకును చూడాలన్న కోరిక కలిగింది.

మరికొద్దిసేపటి తర్వాత కృష్ణమూర్తి నీరదలు సెలవు తీసుకుని వెళ్ళిపోయారు.

ఆ గదిలో వారిద్దరూ... భార్యాభర్తలిద్దరే మిగిలారు.



**టి**ఫిన్ ఛేశాక కాస్త టైమ్ దొరకటంతో వంశీకృష్ణ ఇంటికి రింగ్‌చేసింది సమన్విత. అరనిముషం రింగ్ అయ్యాక అవతలివైపు నుండి "హలో'' అంది పార్వతమ్మ.

ఆమె ఫోన్ లిఫ్ట్ చేస్తుందని ఊహించకపోవడంతో కాస్త తడబడి, వెంటనే తేరుకుని "నేను ఆంటీ! సమన్వితను'' చెప్పింది సమన్విత.

"ఆc!... సమన్వితా! ఏమిటమ్మా విశేషాలు?"

"ఏంలేదాంటీ, కాస్త తీరిక దొరకడంతో ఫోన్ చేశాను. విశేషాలేమీలేవు''

"విశేషాలేమీ లేవుగానీ, కబుర్లు మాత్రం చెప్పాలనిపించిందన్నమాట"

"అది... అది..."

ఏం చెప్పాలో ఆమె ఆలోచించుకునేలోపే పార్వతమ్మ నవ్వుతూ పలికింది. "కబుర్లు చెప్పాలనిపించింది నాకు కాదులే కోడలు పిల్లా! నీక్కు కాబోయే శ్రీవారికేగా! ఉండు వంశీని పిలుస్తాను''

అరనిముషం తర్వాత వంశీ లైన్‌లోకొచ్చాడు "హలో''

"నేను సమన్వితను''

"చెప్పు సమన్వితా!"

"ఆంటీ దగ్గరలో ఉందా?"

"లేదు. పనేం లేకపోయినా పని కల్పించుకుంటూ వంటగదివైపు వెళ్ళింది''

"ఇంతకీ విషయం ఏమిటంటే- ఈరోజు మధ్యాహ్నం వరకూ హాస్పిటల్‌కి వెళ్ళక్కర్లేదు. ఇంట్లో మహాబోరుగా ఉంది''

సమన్విత చాలాసేపు మాట్లాడే ఉద్దేశ్యంతో ఉందని అర్థంకావడంతో, అతడు రిసీవర్ పట్టుకుని అక్కడే ఉన్న కుర్చీలో కూర్చున్నాడు "అయితే ఏంచేద్దామంటావ్?"

"ఈరోజు ఆఫీస్‌కి వెళ్లటం మానేయకూడదూ? ఏదయినా సినిమాకు మార్నింగ్‌షోకెళ్దాం. హోటల్‌లో లంచ్ తీసుకుని అటు నువ్వు ఆఫీసుకు, ఇటు నేను హాస్పిటల్‌కి వెళ్ళిపోవచ్చు... ఏమంటావ్?"

"మనం స్టూడెంట్స్‌మి కాదంటాను''

"అదేంటి?"

"గర్ల్‌ఫ్రెండ్‌కి బోర్‌కొట్టిందని నేను ఆఫీసు మానేయడం, నాకు బోర్‌కొడితే నువ్వు చేయాల్సిన ఆపరేషన్‌ని వాయిదావేసి నాతో సినిమాకు రావడం... ఇలాంటివి మనలాంటివాళ్ళు చేయదగిన పనులు కాదంటాను''

"అబ్బా! సినిమాకెళ్దామంటే, సీరియస్‌గా లెక్చర్ ఇచ్చేస్తున్నావేంటి?"

"ఈరోజు సినిమా మాట మరోసారి మాట్లాడితే, అక్కడికి వచ్చి ఏకంగా క్లాసే తీసేసుకుంటాను'' అతడు నవ్వాడు.

"పోనీ ఆ పనిచేయండి... మీరిక్కడికి వస్తే, కాసేపు మాట్లాడుకోవచ్చు''

అప్పటివరకూ చిలిపిగా మాట్లాడుతున్న అతడు, తన చిలిపితనం కట్టిపెట్టి గొంతులో కి సీరియస్‌నెస్ తెచ్చుకుంటూ చెప్పాడు "సారీ సుమన్వితా! ఈరోజు ఇద్దరు బిల్డర్స్‌తో ఇంపార్టెంట్ మీటింగ్ ఉంది. లేక పోతే ఖచ్చితంగా నిన్ను ఎంటర్‌టైన్ చేసేందుకు వచ్చి ఉండేవాడిని''

అతడి మూడ్ అర్థంచేసుకున్నాక ఆమె నవ్వేసింది. "భలేవారే! బిజీగా లేరేమోనను కుని పిలిచానే తప్ప, పని చెడగొట్టుకుని రమ్మనడంలేదు... ఓకే. నేను రేపు ఫోన్ చేస్తాను''

"ఫర్వాలేదు. ఆఫీసుకి వెళ్లడానికి ఇంకా చాలా టైమ్ ఉంది. ఏదయినా మాట్లాడు దు'' నిజానికి అతడికి కూడా ఆమెతో ఎక్కు వసేపు మాట్లాడాలనే అనిపిస్తూ ఉంటుంది.

"ఏం మాట్లాడను?"

అప్పుడే అతడికి గుర్తుకొచ్చింది. "అన్నట్టు అడగడం మరచిపోయాను. సత్యమూర్తి పరిస్థితి ఎలా ఉంది?"

"గౌతమిని అడగలేదా?"

"అడుగుతూనే ఉన్నాను. కాని ఓ డాక్టర్ గా నీ ద్వారా తెలుసుకోవడం వేరుకదా?"

సమన్విత నవ్వి చెప్పింది. "చాలావరకు కోలుకున్నాడు. మరో రెండుమూడురోజులలో డిశ్చార్జ్ చేసేయొచ్చు''

"గాయం?"

"మానడానికి కొంత టైమ్ పడుతుంది. కానీ దానికోసం హాస్పిటల్‌లో ఉండనవస రంలేదు. ఇంటికెళ్ళిపోయి వారానికి ఓసారి హాస్పిటల్‌కి వచ్చి చెకప్ చేయించుకుని వెళ్తే చాలు''

"మొత్తంమీద అతడి పట్ల ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నావ్''

"అందుకు కారణం గౌతమి. ఆమె పట్ల నాకు కలిగిన అభిమానం. అంతే''

"కాని దురదృష్టం ఏమిటంటే ఆమె మంచితనాన్ని సత్యమూర్తి గుర్తించలేకపోతు న్నాడు'' అతడు నిట్టూర్చాడు.

సమన్విత వెంటనే అంది. "మీకో విషయం చెప్పనా?"

"ఏంటి?"

"ఒక డాక్టర్‌గా నేను గత కొద్దిరోజులుగా సత్యమూర్తిని తరచుగా కలుసుకుంటున్నా ను. అంతకుముందు అతడు నాకు పరి చయం లేకపోయినప్పటికీ మీరు చెప్పిన ఒకప్పటి మనిషికీ, ఈ మనిషికీ మధ్య చాలా తేడా కనిపిస్తోంది. అతడి కళ్ళల్లో మెల్లమెల్లగా ఏదో మార్పు చోటుచేసుకోవడం నేను గమనిస్తూనే ఉన్నాను. బహుశా అది పశ్చాత్తాపం కావచ్చని నా నమ్మకం"

అతడు నవ్వి చెప్పాడు. "సత్యమూర్తి గురించి నీకు పూర్తిగా తెలియదు సమన్వి తా! అతడు మూర్ఖుడు. అతడికి తన మీద యినా తనకు నమ్మకం ఉందో లేదోనన్న అనుమానం నాకుంది! 'మూర్ఖుల మనసు మార్చటం అంత సులభం కాదని' సుమతీశ తక రచయిత ఎప్పుడో చెప్పి ఉన్నాడు''

"కావచ్చు. కాని ప్రతిమనిషికీ ఓ 'బ్రేక్‌పా యింట్' అని ఉంటుంది. ఆ స్థితికి చేరినప్పు డు ఏ మనిషయినా తప్పక మారిపోతాడు''

పార్వతమ్మ వంట గదిలోనుండి వీల్ ఛెయిర్ నెట్టుకుంటూ ఇవతలికి రావడం చూశాడు. అప్పటికి చాలా సేపటినుండి తను ఫోన్‌లో మాట్లాడుతూనే ఉన్నాడు. మాట్లాడే విషయాలు ఏవైనప్పటికీ కాబోయే భార్యతో మరీ అంతసేపు ఫోన్‌లో మాట్లాడడం చూసే వాళ్ళకు ఏమంత బాగోదు.

"సరే! అతడు మారితే, మనకు అంతక న్నా కావలసిందేముంటుంది? గౌతమి కష్టా లు చాలావరకూ తొలిగిపోయినట్టే కదా?




ఇంకేంటి విశేషాలు?"

"ఏమున్నాయి?"

"మరి, నేనిక ఉంటానూ''

"సరే' అందామె తనూ రిసీవర్ పెట్టేస్తూ.

అతడు ఫోన్‌పెట్టేసే సమయానికి పార్వతమ్మ దగ్గరగా వచ్చింది. "గౌతమి కష్టాలు అంటున్నావ్... ఎవరి గురించి? మన గౌతమి గురించేనా?" ఆరాగా అడిగింది.

"అవునమ్మా'' అంటూ అతడు సమన్వితతో ఫోన్‌లో జరిగిన సంభాషణను క్లుప్తంగా చెప్పాడు.

అంతా విన్నాక ఆమె చిన్నగా నిట్టూర్చింది. "పాపం ఆ అమ్మాయికి అతగాడి మీద నమ్మకం ఎలా కలిగిందోగానీ నాకు మాత్రం అలాంటి అత్యాశ ఏమీలేదురా అతడీ జన్మకు మారడు''

"నేనూ అదేమాట అన్నాను. ఒకవేళ అతడు మారితే మాత్రం గౌతమి కష్టాలు తొలగిపోతాయని చెప్పాను''

పార్వతమ్మ కొడుకు ముఖంలోకి అయోమయంగా చూసింది. ఆమె చూపులు అతడికి అర్థంకాలేదు. అది తెలిసినట్టు ఆమే అంది. "అతడు మారిపోతే, గౌతమి కష్టాలు ఎలా తొలుగుతాయని నువ్వు అనుకుంటున్నావురా? అతడికీ, గౌతమికి సంబంధం ఏమిటి?"

అతడికి ఆమె మనసులోని భావం అర్థమయింది. తన తల్లి ఇంకా అతడిమీద కోపంగానే ఉంది. 'ఎంతయినా వాళ్ళిద్దరూ భార్యాభర్తలు. అతడు కట్టిన తాళి ఇంకా ఆమె మెడలోనే ఉంది. వాళ్ళిద్దరూ చట్టబద్ధంగా కూడా విడిపోలేదు. భార్యాభర్తలమధ్య గొడవలు రావచ్చు. భర్త హింసను భరించలేకపోతే భార్య తాత్కాలికంగా అతడినుండి విడిపోవచ్చు. కాని... ఒకవేళ ఆ భర్త మారి ఆమెను క్షమించమని కోరి, దగ్గరకు చేరాలని తాపత్రయపడితే... సత్యమూర్తి మారతాడన్న నమ్మకం తనకు లేకపోయినప్పటికీ, అతడు నిజంగా మారితే ఆమె అతడిని ఆదరించడం సబబే అని తన ఆలోచన'

ఆ విషయమే అతడు తల్లికి మరింత విపులంగా వినిపిస్తే ఆమె అతడి ఆలోచనా ధోరణిని నిరసించింది. "ఈరోజు మారాడని దగ్గరగా వెళ్ళి, రేపు మళ్ళీ హింసపెట్టడం మొదలుపెడితే తిరిగి రోడ్డునపడడం... ఇదేం బొమ్మలాటకాదు. జీవితం! ఒక్కసారి తప్పుడు నిర్ణయం తీసుకుంటే, ఆ తర్వాత తిరిగి జీవితాంతం బాధపడవలసివస్తుంది. అర్థమయిందా?"

'ఆ విషయంలో తను, తల్లి చర్చించుకోవడం వలన ఉపయోగం ఏమీలేదని' అతడు మనసులోనే అనుకున్నాడు. తప్పయినా, ఒప్పయినా తన జీవితం గురించి నిర్ణయం తీసుకోవలసిన బాధ్యత, హక్కు ఆమెకే ఉన్నాయి.

అందుకే అతడు నవ్వేస్తూ "సరేలేమ్మా! అతడు పూర్తిగా మారిపోయాడని తెలిశాకగదా మనం ఈ విషయాలు మాట్లాడుకోవలసింది. ఇప్పుడీ చర్చ అనవసరం" అని చెప్పి అక్కడినుండి లేచి వెళ్ళిపోయాడు.

పార్వతమ్మ అక్కడే ఉండిపోయి ఆలోచించసాగింది.

గౌతమి ఆ ఇంట్లోనుండి వెళ్ళిపోతే ఆమెతోపాటే ఆ ఇంట్లో వినిపిస్తున్న పసివాడి నవ్వులూ దూరమయిపోతాయని ఆమెకు తెలుసు. ఆమె ఎంతోకొంత బాధపడుతున్నది ఆ విషయంలోనే! ఇక గౌతమి విషయం అంటే వయసొచ్చేవరకూ గుండెలమీద పెట్టుకుని పెంచిన ఆడపిల్లను బాధపడుతూనే అత్తారింటికి పంపించాలి. అది తప్పదు. అయితే తప్పనిసరయినవనీ తెలిసీ బాధ కలగడం సహజం. గౌతమి తమ ఇంటికి సుఖసంతోషాలు తీసుకొచ్చిన లక్ష్మీదేవి, అది నిజం... కష్టమయినా నష్టమయినా తప్పనిసరయినప్పుడు ఆమెను భర్తదగ్గరకు పంపాలి'



ఎందుకో ఆ ఆలోచనే ఆమెను బాధపెట్ట సాగింది.

చాలా సేపటి తర్వాత ఆమె తల విదిలించి, పక్కగదిలోనే నిద్రపోతున్న పసివాడిని చూసేందుకు వీల్‌ఛెయిర్ నెట్టుకుంటూ వెళ్ళిపోయింది.

★ ★ ★

గౌతమికి స్నేహితురాలుగా పరిచయమైనప్పటినుండి సమన్విత సత్యమూర్తితో కాస్త చనువుగానే మసలుకుంటోంది. అతడి కేసు ప్రత్యేకంగా చూడడమేకాదు, చివరికి ఒక్కోసారి బేండేజ్ మార్చే పనులు కూడా స్వయంగా చేస్తోంది.

ఆమె తన భార్యకు ఎంత దగ్గరి స్నేహితురాలయినా, తనను మరీ అంత ప్రత్యేకంచి చూడడం అతడికి ఆశ్చర్యం కలిగించేది. అందులోనూ తను గౌతమికి చేసిన అన్యాయం, ఆమెపట్ల ప్రవర్తించిన తీరు తెలిసిన ఏ స్నేహితురాలయినా తనను అసహ్యించుకోవాలేగానీ అంతగా ఆదరించకూడదు. మరి ఈమె తనను ఇంతగా ఎందుకు ఆదరించి, అభిమానిస్తూ సేవలు చేస్తున్నట్టు?

ఒకవేళ గౌతమి తన గురించి చెప్పకుండానే, ఆమె సహాయం కోరలేదు కదా? ఏమో! అతడికి ఏమీ అర్థంకావడంలేదు. గౌతమికి, ఆమెకు ఉన్న స్నేహం ఎప్పటిదో... ఎలాంటిదో కూడా తెలియడంలేదు.

ఈ విషయం గురించి డాక్టర్ సమన్వితను అడగలేదు. గౌతమిని అడిగినా సమాధానం చెప్పదు.

ఆ మధ్యాహ్నం తనకు కాస్త తేలికగా ఉన్నట్టు అనిపించడంతో సత్యమూర్తి బెడ్ దిగి కిటికీ దగ్గరగా నడిచాడు.

ఖరీదయిన ప్రైవేట్ హాస్పిటల్ అది. ఆ హాస్పిటల్ ఆవరణ మాత్రమే కాదు, లోపల ప్రతి గది నీట్‌గా, రిచ్‌గా ఉంటాయి.

అలాంటి హాస్పిటల్స్‌లో చిన్నచిన్న వ్యాధులతో చేరితే 'రోగం భోగం' అని పెద్దలు అన్నమాట నిజమేనేమోననిపిస్తుంది.

ప్రతి రూమ్‌లో అన్ని ఛానల్స్ వచ్చే కలర్ టి.వి., వేళకు అందే ఖరీదయిన భోజనం, తెల్లని బట్టలతో చిరునవ్వే సమాధానంగా చెపుతూ అటునిటు తిరుగాడే వెన్నెల కన్యల్లాంటి నర్సులు... ఆ హాస్పిటల్ వాతావరణం అతడికి బాగా నచ్చేసింది.

ప్రభుత్వాసుపత్రిలో మన రోగంకన్నా పక్క బెడ్ పేషెంట్ పరిస్థితి చూసి వైరాగ్యం వచ్చేసే స్థితిలో, వాంతివచ్చేసేలా ఉండే పరిసరాలు, డాక్టర్ల నిర్లక్ష్యం వీటిన్నింటి నుండి తప్పించుకుని ఈ ప్రైవేట్ ఆసుపత్రిలోకి వచ్చి పడడం తన అదృష్టంగా భావిస్తున్నాడు అతడు. నరకంలోనుండి స్వర్గంలోకి వచ్చిపడినంత ఆనందం కలుగుతోంది అతడికి.

'నిజానికి గౌతమిని తను ఎన్నోవిధాలా కష్టపెట్టాడు. కాని ఆమె అవేవీ మనసులో ఉంచుకోకుండా తనను సుఖపెట్టాలనే అనుకుంటోంది. లేకపోతే తనకీ అదృష్టం ఎలా దక్కుతుంది'

ఆలోచనల మధ్యనే అతడు ఆవైపు చూశాడు. తన రూమ్‌కి ఎదురుగా ఉంది ఆ గది. కిటికీ తలుపులు తెరిచి ఉండడంతో లోపలి దృశ్యం స్పష్టంగా కనిపిస్తోంది.

తెల్లని బెడ్‌మీద అస్థిపంజరంలా అనిపించే నలభైఏళ్ళ ఆడది పడుకుని ఉంది. ఆ బెడ్ అంచుమీద కూర్చుని ఉన్నాడు. నలభై ఐదేళ్ళ మగాడు.

సత్యమూర్తి అటు చూస్తూ ఉండగానే అతడు ఆ స్త్రీని లేపి ఆమె వీపును తన ఛాతీకి ఆనుకునేలా చేశాడు. టీపాయ్‌మీద ఉన్న ఓ గ్లాసు అందుకుని ఆమె నోటి దగ్గర ఉంచాడు.

ఆ స్త్రీ "వద్దు... ప్లీజ్! వద్దు అంటుంటే..." అని చిరాకుపడుతోంది.

అతడు మాత్రం అనునయంగా ఓ తండ్రి బిడ్డను ఓపికగా ఓదారుస్తున్నట్టు మెల్లగా





బతిమలాడసాగాడు. "అలా అంటే ఎలా కావ్యా? డాక్టర్ ఏంచెప్పాడు- ఆహారం ఎక్కువగా తీసుకోవాలని చెప్పాడా? హార్లిక్స్ టేస్టీగానే ఉంటుంది, తాగొచ్చు కదా?"

"నాకేం సయించడంలేదు. వాంతివచ్చేసేలా ఉంది''

"వామిటింగ్ అయితే నేను క్లీన్ చేయిస్తాను. నువ్వు మాత్రం ఇది తాగి తీరాలి''

ఆమె అతడి ముఖంలోకి చూసింది. అది ప్రేమో, చిరుకోపమో తెలియదు. తల తిప్పుకున్నాక గ్లాసులోని హార్లిక్స్ గడగడా తాగేసింది.

"వెరీగుడ్'' అతడు ఆమె నుదుట ముద్దు పెట్టుకుని, ఆమెను యధాప్రకారం పడుకోబెట్టాడు.

అప్పుడే సత్యమూర్తి ఆ స్త్రీ కళ్లల్లోకి చూశాడు. ఆమె కళ్లల్లో ఏదో మెరుపు కదలాడుతోంది. బహుశా భర్త ప్రేమతో చేస్తున్న సేవల వలన కలిగిన సంతృప్తికాబోలు అది!

సత్యమూర్తి మనసు చివుక్కుమంది. 'వాళ్ళిద్దరూ భార్యాభర్తలన్న విషయం తెలిసిపోతూనే ఉంది. ఆ భర్త తన భార్యకు సేవచేసే విధానం చూస్తుంటే, అతడి మనసులో ఏ మూలనో ఇబ్బంది కదలాడసాగింది. అనుబంధం, ఆప్యాయత, ప్రేమ ఇంత అపురూపంగా ఉంటాయా? ఇవేవీ తన జీవితంలో అనుభవంలోకి రాలేదు కదూ?'

ప్రతి మనిషీ ఆలోచించగలడు. కాని అతడు ఆలోచించుకునేందుకు తీరిక దొరకాలి. తన తప్పొప్పుల గురించి బేరీజు వేసుకునే సమయం, సందర్భం ఎదురుకావాలి. అలాంటి సంఘటనలూ జీవితంలో జరగాలి.

సత్యమూర్తికి చిన్నప్పుడే తల్లీతండ్రీ దూరమయ్యారు. అన్నగారు అప్పుడప్పుడూ అదిలించినా, పూర్తిగా అదుపులో పెట్టుకోలేకపోయారు. అదృష్టం బాగుండి ఉద్యోగం దొరికింది. పెళ్ళి చేసేస్తే వాడే బాగుపడతాడులే అని ఆయన అతడికి పెళ్ళిచేసేశాడు.

ప్రవాహంలో కొట్టుకుపోతూ అదే జీవితం అనుకుంటున్న అతడికి, ఇప్పుడే తొలిసారి ఎదురుదెబ్బ తగిలింది. జీవితమంటే కొట్టుకుపోవడం కాదు, ఎదురీదడం అన్న సత్యం తెలిసొచ్చింది. అంతే కాదు, కొన్ని తియ్యని అనుబంధాల గురించిన జ్ఞానం ఇప్పుడిప్పుడే కలుగుతోంది.

"హలో సార్! అక్కడేం చూస్తున్నారు?"

అతడు చప్పున తలతిప్పి వెనక్కు చూశాడు.

డాక్టర్ సమన్విత తన వెనుకే నిలబడి ఉంది.

అతడు మరోసారి ఎదుటి రూమ్‌కేసి చూసి తలతిప్పుకున్నాడు. "ఏంలేదు''

"నేను గమనించానులెండి. మీరు ఎదుటి రూమ్‌లోని ఆ భార్యాభర్తలకేసి చూస్తున్నారు కదూ?" ఆమె నవ్వుతూ అంది.

అతడు అవుననిగానీ కాదనిగానీ అనలేదు. వెనుతిరిగి తన బెడ్‌వైపు నడవసాగాడు.

సత్యమూర్తి అడగకుండానే ఆమే చెప్పింది. "ఆమెకు బ్లడ్‌క్యాన్సర్''

అతడు కంగారుపడి ఆమెకేసి చూశాడు. "అంటే... అంటే ఆమె ఇక ఎక్కువరోజులు..." ఆ తర్వాత పూర్తిచేయలేకపోయాడు.

"అలా కన్‌ఫర్మ్ చేయలేం. రక్తం మార్చడం వలన కొంతవరకూ ప్రయోజనం ఉంటుంది. ఆ ట్రీట్‌మెంట్ వలన అలాంటి కేసులు సక్సెస్ కూడా అవుతున్నాయి''

ఎందుకో తెలియదు, అతడికి చాలా రిలీఫ్‌గా అనిపించింది. వాళ్ళెవరో తనకు తెలియదు. అయినా తనకు ఎందుకీ సంతోషం?

జవాబు వెంటనే తోచింది. 'భార్యాభర్తల బంధం అంటే అలాగే ఉండాలి' అని తను అనుకుంటున్న సమయంలో, వారిద్దరిలో ఒకరు త్వరలో ఈ లోకం విడిచి వెళ్ళిపోతూ మరొకరిని వంటరిని చేస్తారన్న ఊహ కలి

గించిన బాధ, అది నిజం కాదని తెలియడంతో ఆనందంగా మారింది అంతే.

సమన్విత సిరెంజిలోకి బాటిల్‌లోని మందు ఎక్కించుకుంటూ అతడితో చెప్పింది. "కొంతమంది భార్యను ఇలా అపురూపంగా చూసుకుంటుంటే, మరికొందరు మాత్రం అనుమానంతో, అహంకారంతో ఆడదాన్ని వేధించి చంపుతుంటారు''

అతడు అదిరిపడి ఆమెకేసి తిరిగాడు.

ఆమె తడబడకుండా పలికింది "ఇప్పుడే ఓ ఫ్రెండ్‌తో కలసి గాంధీ హాస్పిటల్‌కి వెళ్ళివస్తున్నాను. అక్కడ అలాంటికేసులు మామూలేగానీ, నేను ఉన్నప్పుడే వచ్చిన ఓ కేసు చూడడంతోనే నాకు చాలా బాధ కలిగింది..."

అతడు ఆమె ముఖంలోకి ప్రశ్నార్థకంగా చూశాడు.

సమన్విత కంటిన్యూ చేసింది. "... ఆ అమ్మాయిని చూస్తుంటే చాలా అందంగా ఉండి ఉండేదని తెలిసిపోతూనే ఉంది. పాపం! ఆ అమ్మాయికి అనుమానం మొగుడు దొరికాడు. కేవలం అనుమానంతోనే కిరోసిన్ వంటిమీద పోసి తగలబెట్టేశాడు ఆ దుర్మార్గుడు. నీచుడు, నికృష్టుడు. అలాంటి వాడిని ఎంత తిట్టినా కోపం చల్లారడంలేదు నాకు''

అతడి గొంతులో తడారిపోయింది. ఏం మాట్లాడాలో తోచడంలేదు.

ఇంతలో సమన్వితనే అడిగింది. "మీరయినా చెప్పండి, ఓ ఆడది తప్పుచేయదలచుకుంటే మగాడు ఆమెను అడ్డుకోగలడా? ఆడది తప్పుచేయడానికి, తప్పు చేయకుండా ఉండడానికి మధ్యనున్న వ్యవధి మూడు నిముషాలు! ఆడది మగాడి కళ్ళు కప్పదలచుకుంటే మూడు నిముషాలు లెక్కలోనివి కావు. మరి ఆడదాన్ని తప్పు చేయకుండా అడ్డుకోలేనని తెలిసి కూడా ఈ మగాళ్ళు ఇలా అనుమానాలతో ఎందుకు వేధిస్తారో నాకు తెలియడంలేదు. స్త్రీకి నీతి, నిజాయితీల పట్ల నమ్మకం ఉండాలి. అంతే తప్ప అనుమానించి, వేధించడం వలన ఎలాంటి ప్రయోజనమూ ఉండదు. ఏమంటారు సత్యమూర్తిగారూ?"

అతడు అతికష్టంమీద గొంతు పెగల్చుకుని "అవును... అవునవును... అది నిజం" అన్నాడు.

ఆమె అంతటితో ఆ టాపిక్ కట్ చేశాక, అటుఇటు చూసి అతడిని ప్రశ్నించింది. "గౌతమి ఎక్కడికెళ్ళింది?"

"కేరియర్ పట్టుకురావడానికి ఇంటికెళ్ళింది''

"అలాగా'' అంటూనే అతడికి ఇంజక్షన్ చేసింది సమన్విత. రిపోర్ట్‌చార్ట్‌మీద ఏదో రాస్తూ అతడితో చెప్పింది. "గౌతమి వస్తే చెప్పండి, మిమ్మల్ని మరో రెండురోజులలో డిశ్చార్జ్ చేసేస్తున్నాం"

"నిజమా?" అన్నాడు అతడు. నిజానికి ఆ క్షణం తన మనసులో కదలాడింది ఆనందమో, బాధనో అతడికే అర్థంకాలేదు.

హాస్పిటల్‌నుండి డిశ్చార్జ్ అవుతున్నందుకు ఆనందం కలిగి ఉండొచ్చుగానీ, బాధ కలగడానికి కారణం ఏమిటి? అని అతడు తనలో తానే ప్రశ్నించుకుంటే వచ్చిన జవాబు ఒక్కటే. హాస్పిటల్‌నుండి ఇంటికెళ్ళిపోతే గౌతమి తన ఇంటికి వస్తుందో రాదో తెలియదు. బహుశా రాదనే తన నమ్మకం... అంటే, మరో రెండురోజుల్లో తనూ గౌతమి విడిపోబోతున్నారా? అతడికి బాధ కలిగించిన అంశం అదే!

సమన్విత అతడి ముఖంలోని ఫీలింగ్స్ని గమనిస్తూ చెప్పింది, "మీరు మరో రెండు రోజులలో హాస్పిటల్‌నుండి వెళ్ళిపోతున్నారంటే, నాకూ ఏదోలా ఉంది''

అతడు తలెత్తి ఆమె కళ్ళలోకి చూశాడు ప్రశ్నార్థకంగా!




ఆమె చెప్పింది. "ఎల్లుండి నుండి నేను ప్రతిరోజూ చూస్తూ ఉంటాను. కాని మీతో మాట్లాడలేను. మీరు మా పక్కింట్లో ఉంటున్నప్పటికీ, కనీసం మిమ్మల్ని నా పెళ్ళికి కూడా పిలవలేను... అదే... అదే నాకు బాధగా ఉంది''

అతడు అడిగాడు. "మీకు మీకు పెళ్ళా?"

"అవును''

అప్పటికే ఏదో అనుమానం అతడి మనసులో ప్రవేశించింది. "పెళ్ళికొడుకు ఎవరు?"

"వంశీకృష్ణ... మీ ఇంటి పక్కనే ఉంటున్న పార్వతమ్మ గారి కొడుకు వంశీకృష్ణ..."

సత్యమూర్తి కళ్ళముందున్న మబ్బులు విడిపోయినట్టు, పరిస్థితి మొత్తం స్పష్టంగా అర్థమయిపోయింది.

'వంశీకృష్ణకు తనమీద కోపంలేదు. ఉండి ఉంటే, తనకు కాబోయే భార్యచేత తనకు ఇన్ని సేవలు చేయించడు. అతడి తల్లిదండ్రులకూ తనపట్ల ద్వేషభావం మాత్రంలేదు. వాళ్ళు తలచుకుని ఉండకపోతే తనకు ఇంత గొప్ప సపర్యలు జరిగి ఉండేవికావు''

అతడికి తను మరింతగా కుంచించుకుపోతున్నట్టుగా అనిపించింది. మహోన్నతమైన వాళ్ళ వ్యక్తిత్వం ముందు తనెంత అల్పుడో అర్థమయిపోతూనే ఉంది.

సత్యమూర్తి చాలా సేపటికి తేరుకున్నాడు. అశ్రువులు నిండిన కన్నులతో సమన్వితకేసి చూస్తూ అడిగాడు. "డాక్టర్‌గారూ! నేను ఇంతవరకూ అందరినీ దబాయించేవాడినే తప్ప, ఎవ్వరినీ ప్రాధేయపడి అడగలేదు. మొట్టమొదటిసారి నా జీవితంలో మిమ్మల్ని ప్రాధేయపడుతూ ఓ కోరిక కోరుతున్నాను. తీరుస్తారా?"

"ఏమిటది?"

"మా అన్నగారు వచ్చి, వెళ్ళిపోతూ నా బిడ్డ గురించి చెప్పాక, ఈ రెండురోజుల నుండి నా కొడుకును చూసుకోవాలన్న కోరిక నాకు కలుగుతూ వచ్చింది. ఇప్పుడు ఆ కోరికను కూడా పక్కకు నెట్టేస్తూ మరో కోరిక పుట్టుకొచ్చింది. 'నేను ... నేను ఒక్కసారి... ఒక్కసారి వంశీని, అతడి తల్లిదండ్రులను చూడాలి... దయచేసి నాకోరిక తీరుస్తారా?"

సత్యమూర్తి బాగా కదిలిపోయాడని ఆమెకు అర్థమయిపోయింది.

సమన్విత సంతోషంగా చెప్పింది. "తప్పకుండా... తప్పకుండా, ఈ సాయంత్రమే వంశీని, అంకుల్, ఆంటీని ఇక్కడకు తీసుకొస్తాను''

ఆ సాయంత్రం సమన్విత వంశీకి ఈ విషయం ఫోన్‌లో చెప్పింది.

సత్యమూర్తిని చూడాలని మనసు పీకుతున్నా, ఎదురయ్యే పరిస్థితులను ఊహిస్తూ ఆగిపోయిన అతడు కాస్త సంతోషంగా, మరి కొంత విస్మయంగా ప్రశ్నించాడు. "ఏంటి! సత్యమూర్తి... సత్యమూర్తి మమ్మల్ని చూడాలని కోరాడా?"

"అవును. మీరు తప్పక రావాలి''

"అలాగే''

మరో అర్థగంట తర్వాత వంశీ, పార్వతమ్మ, ప్రభాకరరావులు పసివాడిని తీసుకుని హాస్పిటల్‌కి వచ్చేశారు.

సత్యమూర్తి వాళ్ళను ఆప్యాయంగా ఆహ్వానించాడు.

వంశీ, పార్వతమ్మ, ప్రభాకరరావులు అతడిని పరామర్శించారు.

ఆ సమయంలో గౌతమి అక్కడే ఉంది. మరికాసేపటికి సమన్విత కూడా వచ్చి వారితో కలిసింది.

సత్యమూర్తి వీల్‌చెయిర్‌లో ఉన్న పార్వతమ్మ వడిలోనుండి పసివాడిని అందుకున్నాడు. ఎడమచేత్తోనే వాడిని పట్టుకుని ముద్దులాడాడు.

గౌతమి అప్పుడే భర్త ముఖంలోకి ఓరగా చూసింది. పసివాడిని పట్టుకున్నాక అతడి

కళ్ళల్లో అదోరకమైన మెరుపు కదలాడడం ఆమె గమనించింది.

వాళ్ళు అక్కడ ఓ గంటకు పైగా కూర్చున్నారు. సత్యమూర్తిపట్ల తమకు ఎలాంటి దురభిప్రాయం లేనట్లూ అతడు తమకెంతో ఆప్తుడయినట్టుగానే మాట్లాడారా ముగ్గురూ!

ఇక వాళ్ళు వెళ్ళేందుకు లేచే ముందు సత్యమూర్తి వంశీ రెండుచేతులు తన ఎడమచేతితో పట్టుకుని ఒకేఒకమాట చెప్పాడు "నన్ను క్షమించండి''

వంశీ ఇబ్బందిపడిపోయాడు. "భలేవారే! నేను మిమ్మల్ని క్షమించడమేమిటి? మీరలా మాట్లాడకండి'' అన్నాడు.

"మీ స్థితిలో నేనుంటే, కక్ష సాధించి ఉండేవాడినేగానీ, ఇలా చేరదీసి బాగుపరచి ఉండేవాడిని కాదు. అంతేకాదు, హాస్పిటల్‌కి పరామర్శకయినా వచ్చి ఉండేవాడిని కాదు... అది నిజం"

"దయచేసి మీరు అవేం ఆలోచించకండి. ఈ రెండు రోజులూ హాయిగా రెస్ట్ తీసుకోండి'' అని లేచాడు వంశీకృష్ణ.

అతడి దగ్గర శెలవు తీసుకుని, పసివాడిని అందుకున్నాడు. వీల్‌ఛెయిర్‌లో ఉన్న తల్లి వడిలో పసివాడిని కూర్చోబెట్టి, ఛెయిర్ నెట్టుకుంటూ ఆ గదిలోనుండి ఇవతలికి వచ్చేశాడు.

కారులోకి వీల్‌ఛెయిర్‌ని ఎక్కిస్తున్నప్పుడు పార్వతమ్మ కొడుకుతో అంది. "సత్యమూర్తి మనతో ఇలా ప్రవర్తిస్తాడని నేను కలలో కూడా ఊహించలేదు''

"అతడిలోని మార్పును చూసి నేను కూడా ఆశ్చర్యపోయాను''

"మొగుడు మారిపోయాడు కాబట్టి గౌతమి అతడి దగ్గరకు వెళ్ళిపోతుందంటావా?" ఆమె ఆసక్తిగా ప్రశ్నించింది.

"ఆమె మనసు ఎప్పుడో ముక్కలయిపోయింది. మనసు విరిగిపోతే కలవడం కష్టం అయినా...ఏం జరుగుతుందో చూద్దాం"

అతడు వీల్‌ఛెయిర్‌ని కారులో అడ్జస్ట్ చేశాక డోర్ వేసేశాడు. చుట్టూ తిరిగి వచ్చి డ్రైవింగ్ సీట్లో కూర్చుని స్టార్ట్‌చేశాడు.



**కృ**ష్ణకిశోర్‌గారు హైదరాబాదు వచ్చారు. రేణుక ఇంట్లో దిగాడు.

ఉదయమే ఆయన రేణుకను, సమన్విత ను వెంటబెట్టుకుని ఆ ఇంటికి వచ్చారు.

ఆయనను చూడడంతోనే పార్వతమ్మ వీల్‌ఛెయిర్‌లోనే ఎదురొస్తూ ఆప్యాయంగా పలకరించింది "ఎప్పుడొచ్చారు అన్నయ్యగారూ?"

"అర్ధగంటయిందమ్మా'' అంటూ అటుఇటు చూస్తూ అడిగాడు "అల్లుడుగారేరి?"

"డ్రాయింగ్‌రూమ్‌లో కూర్చుని ఏవో ఫైల్స్ చూసుకుంటున్నట్టున్నాడు. పిలుస్తానుండండి'' ఆమె తల వెనక్కు తిప్పి అరిచింది. "వంశీ... వంశీ''

అవతలివైపునుండి జవాబు రాలేదు.

ఆమె మరింత పెద్దగా అరవబోతుంటే సమన్విత ఆమెతో చెప్పింది. "నేను తీసుకొస్తానులే ఆంటీ'

పార్వతమ్మ కోడల్నిచూసినవ్వుతూ తలూపింది. సమన్విత హాలులోనుండి అవతలికి

నడిచింది.

అప్పటివరకూ వియ్యంకుడు, రేణుక నిలబడే ఉండడం గమనించి పార్వతమ్మ హడావుడిగా అంది. "అయ్యో! ఇంకా నిలబడే ఉన్నారేమిటి? కూర్చోండి... నీకూ కూర్చోమని చెప్పాలటే రేణుకా... కూర్చో"

రేణుక సోఫాలో కూర్చుంది. కృష్ణకిశోర్ మరో సోఫాలో కూర్చున్నాడు.

ఎంతయినా తను ఆడపిల్ల తండ్రి కాబట్టి కాస్త వినయంగానే ఆమెతో చెప్పాడు. "ఈరోజు అమ్మాయికి, అబ్బాయికి బట్టలు తీసే ఉద్దేశ్యంతో హైదరాబాదు వచ్చాను. రేణకకి కూడా ఇంతకుముందే ఈ విషయం తెలియచేశాను"

"అవునవును, అబ్బాయి చెప్పాడు" అంది పార్వతమ్మ.

అంతలో ప్రభాకరరావు హాలులోకి రావడంతో కృష్ణకిశోర్ లేచి ఆయనకు నమస్కరిస్తూ "బాగున్నారా?" అన్నాడు.

"బాగున్నాను. మీరు?" ఆయన ఇప్పుడిప్పుడే కొద్దికొద్దిగా మాట్లాడగలుగుతున్నారు.

ఆయన తలాడించాడు. "ఈమధ్యకాలంలో మీరు మరికాస్త కోలుకున్నట్టుగా అనిపిస్తోంది నాకు. అది నిజమేనంటారా?"

ప్రభాకరరావు జవాబు చెప్పలేదు. పార్వతమ్మ అందుకుంది. "మా అబ్బాయికి పెళ్ళి జరగబోతుందన్న ఆనందం, అందులోనూ గౌతమి చేసిన సేవలు మావారిని మళ్ళీ మామూలు మనిషిని చేశాయి. నేనయితే, ఆయన లేచి మళ్ళీ ఇలా తిరగగలరనీ, మాట్లాడగలరనీ అసలు ఊహించలేదు. అంతా ఆ దేవుడి దయ"

కృష్ణకిశోర్‌కి అప్పుడే గుర్తొచ్చినట్టుంది. ఆయన చుట్టూ పరిశీలనగా చూస్తూ పార్వతమ్మను ప్రశ్నించాడు. "ఇంతకీ గౌతమి ఎక్కడ? మేము వచ్చి ఇంతసేపయినా పలకరించడానికి కూడా ఇవతలకు రాలేదేం?"

పార్వతమ్మ జవాబు చెప్పింది. "ఇంట్లో లేదు అన్నయ్యగారూ! హాస్పిటల్‌కి వెళ్ళింది"

"హాస్పిటల్‌కా?.. ఎందుకు?"

అప్పటివరకూ మౌనంగా ఉన్న రేణుక కల్పించుకుని చెప్పింది. "గౌతమి భర్త సత్యమూర్తికి యాక్సిడెంట్‌లో చెయ్యిపోయింది"

"మైగాడ్"

"ఈ విషయం రాగానే మీకు చెప్పాలనుకున్నాను. ఎలాగూ ఇక్కడ ప్రస్తావన వస్తుంది కదా అని ఆగిపోయాను. అందులోనూ మీరు పెళ్ళికార్యం మీద వచ్చినప్పుడు మొదటే ఈ విషయం చెప్పి బాధపెట్టడం ఇష్టంలేకపోయింది"

"ఇంతకీ ఇప్పుడు సత్యమూర్తి ఏ హాస్పిటల్‌లో ఉన్నాడు?"

"మన హాస్పిటల్‌లోనే"

"అయితే బట్టలు తీయడం అయిపోయాక, మనం అటునుండి అటే హాస్పిటల్‌కి వెళ్ళి అతడిని పరామర్శిద్దాం"

"అలాగే" చెప్పింది రేణుక.

అప్పుడే గుర్తొచ్చినట్టు పార్వతమ్మ తల వెనక్కుతిప్పి "వీళ్ళిద్దరేరి, ఇంకా రాలేదు" అంటూ గొణుక్కోసాగింది.

సరిగ్గా అప్పుడే ముందు సమన్విత, వెనుకే వంశీ రావడం ఆమెకు కనిపించింది.

"ఇంత ఆలస్యమేమిట్రా?" అందామె.

"నేను బాత్‌రూమ్‌లో ఉన్నాను"

సమన్విత వచ్చి రేణుక పక్కనే కూర్చుంటే, ఆమె సమన్విత చెవిలో గొణిగింది. "నువ్వు బాత్‌రూమ్‌లోకెళ్ళి మరీ అతడిని పిలుచుకొచ్చావా?"

"ఛీ! పో అక్కా"

అల్లుడిని చూడడంతోనే కృష్ణకిశోర్ లేచి నిలబడి, చెయ్యి ముందుకుచాస్తూ "హలో వంశీ! హౌఆర్‌యూ" అడిగాడు.

"ఫైన్ సార్! కూర్చోండి" అన్నాడు.



# సచిత్ర విచిత్రం



## వృద్ధ తాబేలు మాత



ఇంగ్లండులోని సౌత్ పోర్ట్‌జోలో స్పీడి అనే 80 ఏళ్ళ వయసుగల తాబేలు ఇటీవల కొన్ని గుడ్లు పెట్టింది. ఆ గుడ్లలోంచి వచ్చిన తాబేళ్లలో ఇదొకటి. ఇందులోని విశేషం పాతికేళ్ళు దాటాక తాబేళ్ళు గుడ్లు పెట్టవు. 80 ఏళ్ళు వచ్చాక అది ఏ తాబేలుకయినా అసాధ్యమైన విషయం. మనుమలకి ఫెర్టిలిటీ డ్రగ్స్ ఇచ్చి పిల్లలు పుట్టేలా చేస్తున్నట్లే, ఓ జువాలజిస్ట్ ఈ వృద్ధ తాబేలుమీద కూడా ఆ ప్రయోగం చేసి విజయం సాధించాడు.

కృష్ణకిశోర్ కూర్చున్నాక, అతడు ఎదురు సోఫాలో తన తండ్రి పక్కనే కూర్చున్నాడు.

వరాలు అందరికీ కాఫీ పట్టుకొచ్చింది.

కృష్ణకిశోర్ కాఫీ సిప్‌చేస్తూ అతడికి చెప్పాడు. "ఈరోజు మీ ఇద్దరికీ బట్టలు తీసివ్వాలని వచ్చాను''

"తెలుసండీ... అందుకే ఈరోజు ఆఫీసుకు వెళ్లడం మానేశాను''

"అయితే మీరు రెడీగానే ఉన్నారన్న మాట"

"అవునండీ''

"ఇంకా ఆలస్యం ఎందుకు? వెంటనే బయలుదేరుదాం. నేను సాయంత్రం ఫ్లయిట్‌కి తిరిగి వెళ్ళిపోవచ్చు''

"అదేంటి అన్నయ్యగారూ! ఉదయం వచ్చి సాయంత్రానికి తిరిగి వెళ్ళిపోతానంటున్నారు? వచ్చిన వాళ్ళు ఓ రెండురోజులయినా ఉండేలా ప్లాన్ చేసుకుని రావలసింది'' పార్వతమ్మ కాస్త నిష్ఠూరంగానే పలికింది.

కృష్ణకిశోర్ నవ్వాడు. "రెండు రోజులు సెలవుపెట్టుకుని ఉండడానికి నేనేం గవర్నమెంట్ ఉద్యోగిని కాదుకదమ్మా. ఏ బిజినెస్ మేన్ అయినా ఒక్కరోజు తన బిజినెస్‌కి దూరంగా ఉంటే ఎన్నో అనర్థాలు జరిగిపోతాయి''

"అది నిజమే'' వియ్యంకుడికి వత్తాసు పలికాడు ప్రభాకరరావు.

"మీరూ ఆయనకే సపోర్ట్ చేస్తారా? ఎంతయినా మీ అందరూ ఒక్కటే కదా, బిజినెస్ పీపుల్... క్షణం తీరికలేని మనుష్యులు..." అని చిరుకోపంగా అని, ఆమె కాస్త ముందుకు వంగి కృష్ణకిషోర్‌తో మెల్లగా... "మీతో ఓ విషయం చెప్పానా అన్నయ్యగారు?"

"ఏమిటమ్మా అది?"

"మా పెళ్ళినాటి ముచ్చట"

"చెప్పు... చెప్పమ్మా'' ఆయన చాలా ఉత్సాహంగా కాస్త ముందుకు వంగాడు.

ఆమె చెప్పింది "మావారు కూడా అప్పట్లో బిజినెస్‌లో బాగా ఇన్వాల్వ్ అయిపోయి ఉండేవారు కదా?!... పెళ్ళిలో తాళి కట్టబోయే ముందు నా ముఖంలోకి చూసి కాస్త ఆశ్చర్యపోతూ 'నేను పెళ్ళిచూపులలో చూసింది నిన్నేకదా?' అన్నారు. నేను అదిరిపడ్డాను. "అదేంటి?" అంటూ కంగారుగా ప్రశ్నించాను. అంతలోనే ఆయనే సర్దుకుంటూ 'ఏమోలే! నిన్నే చూసి ఉండొచ్చు. ఎందుకంటే, ఆరోజు పాతికలక్షల బిజినెస్ డీల్ చేసి, ఆ సంతోషంలో పెళ్ళిచూపులకు వచ్చాను కదా, నిన్ను సరిగా చూడలేదు' చెప్పారు. నేను కొద్దిగా స్థిమితపడ్డాను. అంతవరకూ మేలు, తాళి కట్టబోయే ముందే కన్‌ఫర్మ్ చేసుకున్నారు. అదే... పెళ్లయ్యాకనయితే" అంటూ నవ్వసాగింది.

అక్కడున్న వారందరూ పగలబడి నవ్వసాగారు.

ప్రభాకరరావు కాస్త సిగ్గుపడిపోతూనే "చాల్లే ఊరుకో. అప్పుడంటే ఏదో వయసులోని ఉత్సాహం. బిజినెస్సే లోకంగా అనిపించేది'' అంటూ తనను తాను సమర్థించుకున్నారు.

"నేను మిమ్మల్ని ఇప్పుడేం తప్పుపట్టడంలేదులెండి. అన్నయ్యగారు బిజినెస్ పీపుల్ ప్రస్తావన తీసుకువస్తే నాకా సంఘటన గుర్తుకొచ్చింది. అందుకే అంటాను ఏ ఆడపిల్లా, బిజినెస్ చేసుకునే మొగుడికి అసలు ప్రిఫరెన్స్ ఇవ్వకూడదు. హాయిగా ఏ ఇంజనీరునో, డాక్టరునో కట్టుకుంటే చక్కగా సంతోషపడుతుంది'' అలా అన్నాక ఆమె ఓరగా సమన్వితకేసి చూసింది. సమన్విత చూపులు వంశీమీదనే ఉన్నాయి.

వాళ్ళిద్దరూ ఒకరికొకరు దొంగచూపులు చూసుకుంటూ నవ్వుకుంటున్నారు.

ప్రభాకరరావు వీళ్ళ విషయం గమనించకుండానే భార్యతో వాదనకు దిగాడు. "నీ

మాటలు నేను అసలు అంగీకరించడంలేదు పార్వతీ, డాక్టర్లు, ఇంజనీర్ల దగ్గరకన్నా బిజినెస్ చేసుకునేవాడి దగ్గరే ఆడది సుఖపడుతుందని నా నమ్మకం"

"అని ఎలా చెప్పగలరు?"

"బిజినెస్ చేసుకునేవాడు కష్టమైనా, నష్టమైనా పదిరోజులు బిజినెస్‌కు దూరంగా ఉండి భార్యను సినిమాలకు, షికార్లకు తీసుకెళ్ళగలడు. కాని అదే ఇంజనీర్‌కి శెలవు దొరకాలి. డాక్టర్లకు ఆపరేషన్ కేసులు అసలు లేకుండా ఉండాలి... ఏమ్మా! ఏమంటావ్..." తనకు సపోర్ట్‌కోసం రేణుక ముఖంలోకి చూశాడు ప్రభాకరరావు.

రేణుక కాస్త సిగ్గుగా నవ్వింది. వెంటనే తేరుకుని చెప్పింది. "బిజినెస్ మేన్‌ని చేసుకుంటే వచ్చే కష్టాలు గురించి నాకు తెలియదు గానీ, డాక్టర్‌ని పెళ్ళాడితే కొన్ని కష్టాలు ఉన్నాయని నాకు అనుభవపూర్వకంగా అర్థమయింది''

వంశీ, సమన్వితలు తప్ప మిగిలినవారంతా ఆమెకేసి ఆశ్చర్యంగా చూశారు.

"డాక్టర్‌ని పెళ్ళి చేసుకున్నప్పటికీ కష్టాలా?... ఏమిటీ అవి?" పార్వతమ్మ ఆరాగా అడిగింది.

"కష్టాలు ఎందుకులేవు ఆంటీ!... నాకెప్పుడయినా మూడ్ బాగోలేకపోతే ఆ విషయం ఆయనకు చెపితే "ఛీ ఛీ! ఈ సైంటిస్ట్‌లు ప్రతి జబ్బుకీ మెడిసిన్ కనుక్కున్నారు గానీ, మూడ్‌ని మార్చడానికి మెడిసిన్ కనుక్కోలేదు. వాళ్ళు మెడిసిన్ కనుక్కుని ఉండి ఉంటే, నీ మూడ్‌ని మార్చడానికి ఓ టాబ్లెట్ ఇచ్చి ఉండేవాడిని కదా?' అని సైంటిస్టులను తిట్టిపోస్తారు''

వంశీ, సమన్వితలు వీళ్లమాటలు వినిపించుకోవడంలేదు. వాళ్ళ లోకంలో వాళ్ళున్నారు.

కృష్ణకిశోర్‌గారు లేస్తూ "ఓ.కే. రేణూ! మనం ఇక బయల్దేరుదామా?" అన్నాడు.

"అలాగే'' రేణుక లేచి, సమన్విత భుజంమీద తట్టింది. "మనం బయలుదేరబోతున్నాం" సమన్విత ఉలిక్కిపడి లేచి నిలబడింది.

ఆమె లేవడంతో, వంశీ తనూ లేచి నిలబడ్డాడు.

ప్రభాకరరావు కదలకపోవడం చూసి కృష్ణకిశోర్‌గారు అడిగారు "వాట్‌సార్! మీరు రావడంలేదా?"

"నేనెందుకండీ... అబ్బాయిని తీసుకెళ్తున్నారుకదా?... చాల్లెండి''

కృష్ణకిశోర్ ఆయనను ఇబ్బందిపెట్టదలచుకోలేదు.

రేణుక అంది "గౌతమి ఉండి ఉంటే బాగుండేది. వెంట తీసుకెళ్ళొచ్చు'' పార్వతమ్మ ఆ మాట విని మౌనంగా ఉండిపోయింది.

"ఆంటీ! నేను వెళ్ళొస్తాను'' సమన్విత పార్వతమ్మకు చెపుతుంటే ఆమె తలాడించింది.

అప్పుడే వెనుతిరగబోతున్న కృష్ణకిశోర్ ఆగి, వెనుతిరిగి కూతురితో అన్నాడు "ఇంకా 'ఆంటీ' అనడం ఏంటమ్మా! 'అత్తయ్యా' అని పిలవడం నేర్చుకో'

సమన్విత తలాడించింది. మరింక ఆలస్యం ఎందుకనుకుందో ఏమో, అప్పుడే "నేను వెళ్ళొస్తాను అత్తయ్యా'' అంది.

పార్వతమ్మ మనసులో ఓ అపురూప భావం కదలాడి, తనువు పులకరించిపోయింది. ఆ పిలుపుకోసమే తను ఇంతకాలం ఎదురుచూసింది. తన ఇంట్లో ఇలాంటి ఆహ్లాదకరమైన నవ్వులకోసమే పరితపించిపోయింది.

ఎలాగయితేనేం, మొత్తంమీద తీరదనుకున్న తన కోరిక తీరింది. తన ఇంట్లో కళకళలాడుతూ తిరిగే ఇల్లాలు వచ్చేస్తోంది.

ఆమె తలాడించింది.

ఆ నలుగురూ హాలులోనుండి బయటకు




నడిచారు.

అరనిముషం తర్వాత కారు ఆ ఆవరణ విడిచి రోడ్డెక్కింది.

కృష్ణకిశోర్‌గారు కారు డ్రైవ్ చేస్తున్న వంశీతో చెప్పారు "నాకు సిటీలోని షాపుల గురించి అసలు తెలియదు. సిటీలో అన్నిరకాలూ దొరికే పెద్ద షోరూమ్‌కు తీసుకెళ్ళు"

వంశీ తలాడించాడు.

పదినిముషాల తర్వాత కారు షోరూమ్ ముందు ఆగింది. నలుగురూ కారు దిగి లోపలికి నడిచారు.

లోపలికి అడుగుపెట్టాక కృష్ణకిశోర్ వంశీతో చెప్పారు. "చూడు వంశీ! మొహమాటపడకుండా నీకు నచ్చిన బట్టలు కావలసినన్ని తీసుకో"

అతడు తలాడించాడు.

వంశీ తనకు నచ్చిన ఐదు సూట్స్ తీసుకున్నాడు. మరిన్ని తీసుకోమని బలవంతపెట్టినా తీసుకోలేదు.

కృష్ణకిశోర్ తనో రెండు జతల బట్టలు సెలక్ట్ చేసుకున్నాడు. ప్రభాకరరావుగారి కోసం మాత్రం ఓ మూడుజతలు తీసుకున్నాడు.

మగవారి బట్టల కొనుగోలు పూర్తయ్యాక, నలుగురూ కలిసి లేడీస్ సెక్షన్ వైపు వెళ్ళారు.

రేణుక సమన్విత బట్టలు సెలక్ట్ చేసింది. పీటలమీద చీర, శోభనం చీర, అప్పగింతలకు కట్టుకునే చీర... పాతికకు పైగానే చీరలు కొనుగోలు చేశారు వాళ్ళిద్దరూ. అందులో కొన్ని పార్వతమ్మకు, మరికొన్ని రేణుకకూ అనుకుని తీసుకోవడం జరిగింది.

చీరల కొనుగోలు పూర్తయిపోయిందని కృష్ణకిశోర్‌గారు కదలబోతుంటే, సమన్విత ఆయనతో చెప్పింది "మనం మరో నాలుగు చీరలు తీసుకోవాలి నాన్నా"

"ఇంకా ఎవరికమ్మా?" అని ఆయన అడగలేదు "తీసుకోమ్మా" అన్నాడు.

సమన్విత చీరలు సెలక్ట్ చేస్తుంటే, రేణుక అడిగింది "ఈ చీరలు ఎవరికే?"

"గౌతమికి" సమాధానం చెప్పింది సమన్విత.

ఆ సమయంలో గౌతమి తనకు గుర్తుకురానందుకు రేణుక సిగ్గుపడింది. ఆమె అభిమానపూర్వకంగా సమన్వితకేసి చూసింది.

మొత్తంమీద బిల్లు యాభైవేలు దాటింది.

కృష్ణకిశోర్ ఆ బిల్లు చెల్లించాడు.

నలుగురూ బయటకు వచ్చాక ఆయనే అన్నాడు. "మనం ఏదయినా రెస్టారెంట్‌కి వెళ్ళి కాఫీ తాగాక, కాస్త రిలాక్స్ అయి హాస్పిటల్‌కి వెళ్ళడం బాగుంటుందేమో" నిజానికి ఆయనకు ఇలాంటి షాపింగ్‌లు అసలు అలవాటులేదు. షాపింగ్ పేరుతో గంటల తరబడి గడపడం ఆయనకు నచ్చదు. కాని ఇది పెళ్ళి వ్యవహారం. తప్పనిసరిగా హాజరుకావలసిన కార్యం.

ఆయన మాటలు విని వంశీ కాస్త టెన్షన్‌గా "హాస్పిటల్‌కా?... ఎందుకు?" అన్నాడు.

"అదేనయ్యా! మన గౌతమి భర్త సత్యమూర్తిని చూడడానికి"

ఆయన హాస్పిటల్ అన్నది సత్యమూర్తిని చూడడానికే అని అర్థంకావడంతో అతడు రిలాక్స్‌గా ఫీలయ్యాడు. అదేసమయంలో సత్యమూర్తిని చూడాలనుకుంటున్న ఆయన సహృదయతను మనసులోనే అభిమానించాడు.

రెస్టారెంట్‌లో కాఫీ తాగాక అతడు కారును హాస్పిటల్ వైపు పోనిచ్చాడు.

కారు హాస్పిటల్ పోర్టికోలో ఆగింది. ఆ ముగ్గురూ కారు దిగారు.

వంశీ కారు దిగలేదు. కృష్ణకిశోర్ వైపు చూస్తూ చెప్పాడు. "నాకు ఆఫీసులో అర్జంట్ పని ఉంది. బట్టలు ఇంట్లో పెట్టేసి, నేను ఆఫీసుకు వెళ్ళిపోతాను. మరో గంటలో ఎలాగోలా ఈ కారు ఇక్కడ ఉండేలా చేస్తాను"

"కారు గురించి ప్రాబ్లమ్ లేదు. మావారి

కారు ఇక్కడే ఉంది.నువ్వు వెళ్ళు వంశీ'' చెప్పింది రేణుక.

అతడికి నిజంగానే ఆఫీసులో పని ఉంది. వంశీ కారు ముందుకు సాగిపోయింది.

ఆ ముగ్గురూ హాస్పిటల్ లోపలికి నడిచారు.

★ ★ ★

ఆ సాయంత్రం తనను డిశ్చార్జ్ చేసేస్తున్నారు.

నిజానికి హాస్పిటల్ నుండి బయటపడుతున్నందుకు ఎవరయినా ఆనందపడతారు కాని సత్యమూర్తికి బాధగా ఉంది. నిముష నిముషానికీ ఆ బాధ మరింత అధికమవుతూ ఉంది.

అయితే ఆ బాధ హాస్పిటల్ నుండి వెళ్ళిపోతున్నందుకు కాదు, గౌతమి నుండి దూరమవుతున్నందుకు.

హాస్పిటల్లో ఉండగా అతడికి ఎన్నో నగ్నసత్యాలు తెలిశాయి.

తనతో కలిసి మందుకొట్టిన కొలీగ్స్ కేవలం ఒక్కసారి వచ్చి పరామర్శించి వెళ్లిపోయారు. 'మందుటైమ్'లో కంపెనీ ఇచ్చినవాళ్ళు కష్టకాలంలో తోడుగా ఉండలేకపోయారు.

తన అన్నగారు మంచివాడే కానీ ప్రతిమనిషికీ తన కుటుంబం గురించిన ఎంతో కొంత బాధ్యత ఉంటుంది... ఉండితీరాలి. చిత్తుగా తాగి యాక్సిడెంట్ చేసుకున్న తమ్ముడికోసం తన బిడ్డల విద్యాసంవత్సరంఒకటి వృధాపరచడం అవసరమేనా?... అందువల్లే ఆయన ప్రతిమగాడికీ చివరవరకూ 'తోడు'గా 'నీడ'లా ఉండేది అతడి భార్య మాత్రమేనని నీతివాక్యాలు చెప్పి మరీ వెళ్ళాడు.

ఆ మాటల్లో ఎంత నిజం దాగి ఉందో తనకు ఇప్పుడే అర్థమయింది.





ప్రతిమనిషికీ ఎప్పుడో ఒకప్పుడు విచక్షణా జ్ఞానం కలుగుతుంది. అయితే అది కొంత మందికి ఆలస్యంగా జీవితం చివరిదశలో కలిగితే అతడికి జీవిత ప్రథమార్థంలోనే కళ్లు తెరుచుకున్నాయి.

అతడికిప్పుడు భార్య విలువ ఏమిటో తెలిసివచ్చింది. అంతేకాదు. తన భార్యగురించి అతడిప్పుడు గర్వపడుతున్నాడు. తన చిత్రహింస భరించలేక వెళ్లిపోయి ఉండొచ్చు గానీ, తన కష్టకాలంలో తోడుగా నిలిచిన ఆమె మంచితనం ఇప్పుడయినా తను గుర్తించలేకపోతే... ఇక ఈ జీవితంలో ఆమెను తను కలుసుకోలేడు.

ఆమె లేకపోతే తన జీవితం వ్యర్థం. తనకిప్పుడు ఆమె కావాలి. ఆమె ప్రేమను తను పొందగలగాలి. పసివాడి బోసినవ్వులలో తనను తాను మరిచిపోవాలి. భార్యాబిడ్డలతో హాయిగా కాపురం చేసుకోవాలి.

కాని... అతడిలో ఏదో అనుమానం. తన మనసులో గౌతమికి దగ్గర కావాలన్న కోరిక ఉంది. కానీ... కానీ ఆమెలో...?!

అదే అతడి అనుమానం!

'తను ఆమెను చిత్రహింసలు పెట్టాడు. బతికి ఉండగానే నరకాన్ని చూపించాడు. మరి అలాంటి తనను ఆమె క్షమించగలుగుతుందా? క్షమించి తిరిగి దగ్గరకు చేరుతుందా?...'

ఆశనిరాశలమధ్య అతడి మనసు ఊగిసలాడుతోంది.

ఏం చేయాలో తోచక పిచ్చిపట్టినట్టుగా ఉంది.

గత వారంరోజులుగా అతడు ఆమె ప్రవర్తనను గమనిస్తూనే ఉన్నప్పటికీ ఆమె మనసులోని మాట ఏమిటో అసలు అర్థంకావడంలేదు.

తనకు యాక్సిడెంట్ జరిగి హాస్పిటల్ పాలయిన నాటినుండి ఆమె తనకు సేవలు చేస్తూనే ఉంది.

అయితే ఆప్యాయత చూపించే తల్లి, అభి

మానించే భార్య, కష్టసుఖాలలో పాలుపంచుకునే స్నేహితులు వీళ్ళెవరిలా కాకుండా కేవలం బాధ్యత కలిగిన ఓ'నర్సు'లా తనకు సేవలు చేస్తోంది.

శ్రైమ్‌కి మందులు అందిస్తోంది. వేళకు ఆహారం తినిపిస్తోంది. సాయంత్రం బట్టలు మార్చి తడిబట్టతో వళ్ళంతా తుడుస్తోంది.

కాని ఎంత పనిచేసినా ఒక్కమాట కూడా మాట్లాడడంలేదు. మౌనంగా ఒక మరమనిషిలా తనపని తాను చేసుకుపోతోంది. 'నీకూ, నాకూ మధ్య అనుబంధంలాంటిదేదీ లేదు' అన్న భావం ఆమె చేతల్లో వ్యక్తమవుతోంది.

ఆమె సేవలు తనను పశ్చాత్తాపపడేలా చేస్తే, ఆమె మౌనం తన మనసులో ముల్లులా గుచ్చుకొంటోంది. ఒకనాటి తన తప్పులన్నీ సినిమారీళ్లలా కళ్లముందు కదలాడుతున్నాయి.

ఆ బాధను తట్టుకోలేనట్టు సంశయిస్తూనే అతడు ఆమెను పలకరించే ప్రయత్నం చేశాడు. "గౌతమీ! ఈరోజు నువ్వు నన్ను వదిలి వెళ్లిపోతావా?"

"అవును'' అనేసి ఆమె అవతలికి వెళ్ళిపోయింది ఏదో పనిమీద.

మరోసారి మాట్లాడించబోతే, ఆమె చిరునవ్వే సమాధానంగా చెప్పి తన పనిలో తాను మునిగిపోయింది.

అతడిలో ఆమెకు ఎంతో చెప్పాలనే కోరిక అధికం కాసాగింది. ఆమెనుండి ఏవేవో అడిగి తెలుసుకోవాలన్న ఆరాటమూ కలిగింది. కానీ ఆమె మౌనం ఇద్దరిమధ్యా ఎప్పుడో ఏర్పడిన దూరాన్ని అనుక్షణమూ గుర్తుచేస్తుంటే అతడిక ఆగలేకపోయాడు.

సాయంత్రం ఆమె అతడిని నిలబెట్టి బట్టలు మార్చాక చప్పున నేలకు జారాడు. ఆమె మోకాళ్ళ పైభాగాన్ని తన ఎడమచేతితో చుట్టేసి భోరున ఏడవసాగాడు. "వద్దు గౌతమీ! నువ్వు ఇలా మౌనంగా ఉండి నన్ను బాధపెట్టొద్దు. అసలే చచ్చిన పాములాంటి నన్ను మళ్లీ చంపే ప్రయత్నం చేయొద్దు. నాకు నీ గురించి అంతా తెలుసు. అయినా నా వ్యసనాలను ప్రశ్నించి, అడ్డుకుంటావనే భయంతో నిన్ను ఎలాగైనా నా గుప్పిట్లో ఉంచుకోవాలనే అలా దారుణంగా ప్రవర్తించేవాడిని. నేను ఏం చేసినా నువ్వు ఏమీ చేయలేవనే నా అహంకారం నిన్ను చివరికి సిగరెట్ పీకలతో కాల్చేవరకూ తీసుకెళ్ళింది... నువ్వు వంశీకృష్ణ ఇంటికెళ్ళినా తప్పుచేయలేదని నాకు తెలుసు. కానీ నాలోని 'కసి' నీమీద నింద వేసేలా చేసింది. ఆ బిడ్డ నా బిడ్డ. నా రక్తం పంచుకుపుట్టిన బిడ్డ. ఆ విషయం నాకు తెలుసు... ఏదేమయినా ఇంతకాలం నిన్ను శారీరకంగా, మానసికంగా హింసించినందుకు దేవుడు నాకు తగిన శిక్ష విధించాడు. ఫలితం అనుభవించాను... శిక్ష అనుభవించాను. కాబట్టే నిన్ను అడుగుతున్నాను. నాకు నువ్వు కావాలి. మనిద్దరం ఇకనుండి నిజమైన భార్యాభర్తల్లా కాపురం చేయాలి. అది నా కోరిక... అలాకాకుండా ఈ అవిటివాడితో నాకేం పని అనుకుంటే నీ బతుకు నువ్వు బతుకు. అందుకు కూడా నేను అభ్యంతరం పెట్టను. కానీ ఒక్కమాట మాట్లాడు... నాతో ఒక్కమాట మాట్లాడు... గౌతమీ! మాట్లాడు.... ప్లీజ్ మాట్లాడు...."

వాకిలి దగ్గర ఏదో చప్పుడయినట్టనిపించడంతో గౌతమి తలతిప్పి చూసింది. అటుచూడడంతోనే ఆమె పెదవులు బిగపట్టింది.

అక్కడ... రేణుక, సమన్విత, ఆమె తండ్రి కృష్ణకిశోర్ ఉన్నారు.

అప్పుడే అటుచూసిన సత్యమూర్తి వాళ్ళను చూడడంతోనే తడబడి, తూలుతూ పైకి లేచి బెడ్‌మీద వాలిపోయాడు.

ఆ ముగ్గురూ లోపలికి వచ్చారు.

రేణుక అంది. "సారీ! సమన్విత... నాన్నగారు అనుకోకుండా హైదరాబాద్ వచ్చారు.

ఈ విషయం తెలిసి పరామర్శించేందుకు వచ్చారు''

ఆయన సత్యమూర్తితో రెండు నిముషాలు మాట్లాడారు. 'యాక్సిడెంట్ ఎలా జరిగింది. ప్రస్తుతం నొప్పి ఎలా ఉంది' అన్న విషయాలు అడిగి తెలుసుకున్నారు.

ఆ తర్వాత గౌతమికేసి తిరిగి "జాగ్రత్తగా చూసుకోమ్మా! ముఖ్యంగా ఈ సమయంలో మంచి ఆహారం ఇవ్వాలి. అంతేకాదు. శారీరకగాయం మానడంతోపాటు, మానసికస్థైర్యం పేషెంట్‌కి కలిగితేనే అతడు తొందరగా కోలుకుంటాడు'' చెప్పాడు.

రాకూడని సన్నివేశంలో వచ్చి, చూడకూడని దృశ్యం చూసిన వాళ్ళ రాకవలన ఏర్పడిన కంగారు ఇంకా తగ్గలేదామెలో. ఆమె నిశ్శబ్దంగా తలాడించింది.

"వెళ్ళొస్తానమ్మా'' ఆయన నడుస్తుంటే వెనుకే నడిచారు ముగ్గురూ.

కారిడార్‌లో కొంతదూరం నడిచాక ఆయన ఆగారు. వెనుకే అనుసరించి వచ్చిన గౌతమికేసి ఆప్యాయంగా చూసి చెప్పాడు. "నేను నిన్ను చూసి చాలా సంతోషిస్తున్నానమ్మా... నేను అతడి కళ్ళల్లోకి చూశాను. పశ్చాత్తాపం అణువణువునా అతడిని దహించివేస్తోంది. రాక్షసుడిలాంటి వ్యక్తిని... మనిషిగా మార్చగలిగావ్ నువ్వు. ఐ యామ్ రియల్లీ అప్రిసియేటింగ్ యూ''

ఆమె మాట్లాడలేదు. మౌనంగా తలొంచుకుంది.

ఆ ముగ్గురూ ముందుకు సాగారు.

★ ★ ★

అదేరోజు సాయంత్రం గౌతమి ఇంటికెళ్ళేసరికి హాలులోనే కూర్చుని ఉన్నారందరూ. లోపలికొస్తున్న ఆమెకేసి వాళ్ళంతా అదోలా చూశారు.

వాళ్ళంతా ఏదో సమావేశం జరుపుకుంటున్నట్టు అలా ఎందుకు కూర్చుని ఉన్నారో ఆమెకు అర్థంకాలేదు. ఆమె వాళ్ళ దగ్గరగా వెళ్ళి "ఏమిటిలా కూర్చున్నారు. ఎనీ ప్రాబ్లమ్'' ప్రశ్నించింది.

"యస్. సిడవున్' తనపక్కనే చోటు చూపిస్తూ చెప్పింది సమన్విత.

గౌతమి అక్కడున్నవాళ్ళందరికేసి ఓసారి అదోలా చూసి సమన్విత పక్కనే కూర్చుంది. అయితే ఎవ్వరూ ఆమెతో మాట్లాడలేదు. వాళ్ళలోవాళ్ళు ఒకరికొకరు సైగ చేసుకుంటూ 'నువ్వు మాట్లాడు' అంటే 'నువ్వు మాట్లాడు' అనేలా తలలూపుతున్నారు. దాంతో ఆమెకు సిట్యుయేషన్ అర్థంకాలేదు. ఆమె మరింత అయోమయంగా వాళ్ళకేసి చూడసాగింది.

దాంతో ఇక తనయినా మాట్లాడక తప్పదన్నట్టు కృష్ణకిశోర్‌గారు గొంతు సవరించుకున్నారు. "అదేనమ్మా! మధ్యాహ్నం సత్యమూర్తి నిన్ను తన ఇంటికి రమ్మనడం చూశాక, నువ్వు ఏం నిర్ణయం తీసుకున్నావో తెలుసుకోవాలని మనవాళ్ళంతా టెన్షన్ ఫీలవుతూ, ఆ విషయం ఎలా అడగాలా అని తర్జన భర్జన పడుతున్నారు అంతే'' ఆయన చెప్పటం పూర్తిచేశాక అక్కడున్న వాళ్ళందరి ముఖాలకేసి చూశాడు. పెద్ద బరువు తొలగినట్టు వాళ్ళ ముఖాలలో రిలీఫ్ కదలాడుతోంది.

గౌతమి వాళ్ళందరికేసి ఓసారి తలతిప్పి చూసింది. వంశీకృష్ణ మీద కాసేపు చూపు ఎక్కువసేపు నిలిపింది. తల తిప్పుకున్నాక కిటికీలోనుంచి బయటకు చూపులు సారించి చెప్పింది. "నేను మావారి దగ్గరికే వెళ్ళిపోవాలని నిర్ణయించుకున్నాను''

అక్కడున్న ప్రతి ఒక్కరూ కాస్త నిరాశగానే ఆమెకేసి చూశారు.

రేణుక మాత్రం అడిగేసింది "అలా చెయ్యాలని ఎందుకనుకుంటున్నావ్ గౌతమీ''

గౌతమి తలాడించి చెప్పింది. "పశ్చాత్తాపానికి మించిన ప్రాయశ్చిత్తంలేదు. ఆయన నిజంగానే జరిగినదానికి బాధపడుతున్నారు.





నేను ఇప్పుడు ఆయనను ఆదరించకపోతే, ఆయన చాలా కష్టాలు అనుభవించాల్సి ఉంటుంది. ఎదుటివ్యక్తి మనలను బాధపెట్టా డని మనమూ అతడిని బాధపెట్టాలనుకో వడం సరికాదు. బాధ మరీ భరించలేనిదయి తే ఆ మనిషిని వదిలేయొచ్చు... ఏదేమయి నా ఆయన తను చేసినది తప్పు అని వప్పుకున్నాడు. కాబట్టి జరిగినదంతా మరి చిపోవాలనే నేను అనుకుంటున్నాను''

సమన్విత అనుమానం వ్యక్తం చేసింది. "ఒకవేళ... అఫ్‌కోర్స్! అలా జరగకూడదనే కోరుకుందామనుకో... అయినా కీడెంచి మే లెంచమన్నారు కాబట్టి అడుగుతున్నాను... నువ్వు అక్కడికెళ్ళాక అతడు ఎలాగూ వచ్చే సిందికదా అని మునుపటిలాగా ప్రవ ర్తించడం మొదలెపెడితే?"

"ఖచ్చితంగా అలా ప్రవర్తించడు. అందుకు తన శారీరక పరిస్థితి కూడా సహకరించదు. ఒకవేళ నువ్వు అనుమా నించిందే నిజమైతే, అప్పుడు మరో ఆలోచన లేకుండా ఆ ఇంటినుంచి బయటికొచ్చేస్తాను. ఏదో మీలాంటి మంచివ్యక్తుల సహకారంతో బతుకుతెరువు గురించి భయపడాల్సిన అవ సరంలేకుండా ఓ విద్య నా చేతిలో ఉంది. ఆ విద్యతో నా బిడ్డ, నేను సుఖంగా బతక గలం... అయినా అతడు అలా చేయడనే నాగట్టినమ్మకం"

కృష్ణకిశోర్‌గారు అన్నారు "గౌతమి మాట ల్లో నిజం ఉంది. ఆమె నిర్ణయం సరయినదే నని నా అభిప్రాయం"

రేణుక "మా బాబాయ్ అభిప్రాయం కరక్ట్ అని నేనూ అనుకుంటున్నాను'' చెప్పింది.

సమన్విత మౌనంగా ఉంది. మౌనం అర్థాంగీకారమనే అనుకోవాలి.

మెల్లగా గౌతమి మనసులోని మాట యొ క్క విలువలు మిగిలినవాళ్ళకూ అర్థమ యింది. వాళ్ళు సాలోచనగా తలలాడించా రు.

పార్వతమ్మ మరేం మాట్లాడకపోవడంతో గౌతమి ఆమెతో చెప్పింది. "ఇది నా అభి ప్రాయం మాత్రమే. మీరు ఒప్పుకుంటేనే నిర్ణయమవుతుంది''

"లేదమ్మా! కాస్త ఆలోచించాక నీ అభి ప్రాయం సరయినదేనని మాకూ అర్థమ యింది. నువ్వు సంతోషంగా నీ భర్త దగ్గరకె ళ్ళు. అయితే ఒక్కటిమాత్రం గుర్తుంచుకో, నీకు ఎప్పుడు ఏ కష్టం వచ్చినా ఈ ఇంటిత లుపులు నీకోసం తెరిచే ఉంటాయి... ఆ విషయం మర్చిపోకు''

ఆ సమయంలో ఆమెకు గౌతమి తనకు చేసిన సేవలు గుర్తుకొచ్చాయి. ఈరోజు తన భర్త లేచి తిరగగలుగుతున్నాడంటే అందుకు కారణం ఈ అమ్మాయే అనుకోవలసి ఉంటుంది. ఆమె వచ్చాక తమ కుటుంబం కొన్ని అవమానాలు, నిందలు భరించి ఉండొ చ్చు కానీ ఆమె వచ్చాకే తమ ఇంట్లో ఎన్నో మార్పులు వచ్చాయి. ఆహ్లాదకరమైన వాతా వరణం ఏర్పడిందన్నమాట వాస్తవం... అందుకే ఆమె గుండె బరువెక్కింది.

గౌతమి తలాడించింది.

ఆ సంఘటన జరిగిన ఆ సాయంత్రమే సత్యమూర్తిని హాస్పిటల్‌నుంచి డిశ్చార్జి చేశా రు. అయితే రోజూ ఇంజక్షన్ చేయించుకో వాలి. వారానికి ఓరోజు వచ్చి బాండేజీ మార్పించుకుని వెళ్ళాలి.

సత్యమూర్తిని ఇంటికి తీసుకువచ్చాక, ఆ రాత్రి బట్టలు తెచ్చుకునేందుకు గౌతమి వంశీ కృష్ణ ఇంటికెళ్ళింది.

ఆ ఇంట్లోనుండి బట్టలు తీసుకుని వస్తూ ఉంటే, మనసంతా అదో రకమైన ఉద్విగ్న తతో నిండిపోయింది. ఓ పవిత్ర దేవాలయం నుండి బయటికొస్తున్న అనుభూతి కలిగింది.

ఇంట్లోనుంచి ఇవతలకొచ్చాక తదేకంగా ఆ ఇంటికేసి చూసింది. ఆ ఇల్లు తనకు 'నీడ



నిచ్చిన పవిత్రస్థలం. ఆ ఇంట్లో తనకు నీడ దొరకకుండా ఉండి ఉంటే తనేమయిపోయి ఉండేది? ఇలా తిరిగి సంతోషంగా బతికే అవకాశం మాత్రం తనకు ఉండేది కాదుగాక కాదు.

ఈ దేశంలో భర్తలచేత నరకయాతన అనుభవించే ఎందరో అభాగ్యస్త్రీలలో తనెంతో అదృష్టవంతురాలనే అనుకోవాలి. అందుకే ఆచోట ఆశ్రయం దొరికింది. మరి ఈ దేశంలో అభాగ్య స్త్రీలందరికీ ఎవరో ఒకరు 'నీడ నిస్తే ఎంత బాగుండునో కదా?... కానీ ఈ దేశంలో అంత విశాలహృదయం ఉన్న మగాళ్ళ సంఖ్య చాలా తక్కువ. అందుకే తనది అత్యాశ అనే అనిపిస్తోంది.

ఆ ఇల్లు తనకు పక్క ఇల్లే కాబోతున్నా, ఆ ఇంటిలోని మనుష్యులకు దూరంగా వెళ్తున్నానన్న భావం బాధాకరం కావడంతో చప్పున తలదించుకుని వడివడిగా గేటు దాటింది గౌతమి.



వంశీకృష్ణ ఇంట్లో పెళ్ళిపనులు ప్రారంభమయ్యాయి.

ఆ ఇంటి ఏకైక వారసుడికి జరుగుతున్న పెళ్ళి అది. ఎన్నో ఏళ్ళ తర్వాత ఆ ఇంట్లో జరుగుతున్న సంబరం. ఇక తమ ఇంటికి ఆ కళ రాదనుకున్నవేళ వస్తున్న వసంతం అది. అందుకే ఆకాశమంత పందిరి, భూదేవంత అరుగు నిర్మించి పెళ్లి జరిపించాలన్నంత ఉత్సాహంతో ఉన్నారు ప్రభాకరరావు, పార్వతమ్మలు.

రెండు కుటుంబాలూ ఆర్థికంగా సంపన్నమయినవి కావడంతో ఖరీదయిన వాతావరణం సృష్టించే ప్రయత్నం జరుగుతోంది.

అక్కడ జరిగే తంతు చూస్తూ కూడా తన ఇంటికే పరిమితమయింది గౌతమి. భర్తకు పరిచర్యలు చేస్తూ, పిల్లవాడి ఆలనాపాలనలో కాలం దొర్లించసాగింది.

రెండురోజులపాటు గౌతమి పక్కింటికి వెళ్లకపోవడం చూసి సత్యమూర్తి ఆమెతో అన్నాడు, "గౌతమీ మీ ఆంటీ ఇంట్లో అంత సందడి జరుగుతుంటే కనీసం అటువెళ్ళి వాళ్ళకు కాస్తయినా సహాయం చేయకూడదూ?"

ఆమె అనుమానంగా అతడి ముఖంలోకి చూసింది. అతడు వ్యంగ్యంగా ఆ మాటలు అనడంలేదుకదా?... లేదు... అతడి ముఖం నిర్మలంగా ఉంది. ప్రశాంతమయిన చూపులతో అతడు తననే చూస్తున్నాడు.

"వద్దులెండి. ఇంట్లో చాలా పని ఉంది. పిల్లవాడిని వదిలివెళ్లడమంటే వాడు ఏడుస్తాడు. వాడిని సముదాయించడం చాలా కష్టం"

"అయినా ఫర్వాలేదు. వాడిని నేను చూసుకుంటాను. నువ్వెళ్ళు గౌతమీ''

అతడు రెండు, మూడుసార్లు అదేపనిగా చెప్పాడు.

"అక్కడికి నేను వెళ్ళి చేసేదేముందండీ. వాళ్ళు డబ్బున్న మహారాజులు. వందల మంది వాళ్ళచుట్టూ ఉండి, పనులు చేసేందుకు సిద్ధంగా ఉంటారు''

"డబ్బు మనుష్యులు ఎంతమందయినా ఉండొచ్చు. కాని సొంతమనుష్యులు అంటూ కొంతమందయినా ఉండటం అవసరం. నువ్వు అక్కడికెళ్ళి పనిచేయక్కర్లేదు. అజమాయిషీ చేస్తే చాలు. అందులోనూ వాళ్ళు నిన్ను ఇంతకాలం ఆదరించిన వ్యక్తులు. అవసరసమయంలో అసలు కనిపించకపోతే 'కృతఘ్నురాలు' అనుకునే అవకాశం ఉంది.

అతడు మరీ అంత పట్టుబట్టి చెపుతుండడంతో ఆమె తప్పదన్నట్టుగానే, వంశీకృష్ణ ఇంటికెళ్ళింది.

ఆమె రావడం చూసి పార్వతమ్మ, ప్రభాకరరావులు పొంగిపోయారు.

"మీ ఆయన నువ్వు ఇక్కడికి రావడానికి





ఒప్పుకున్నాడా గౌతమీ'' ఆరాగా అడిగింది పార్వతమ్మ.

"నేను వెళ్ళనన్నా బలవంతపెట్టి ఆయనే నన్ను ఇక్కడికి పంపారు'' భర్త తనతో అన్నమాటలన్నీ యధాతథంగా వివరించింది గౌతమి.

"అయితే మీ ఆయన ఇప్పుడిప్పుడే మంచితనం చూపించడం మొదలుపెడుతున్నాడన్నమాట" పార్వతమ్మ నవ్వింది. ఆవిడకు మనసులో ఓ మూల తిష్టవేసుకుని కూర్చుని ఉన్న దిగులు కొంత తగ్గినట్టనిపించింది.

గౌతమి ఆ ఇంట్లో పనులు చేయడం మొదలుపెట్టింది. వరాలును దగ్గరుంచుకుని ఇంట్లోని సామాను దుమ్ముదులిపి, నీట్‌గా అలంకరించడంలాంటి పనులు చేయడం ప్రారంభించింది.

తన పెళ్ళిపనులలో గౌతమి కూడా పాలు పంచుకోవడం చూసి వంశీకృష్ణ సంతోషపడ్డాడు. ఈ విషయం ఫోన్‌లో రేణుకకు కూడా చెప్పాడు.

రెండోరోజు, తన ఇంటినుంచి పెళ్ళివారింటికి గౌతమి బయలుదేరుతుంటే, సత్యమూర్తి భార్యతో అన్నాడు. "ఆ పెద్దావిడకు పిల్లలంటే బాగా ఇష్టమనుకుంటాను. ఆవిడ చాలారోజులు వీడిని ఆడిస్తూ ఆనందపడిపోతూ ఉండి ఉంటుంది. ఇప్పుడు మనం వీడిని మనింటికి తెచ్చేసుకున్నాం. ఎంతయినా పెంచిన ప్రేమంటూ కొంత ఉంటుందికదా? పోనీ ఈరోజు వీడిని తీసుకెళ్ళి ఆవిడకివ్వు. మధ్యాహ్నం వచ్చేప్పుడు తీసుకువచ్చేసేయ్..."

గౌతమి విస్ఫారిత నేత్రాలతో కొద్దిసెకనులపాటు అతడికేసే అలాగే చూస్తుండిపోయింది. 'రాక్షసుడిలో కూడా మంచితనం మనసుపొరల్లో ఎక్కడో ముడుచుకుని ఉంటూ ఉండొచ్చు. అయితే ఆ మంచితనాన్ని బయటకు రప్పించగలగాలి. అది అందరి విషయంలో, అన్నివేళలా సాధ్యంకాకపోవచ్చు'

"...తీసుకువెళ్ళు గౌతమీ''

గౌతమికి జరుగుతున్నదంతా కలలా ఉంది. సత్యమూర్తిలో అంతమార్పు ఆమె ఊహించనిదయింది. ఆమె స్వప్నంలో ఉన్నట్టుగా కదిలి వెళ్ళి బిడ్డను చేతుల్లోకి తీసుకుంది.

రెండోరోజు సత్యమూర్తిలోని మార్పు విన్నాక, ఆ ముసలి దంపతుల ఆనందానికి అవధులు లేకుండాపోయింది.

"నీ భర్తలో ఆ మార్పు వచ్చిందంటే, నీ సంసారం ఇక సుఖంగా గడిచిపోతుందనే అనిపిస్తోంది. పోనీలేమ్మా ఇప్పటికైనా నీ కష్టాలు గట్టెక్కాయి'' అంది పార్వతమ్మ.

ఆవిడ పిల్లవాడ్ని తన ఒడిలో కూర్చోబెట్టుకుని ఆడించసాగింది.

గౌతమి ఆరోజు గడపలకు పెయింట్ చేయడం, ఇంట్లో పెయింట్‌తో ముగ్గులేయడంలాంటి పనులు చేసి అలసి ఇంటికి చేరింది.

ఆమె ఇంటికి చేరాక నుదుటపట్టి ఉన్న చెమటను ఎడమచేత్తో తుడుస్తూ అదోలా నవ్వాడు సత్యమూర్తి.

అతడి నవ్వు చూసి "ఎందుకు నవ్వుతున్నారు?" అడిగింది గౌతమి.

"ఏంలేదు'' తల విదిలించి, మాట దాటించే ప్రయత్నంలో "ఇంతకీ ఆ ఇంట్లో ఇప్పటివరకూ ఏం పని చేసి వచ్చావ్?" నవ్వుతూనే ప్రశ్నించాడు.

"ఆ ప్రశ్నకు జవాబు తర్వాత చెపుతాను. ముందు మీరెందుకు నవ్వారో చెప్పండి''

"ఏమీ లేదంటున్నానుగా''

"చెప్పితీరాలి''

అతడు ఆమె ముఖంలోకే కొద్దిక్షణాలు చూశాక, తల దించుకుని చెప్పాడు. "దేవుడు నాకు ఎంత శిక్ష విధించాడంటే కష్టపడి

వచ్చిన నా భార్యమీద జాలి కలిగి ఆమెను నాకు దగ్గరగా తీసుకోవాలనుకుంటే... రెండుచేతులూ లేకుండా చేశాడు. ఒక్కచెయ్యి మాత్రమే మిగిల్చి, నా ప్రేమను గాఢంగా తెలియచేసే అవకాశం లేకుండాచేశాడు..."

ఆమె అతడిని దగ్గరగా తీసుకుని ఓదార్చాలనే కోరికను అతికష్టంమీద అణచుకుంది. బాధను దిగమింగి, పెదవులు బిగపట్టి అతడికేసే చూడసాగింది.

"...నిజానికి ఇది నాకు తగిన శిక్షే. నా పాపానికి పడాల్సిన శిక్షే..." గొణుక్కుంటూ అవతలికెళ్ళిపోయాడు సత్యమూర్తి.

గౌతమి చాలాసేపు అలాగే నిలబడిపోయింది.

సత్యమూర్తి పూర్తిగా మారిపోయాడు అనేందుకు రుజువు, మరోరోజు ఆమె వంశీకృష్ణ ఇంటినుంచి వచ్చినప్పుడు దొరికింది.

ఆరోజు ఆమె పసివాడిని ఆ ఇంటికి తీసుకెళ్లలేదు. ఆ ఇంట్లో పనులన్నీ చేసి అలసి ఇంటికి చేరింది.

గౌతమి వాకిట్లో అడుగుపెట్టేసరికి లోపలినుంచి సత్యమూర్తి గొంతు వినిపించింది. "రేయ్... వంశీ!... లలాలా వంశీ... నవ్వరా వంశీ..." అతడు తన కొడుకును లాలిస్తున్నాడు.

ఆమె తన చెవులను తానే నమ్మలేకపోయింది. సత్యమూర్తి నోటివెంట 'వంశీ' అన్నపేరు... అదీ తన బిడ్డకు ఆ పేరు పెట్టి పిలవటం... ఇది.... ఇది అసలు నమ్మదగిన విషయమేనా? తన చెవులు తనను మోసం చేయడం లేదుకదా?

గౌతమి వాకిట దగ్గరే నిలచిపోవడం చూసిన సత్యమూర్తి "గౌతమీ! ఏమిటీ అక్కడే నిలబడిపోయావ్. లోపలికిరా'' పిలిచాడు.

ఆలోచనా రహితంగానే ఆమె ఇంట్లోకి నడిచింది. అతడి దగ్గరగా వెళ్ళి అడిగింది. "మీరు... మీరిప్పుడు వీడిని ఏం పేరు పెట్టి పిలిచారు?"

"వంశీ'' నవ్వుతూ చెప్పాడు సత్యమూర్తి.

"మీరు... ఆపేరు..." ఆమె అర్థంకానట్టుగా భర్త ముఖంలోకి చూసింది.

"ఓహో... అదా నీ కన్‌ఫ్యూజన్..." అతడు నవ్వాడు. "మనవాడికి నేను వంశీకృష్ణపేరు పెట్టాలని అనుకుంటున్నాను. ఏం తప్పా?"

"అనికాదు. కానీ..." ఆమె మనసులో ఏదో సందిగ్ధం.

"నీ అనుమానం నాకు అర్థమయింది. ఒకప్పుడు గొడవపడిన వంశీకృష్ణ పేరే నేను నా బిడ్డకు ఎందుకు పెట్టాలనుకుంటున్నానా అని నీ అనుమానం కదూ? అప్పుడు నాది మూర్ఖత్వం. విచక్షణాజ్ఞానరహితంగా ఎదుటిమనిషిని హింసించటమే పనిగా పెట్టుకున్నాను. కాని ఇప్పుడు... నాకిప్పుడు వంశీకృష్ణమీద ఎలాంటి కోపమూ లేదు. పైగా అతడి ఆదర్శాన్ని నేను అభినందిస్తున్నాను. అతడి మంచిమనసుకు రెండు చేతులతో నమస్కరించాలని ఉన్నా, అందుకు అశక్తుడిని. దేవుడు నాకు ఒక్క చెయ్యిమాత్రమే మిగిల్చాడు. ఈరోజు నా కాపురం నిలబడిందంటే అందుకు కారణం వంశీకృష్ణ అనే నాకు తెలుసు. అంత మంచివ్యక్తి పేరు నిత్యం స్మరించినా తప్పులేదు. అందుకే నా బిడ్డకు ఆపేరే నేను నిర్ణయించాను..."

ఎప్పటినుంచో అణచుకున్న దుఃఖం ఇక ఆగలేనంటూ పొంగిపొరలింది. ఆమె ఒక్క అంగ అటుగా వేసి అతడి తలను తన గుండెలకేసి అదుముకుంది. ఆ క్షణం మాటలే కరువయ్యాయి. ఘనీభవించి ఉన్న దుఃఖం అతడి మంచితనంచూసి కరిగి కన్నీళ్ళుగా బయటికొచ్చింది.

ఆమె మనసు తేలికయింది.







# చతుర కతలు

## ఫైన్... ఫైన్...

ప్రొఫెసరు రంగనాయకులు చాలా ఉల్లాసంగా ఉన్నాడు. తను అనుకొన్న పని ఒకటి సాధించుకొచ్చాడు. క్లిష్టతరమైన పనిని అవలీలగా తనొక్కడే చెయ్యగలిగాడు. ఈ విషయం వింటే భార్యామణి భాను చాలా సంతోషిస్తుంది. భాను గుర్తుకురాగానే రంగనాయకులు హీమాన్ అయిపోయాడు. కారు బులెట్‌లా ముందుకు దూసుకుపోతోంది. విదేశాల్లో అయితే తనొక్కడే హైవేమీద వేలకు వేల మైళ్లు సునాయాసంగా డ్రైవ్ చేసేవాడు. కాని ఇండియాలో రోడ్లు అంత మంచివికావు, జనానికి సివిక్‌సెన్స్ అసలేలేదు. దానికి తోడు గడ్డి మోపులతో నాటుబళ్లు. స్పీడు బ్రేకర్సులా తన వేగానికి అవరోధాలు. అయినా ప్రొఫెసరుగారు దృఢ నిశ్చయంతో ముందుకు సాగిపోతున్నారు. కొత్తగా కొన్నకారు, జపాను నుంచి వచ్చింది. కొత్త బిచ్చగాడు పొద్దెరగడు అన్నట్లు రంగనాయకులు స్పీడుగా, అతి స్పీడుగా పోతున్నాడు.

ఒకచోట కారాపవలసి వచ్చింది. టోలు గేటు గాబోలు, గేటు మూసి ఉంది. ఆగిన కారు దగ్గరకు ఖాకీయూనిఫామ్‌లో ఉన్న ఇన్‌స్పెక్టరు వచ్చాడు. చేతిలో వాకీటాకీ, చలాను పుస్తకం ఉంది.

"సార్! మీరు స్పీడు లిమిట్స్ అతిక్రమించి వస్తున్నారు. ఫైన్ కట్టాలి" అన్నాడు ఇన్‌స్పెక్టరు. చలాను రాస్తున్న ఇన్‌స్పెక్టరు



వైపు చూశాడు ప్రొఫెసరు. ఏకధ్యానంతో రాస్తున్నాడు. రంగనాయకులు దృష్టి దాని పైపడింది. పెనాల్టీ రూ. 250/- అని రాస్తున్నాడు ఇన్‌స్పెక్టరు. ప్రొఫెసరు తన ఐడెంటిటీ కార్డు చూపించాడు. ఇన్‌స్పెక్టరు అది చూడగానే అలర్టు అయి అటెన్షన్‌లో నిలబడి సెల్యూట్ చేశాడు.

"ప్రొఫెసరు రంగనాయకులు మీరేనా సార్! దేశం గర్వించదగ్గ వ్యక్తుల్లో మీరొ



కరు. అయితే మీరు ఇండియాకి పర్మనెం టుగా వచ్చేసినట్లేనా!" స్టాప్ లేకుండా మాట్లాడుతున్నాడు పోలీసాఫీసరు.

రంగనాయకులు గర్వంగా నవ్వుకొ న్నాడు. పిల్లకాకి కేం తెలుసు ఉండేలు దెబ్బ. తనలాంటి మేధావికి జరిమానా విధించగల సత్తా ఉందా! అదీ ఒక సామా న్యుడైన ఇన్‌స్పెక్టరుకి. అలవోకగా ఎడం చెయ్యి మీసాలమీదికి వెళ్లింది. సడెన్‌గా వెనక్కు వచ్చేసింది చేయి. తనది పేడి మొహం. పెళ్లయిన తర్వాత భాను మీసాలు తీయించేసింది. అమెరికన్లకి మీసా లుండవని తనని అలాగే ఉండాలని రూలు పెట్టింది.

ఆలోచనలలో ఉన్న ప్రొఫెసరు దృష్టి ఇన్‌స్పెక్టరు రాస్తున్న రాతపై పడింది. రెండు వందల యాభై రూపాయలన్న అంకె కొట్టివేసి ఐదువందలని హెచ్చించి రాశాడు. కింద నోటులో ఇలా రాశాడు.

కోర్టులో వ్యక్తిగతంగా హాజరు కావాలి... డ్యూటీలో ఉన్న పోలీసు ఉద్యోగిని తన అధికారంతో ఇన్‌ఫ్లూయన్స్ చేసినందుకు గాను.

**- ఆనందరావ్ పట్నాయక్**

---

# అదృష్టపత్రం

"చాందిని- సినీ ఆర్టిస్ట్"

గేటుముందున్న నేమ్‌ప్లేట్ చూసి నడు స్తున్నవాడల్లా ఠక్కున ఆగాడు రవిచంద్ర.

అతని కళ్లలో వింతకాంతి. లాల్చీ జేబు లోనుండి భద్రంగా మడతపెట్టి ఉంచిన కాగితాన్ని తీసి కళ్ళకద్దుకొని ముద్దాడాడు. మెల్లిగా గేటువైపు నడవసాగాడు.

"అల్లాఉద్దీన్‌కి అద్భుతదీపం దొరికినట్లు ఈ రవిచంద్రకు ఈ అదృష్టపత్రం దొరి కింది. ఈ దెబ్బతో దరిద్రం వదిలిపోయి అష్టైశ్వర్యాలతో హాయిగా బతకవచ్చు" తనలో తాను అనుకొంటూ గేటుమీద చేయి వేసి లోపలికి తోయబోయాడు.

"హైరో హైరో" అంటూ ఎక్కడనుంచో పరు గెత్తుకొంటూ వచ్చాడు గుర్ఖా.

అంతలోనే హారన్ మోగించుకొంటూ ఓ కారు వచ్చింది.

వెంటనే గుర్ఖా సెల్యూట్ చేసి గేటు తీశాడు.

కారు లోపలికి దూసుకుపోయింది.

వెంటనే గేటు వేసేశాడు గుర్ఖా.

అప్పటికే ఆ కారు వెనుకసీట్లో ఉన్న చాందినిని గుర్తించాడు రవిచంద్ర.

వెంటనే ఓ తెల్లకాగితంమీద గబగబా ఏదో రాసి గుర్ఖాదగ్గరకు వచ్చి "ఇది తీసు కువెళ్ళి చాందిని మేడమ్‌గారికి ఇవ్వు" అతనికి అర్థమయ్యేలా సైగచేసి చెప్పాడు.

లెటర్ తీసుకొని గుర్ఖా లోపలికి వెళ్ళాడు.

దాదాపు గంట గడిచాక గుర్ఖా నవ్వుము ఖంతో బయటకు వచ్చాడు.

"వాంగో" అన్నాడు.

"ఇప్పుడు వంగోడం ఎందుకూ? " అతనికి అర్థంకాలేదని అర్థమైన గూర్ఖా చేతులతో లోపలికి వెళ్ళమని సైగచేశాడు.

రాజమహల్‌లా ఉన్న బంగ్లాలోకి ప్రవేశిం చాక సోఫా చూపించి "బైఠోసాబ్" అని అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు గుర్ఖా.

రవిచంద్ర సోఫాలో కూర్చొని హాలుని పరిశీలించసాగాడు. హాల్లో ఉన్న ఖరీదైన ఫర్నిచర్‌ని చూసి దాదాపు పదిలక్షలు ఉంటుందని తీర్మానించుకొన్నాడు. తను మాత్రం ఏం తక్కువ ఇంకోఇరవైనాలుగు గంటల్లో లక్షాధికారి కాబోతున్నాడు. ఇదంతా ఈ అదృష్టపత్రం తెచ్చిన అదృష్టమే అనుకొంటూ జేబులోనుండి ఆ కాగితాన్ని





తీసి భక్తితో కళ్ళకద్దుకొన్నాడు.

"ఎవర్నువ్?" అన్న ప్రశ్న వినిపించ డంతో అటువైపు చూశాడు.

సోఫాలో దర్జాగా కాలుమీద కాలువేసు కొని కూర్చొని ఉంది ఒక స్త్రీ.

"నువ్వెవరు? వెళ్ళి చాందిని మేడమ్‌గార్ని పిలుచుకురా" అన్నాడు చిరాగ్గా.

ఆ మాటలకు ఆమె ముఖమంతా ఎర్రబ డుతుండగా ఛర్రున సోఫాలోనుండి లేచి, "నువ్వు ఎవరితో మాట్లాడుతున్నావో

"ఏమిటా భవిష్యత్? అవునూ ఇందాక నువ్వు రాసిన ఆ లెటర్‌లో నా జీవితానికి సంబంధించిన విషయమేదో నీ దగ్గర ఉందనీ, అది బయటపెడితే చాలా నష్టపో తానని రాశావు. ఏంటా రహస్యం చెప్పు"

"చెబుతా... చెప్పేముందు మనిద్దరం ఒక అగ్రిమెంట్ చేసుకొందాం. నా దగ్గిర నీ జీవితానికి సంబంధించిన కాగితం ఉంది. అది నీకు ఇవ్వాలంటే నువ్వు నాకు సింపు ల్‌గా ఓ యాభైలక్షలు ఇవ్వాలి. ఏమం టావ్?" తెలుగు సినిమాల్లో నటించే ఓ



తెలుసా? నేనే చాందినిని" అంది.

అదిరిపడ్డాడు రవిచంద్ర. ఆశ్చర్యంగా ప్రశ్నార్థకంగా అవునా అని నమ్మలేనట్లు ఆమెవంక ఎగాదిగా చూశాడు.

"ఓ సారీ చాందినీ! మేకప్ లేకపోయేస రికి పనిమనిషి అనుకొన్నాను" అన్నాడు నవ్వుతూ.

"షటప్! మర్యాదలేకుండా మాట్లాడకు. చాందినిగారూ... మీరు... అను తెలి సిందా?" పెద్దగా అరుస్తూ చెప్పిందామె.

"సారీ చాందిని. ప్రస్తుతం నువ్వే నన్ను అన్నివిధాలా గౌరవంగా మర్యాదగా చూడాలి. ఎందుకంటే నీ భవిష్యత్ నా చేతుల్లో ఉంది."

హిందీ విలన్‌లా నవ్వాడు.

"షటప్, నీ దగ్గర ఉన్న ఆ అదృష్టపత్రం ఏమిటో చెప్పకుండా డబ్బు కావాలం టావేం? మర్యాదగా అదేమిటో చూపించు. లేకపోతే పనివాళ్ళను కేకేసి తన్నిస్తా"

"ఆహ్హాహ్హా ఓహ్హాహ్హాహ్హాహా" అంటూ మళ్ళీ ఆ హిందీ విలన్‌లా నవ్వసాగాడు.

"షటప్, ఆ వెధవనవ్వు ఆపి ఆ అదృష్టప త్రాన్ని చూపించు" విసుగ్గా అందామె.

"అదేంటి సినిమాలో విలన్ నవ్వగానే నువ్వు కెవ్వుమని అరుస్తూ భయంతో వణి

శావుగా? " ఆశ్చర్యంగా అడిగాడు.

"అలా చేసినందుకు నాకు ప్రొడ్యూసర్ డబ్బులిస్తాడు"

"సరే, అయితే ఇదిగో నా పాలిట అదృష్ట పత్రం" అంటూ జేబులో భద్రంగా దాచిన ఆ కాగితాన్ని చాందినికి అందించాడు.

మడతలు విప్పి ఆ కాగితంలో ఉన్న మాటర్ చదవసాగింది. చదువుతున్న కొద్దీ ఆమె ముఖంలో రంగులు మారాయి. వళ్ళంతా చెమటలుపట్టి సన్నగా వణకసాగింది.

"ఇప్పుడు నీకు మంచినీళ్ళు అవసరం" అంటూ వాటర్ జగ్ అందించాడు.

ఆమె దాన్నందుకొని మొత్తం తాగేసింది.

"సమాధానం చెప్పవేం అప్పలమ్మా" అన్నాడు.

ఆమె ఉలిక్కిపడి అతని వంకచూసింది.

"సారీ చాందిని" అన్నాడు.

ఆమె చటుక్కున ఆ అదృష్ట పత్రాన్ని ఉండగా చుట్టేసి నోట్లో వేసుకొని నమిలి మింగేసింది. అది చూసిన రవిచంద్ర ఈసారి షోలే సిన్మాలో గబ్బర్‌సింగ్‌లా నవ్వి "పిచ్చి చాందిని ఇన్ని తెలుగు సినిమాల్లో యాక్షన్ చేశావుగాని, నీకస్సలు బుర్రలేదు. సినీమాల్లో విలన్ బ్లాక్‌మెయిలర్ ఎవరన్నా ఇలాంటివి ఒరిజినల్ కాపీలు హీరోయిన్‌కు ఇస్తారా? " అన్నాడు.

ఆ మాటలతో ఆమెకి ఎక్కడ లేని నీరసం ముంచుకు వచ్చింది "రేపు ఉదయం ఇదే టైంకు రా నీ డబ్బు నీకు ఇస్తాను" అంది.

"అదీ! ఇప్పుడు అసలైన చాందినివి అనిపించావు. సరే రేపు ఉదయం కలుద్దాం" అంటూ బయటకు వెళ్ళిపోయాడు రవి చంద్ర.

అప్పటివరకూ ఆ సంభాషణంతా తలుపు చాటునుండి వింటున్న చాందిని తల్లి నర్సమ్మ గబగబా చాందిని దగ్గరకు వచ్చి "నీకేమన్నా పిచ్చా? వెర్రా? వాడేదో కాగితం చూపించగానే బెదిరిపోయి వాడు అడిగిన డబ్బు ఇస్తానంటున్నావ్. ఇంతకీ ఏముంది ఆ అదృష్టపత్రంలో? హీరో అంజిబాబు, నువ్వు రహస్యంగా రిజిష్టర్ మారేజ్ చేసుకొన్న సంగతా? లేక పెళ్ళికిముందే నీకు అబార్షన్లు అయిన సంగతా? లేక నువ్వు బ్లూఫిలింస్‌లో యాక్షన్ చేసిన సంగతా? ఏముందే అందులో" ఆతృతగా ఖంగారుగా అడిగింది.

"అంతకన్నా ప్రమాదకరమైనది" నీరసంగా చెప్పింది చాందిని.

"ఏంటది? "

"నా డేట్ ఆఫ్ బర్త్ సర్టిఫికెట్"

"అంటే"

"అంటే ఇప్పుడు నా వయస్సు పదహారేళ్ళు కాదు నలభైఏళ్ళని తెలిపే సర్టిఫికెట్. అంతేకాదు నా పేరు చాందిని కాదు అప్పలమ్మ అని తెలిపే డాక్టర్ సర్టిఫికెట్"

- కలవర్తి సత్యం

---

# సెలక్షన్

అమల అందమైన పిల్ల. పోస్టు గ్రాడ్యుయేషన్ చేసి ఓ ఎడ్వర్‌టైజ్‌మెంటు కంపెనీలో ఎగ్జిక్యూటివ్‌గా చేరింది. వర్కింగ్ విమెన్స్ హాస్టల్లో వుంటోంది.

స్కూల్‌డేస్ మొదలుకొని ఆనాటివరకు తన అందంతో మగపిల్లల్ని అలరించి ఏడిపించడం హాబీ అయిపోయిందామెకు.

ఆమధ్య ముగ్గురు యువకులు అమలను ప్రేమిస్తున్నామంటూ వెంటపడ్డారు.

రోజూ రెండుపూటలా అమలకు ఫోన్

చేసి "మిమ్మల్ని గాఢంగా ప్రేమిస్తున్నాను" అనేవాడు రవి అన్న యువకుడు.

ఓ అందమైన లెటర్‌హెడ్‌మీద 'ఐ లవ్ యూ- శరత్' అని రాసి కవరులో పెట్టి రోజుకో లెటరు పోస్టులో పంపించేవాడు మరో యువకుడు.

ఇకపోతే, మూడవవ్యక్తి నిత్యమూ ఓ అందమైన పుష్పగుచ్ఛాన్ని కొని, అందులో 'ప్రేమతో- సాగర్' అన్న కార్డు వుంచి పంపించసాగాడు.

అలా మూడు నెలలుగా తన వెంటపడుతూన్న ఆ ముగ్గురు ప్రేమికులను గూర్చి ఆలోచిస్తూంటే అమలకు థ్రిల్లింగ్‌గా వుండేది.

ఆ వ్యవహారం ముదురుతోందనిపించిన అమల స్నేహితురాళ్ళు ఆమెను మందలించారు- "ఇష్టమైతే ముగ్గురులో ఒకర్ని ఓకే చెయ్యి. అంతేగాని అనవసరపు ప్రమాదాలు కొని తెచ్చుకోకు" అంటూ.

"ముగ్గురూ సమానంగానే ప్రేమిస్తున్నారు నన్ను. వారిలో ఒకర్ని సెలెక్ట్ చేసేదెలా?" అంది అమల కొంటెగా.

"ఏముంది? నువ్వెలాగూ జమిందారు బిడ్డకోసం కలలు కంటూంటావుగా? ముగ్గురిలో బాగా డబ్బున్న వాణ్ణి ఎంచుకో" అంటూ సలహా ఇచ్చింది ఓ స్నేహితురాలు.

"రోజూ నీకు కాస్ట్‌లీ బొకేస్‌ని పంపేవాడి కంటే ధనవంతుడెవడుంటాడు?" అంది మరో స్నేహితురాలు.

"నో!" అంటూ అరిచింది అమల. "రోజూ పోస్టులో లెటర్ పంపించేవాణ్ణే ఎన్నుకుంటున్నాను నేను" అంది.

స్నేహితురాళ్ళు తెల్లబోయి, "రోజూ ఖరీదైన పూల గుత్తుల్ని పంపేవాణ్ణీ, రోజుకు రెండుసార్లు టెలిఫోన్‌లో పలకరించేవాణ్ణీ విడిచిపెట్టి పోస్టులో ఓ ముష్టి వుత్తరం



రాసి పడేసేవాణ్ణి కట్టుకుంటానంటావేమిటే? నీకేమైనా మతిపోయిందా?" అంటూ కూకలేశారు.

అమల నవ్వి, "చుక్కలతో సమానంగా పోస్టల్‌రేట్లు గగనంలో విహరిస్తూన్న ఈ రోజుల్లోకూడా రోజుకో వుత్తరం పోస్టులో పంపిస్తున్నాడంటే అతను తప్పకుండా కోటీశ్వరుడే అయ్యుండాలి!" అంది ధృఢంగా.

"అవును సుమా!" అంటూ నోళ్ళు వెళ్ళబెట్టారంతా.

**- తిరుమలశ్రీ**





# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టీ పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.

★ ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ ప్రతి నవలకు అందజేసే రు: **3000/–** పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్:

# చతుర

'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.

# 'సీత నడిచిన భూమి' పై సమీక్షలు

డిసెంబర్ చతురలో ప్రచురితమైన సింహప్రసాద్ రచన
'సీత నడిచిన భూమి'పై మాకందిన ఉత్తమ సమీక్షలు.



## హెచ్చరిక

(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)

భారతీయ జీవన స్రవంతిపై రామాయణ మంత బలవత్తరమైన ముద్ర వేసిన కావ్యం మరొకటి లేదు. 'సీత నడిచిన భూమి'లో పుట్టిన ప్రతి స్త్రీ హర్షలాగా తన భర్త శ్రీరామ చంద్రుడే కావాలనీ, శ్రీరామచంద్రుడేననీ నమ్ముతుంది, కోరుకుంటుంది. కారణాలు ఏవైనా కానీ ఈ పుణ్యభూమిలో స్త్రీగా పుట్టి నందుకు ఆనాటి సీతా అగ్ని ప్రవేశం చేసింది, ఈనాటి హర్షా అగ్ని ప్రవేశం చేసింది. తప్పు రావణుడిదైనా సీతకి శీల పరీక్ష జరిగింది. రాముడు అగ్నిని నమ్మాడుగానీ ఆలిని నమ్మలేదు. లోకాపనిందలనుంచి సీ తని కాపాడటానికే రాముడు ఆ పనిచేశాడని సమర్థించుకుంటున్నాం మనం. అరిటాకు ముల్లు సామెతలా ద్రోహం చేసింది పురుషుడే అయినా కష్టాలన్నీ స్త్రీకే, సమాజం స్త్రీనే వేలెత్తి చూపుతుంది.

చివరిదాకా ఆసక్తికరంగా సాగిన ఈ నవల పరిస్థితుల ప్రాబల్యం వల్లగానీ, మరే ఇతర కారణాలవల్లగానీ తమ జీవిత భాగ స్వామిని తామే ఎన్నుకునే స్త్రీలకు పురుషుడు మాంగల్యం అనే బంధంతో ఎన్ని రకాల మోసాలు చేయగలడో వివరించి చూపింది.

పెళ్లంటే నూరేళ్ల పంట అని దూరదృష్టితో అటు ఏడు తరాలూ ఇటు ఏడు తరాలూ తరచి చూసి పెద్దలు చేసిన పెళ్లిళ్లే అనేకసార్లు విఫలమౌతూ వుంటాయి. ఇక హర్షలాంటి వారి సంగతి చెప్పనే అక్కరలేదు. విద్యావతియై, బాధ్యతగల ఉద్యోగం చేస్తూ ఎంతో తెలివైందని ప్రశంసలందుకున్న హర్ష కూడా చివరిదాకా టీనేజ్ అమాయకత్వపు దశని

దాటలేకపోయింది. రామలింగంగారిలాంటి లాయరు సలహాలను పాటించలేదు. విద్య, ఆర్థిక స్వాతంత్రమేకాదు స్త్రీకి లోకజ్ఞానం కూడా అవసరమని రచయిత చక్కగా చెప్పారు.

రవ్వంత సానుభూతీ, కాస్తంత చేయూతా వుంటే ఏ స్త్రీ అయినా ధైర్యంగా నిలబడగలదని ఇందిర జీవితం మనకు తెలియచెబుతుంది. ఇందిర పెళ్లి, భర్త పిల్లలు జీవితంలో ఒక భాగమేగానీ అదే జీవితం అనుకోదు. మొదట సంయమనం పాటించి, భర్తను సరిదిద్దాలని ప్రయత్నించి విఫలమై, అతన్ని ఎదిరించి, ఇంటినుంచి వెళ్లగొట్టబడగా చివరిదాకా ఏడుస్తూ కూర్చోకుండా, ఆత్మహత్యకు పాల్పడకుండా ఆత్మస్థైర్యంతో తన కాళ్ల మీద తాను నిలబడుతుంది. భర్త సంధికోసం రాయబారం పంపగానే ఎగిరి గంతెయ్యక అతనిలోని మార్పు నిజమైనదో కాదో అని తెలుసుకోవటానికి వ్యవధి తీసుకుంటుంది. తల్లితండ్రులు ఇచ్చిన కాస్తంత చేయూతే దీనికి ఆధారం కనుక మంచి చెడ్డలు చెప్పి చేయూతనిచ్చే పెద్దల అండలేని యువతులకు ధైర్యాన్నిచ్చే స్త్రీ సంక్షేమ సంస్థలు ఎంత అవసరమో తెలుస్తుంది.

శ్రీనుతో కలిసి జీవించేకన్నా అతనికి దూరమైతేనే సమాజం గౌరవించే స్థితిలోనూ ఆర్థిక స్వాతంత్ర్యం వున్న హర్ష జీవితానికి రచయిత ఇచ్చిన ముగింపు మాత్రం హర్షణీయంకాదు.

అడుగడుగునా శ్రీను చేసిన మోసాలను రుజువులతో సహా తెలుసుకుంటూ కూడా అతనితో వున్న వైవాహిక(?) బంధాన్ని తెంపుకోలేక పోయిన హర్షకథ వివాహంకాని యువతులకు ఒక హెచ్చరికే కాదు ఆడపిల్లలను కన్న తల్లితండ్రులకూ ఒక మార్గదర్శి. కాస్తంత భరోసా ఇచ్చి చేయి అందిస్తే స్త్రీలు మోసగాళ్లయిన పురుషుల ఉచ్చునుండి బయటపడగలరు.

-తూములూరి కనకదుర్గ
గుంటూరు- 522006

## పురాణ పాత్రలు

*(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

"సీత నడిచిన భూమంటూ రచయిత పురాణకాలంనాటి పాత్రలని, సాంఘిక ఇతివృత్తంలో నేర్పుగా ఇమడ్చడమే గాకుండా హీరోయిన్ చేత 'అగ్ని ప్రవేశం' కూడా చేయించారు. అందుకే నవల పేరు ఆవిధంగా పెట్టి వుండవచ్చు.

అనాదిగా స్త్రీ అనుభవింపదగ్గ వస్తువుగా పురషాహంకారులు చూస్తున్నారని చెప్పిన రచయితగారు నవల్లో హర్ష పాత్రని మరీ వెన్నెముకలేని వనితలా తీర్చి దిద్దడం ఏమీ బావుండలేదు.

అసలు ఏమీ ప్రాధాన్యంలేని జానకి పాత్రే మేలుగావుంది. భర్త తనను త్యజించిన తర్వాత ఆమెలో పెల్లుబికిన ఉద్రేకం, పౌరుషం, భర్తను సాధించాలనుకొని కడకు నిరాహారదీక్ష కూడా చేపట్టిన వైనం... ఇవీ హర్షలో మచ్చుకైనాలేవు.

ప్రేమబంధమే, పురుషాగ్రేసురులను కాపాడుతోందని రచయిత సదుద్దేశ్యం. లోకమంతా చీదరించుకొనే శ్రీను పడగనీడనే హర్ష కోరుకోవడం మహిళా పాఠకుల్ని నిశ్చేష్టులను చేసింది.

ఇది 'సీతాయణం' అంటూ పిడకలవేటలా కొన్ని పసలేని డైలాగులున్నాయి. 'నువ్వు రాముడ్ని కిడ్నాప్ చేసిన సీతవమ్మా!' అనే వ్యాఖ్యలు విజ్ఞులైన పాఠకులకి నవ్వు పుట్టిస్తాయి.

ఇప్పుడు స్త్రీ అణు క్షిపణిలాంటిది. సరిగ్గా ప్రయోగిస్తే లక్ష్యాన్నితాకుతుంది. లేకపోతే వాడ్నే దహిస్తుంది. ఆధునిక కాలంలో పాతివ్రత్యానికి అర్థంవేరు.

నవల ఆరంభంనుండి చివరివరకు సాఫీ




గా చదివించినా పతాక సన్నివేశం పండించలేకపోయింది. నవలలో ఉత్కృష్టంగా రూపొందిన పాత్రలుగాని, స్త్రీ సౌందర్యాన్ని, సున్నితత్వాన్ని, బహిర్గత పరచే సన్నివేశాలుగాని, ఆమె హావభావాలుగాని, ఆకాంక్షలు గానీ, ఆవేశకావేషాలుగాని స్పష్టీకరించలేకపోయింది. ఎందుకంటే ఈ నవల ప్రధానంగా స్త్రీ సంబంధిత వస్తువుతో రూపొందింది గనుక.

-కూనపరెడ్డి వరలక్ష్మి
గుడివాడ-521301

## కొత్తగా చెప్పిన పాతకథ

*(తృతీయ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

'సీత నడిచిన భూమి' టైటిల్ బాగుంది. ఆడపిల్ల తగు జాగ్రత్తలో వుండకపోతే ఏర్పడే దుష్పరిణామాలు ఎంత తీవ్రంగా వుంటాయో, ఎంత ఘోరంగా వుండగలవో కన్నులకు కట్టినట్టు చెప్పే నవల ఇది. మగవాడి తీయని మాటలకు లోబడిపోయే ఆడపిల్ల బలహీనత కనిపిస్తుంది ఇందులో. హర్ష జీవితం సాటి ఆడపిల్లలకు గొప్ప కనువిప్పు, హెచ్చరిక కాగలదు. తరతరాలుగా ఆడది మగాడి చేతిలో మోసపోతూన్న తీరు కనిపిస్తుంది.

హర్ష పాత్రలో ఎటువంటి ఔన్నత్యమూ కనిపించదు. ఆమె విద్యావంతురాలు, ఆఫీసరూను. వృత్తిరీత్యా నిత్యమూ రకరకాల వ్యక్తులతో ఇంటరాక్ట్ చేస్తూ వివిధ మనస్తత్వాలను చదివే అవకాశము, అనుభవమూ ఉన్నాయి ఆమెకు. అయినా హెూదాకీ, వయసుకీ తగిన మనోపరిపక్వత ఏకోశానా కానరాదు ఆమెలో. తొలి పరిచయంలోనే అదీ సినిమాహాలువద్ద కలయికతో శ్రీనివాస్‌కి చనువివ్వడము, అతనితో చనువు పెంచుకోవడము చిత్రంగా తోస్తాయి. అలాగే హర్ష వూహలలో, చేతలలో, మాటలలో కూడా మెచ్యూరిటీ కనిపించదు. భద్రాచలం యాత్రలో తోటి ప్రయాణీకులనుకూడా లక్ష్యం చేయకుండా ఆమె శ్రీనివాస్‌తో బాహాటంగా ప్రవర్తించిన తీరు, మాట్లాడిన విధానమూ ఎబ్బెట్టుగా అనిపిస్తాయి తప్ప ఆ పాత్రమీద గౌరవం కలిగించవు. ఏ సందర్భంలోనూ ఆమె తన స్థాయికి తగిన విధంగా డిగ్నిఫైడ్‌గా కనిపించదు.

శ్రీనివాస్ నిజస్వరూపం ఏ క్షణానికాక్షణం తేటతెల్లమవుతున్నా, అతగాడు తన భావాలను, వుద్దేశాలను బాహాటంగా, కుండ బద్దలు కొట్టినట్టుగా చెబుతున్నా బుద్ధి తెచ్చుకోకుండా రామలింగయ్యవంటి పెద్దలు, అనుభవజ్ఞులు, శ్రేయోభిలాషులు చెప్పే హితవులను పెడచెవిని పెట్టడం హర్ష పరమ మూర్ఖత్వాన్నీ మనోచాంచల్యాన్నీ చాటుతాయే తప్ప ఆమెపైన సానుభూతి కలగదు.

కథలో కొత్తదనంగాని, కథనం ఆసక్తికరంగాగాని లేని సాదాసీదా నవల ఇది. ముగింపు కూడా పాతదే. సమస్యలన్నిటికీ పరిష్కారం చావేనా? అన్న ప్రశ్నను లేవదీస్తుంది. ఒక్క ముక్కలో చెప్పాలంటే కొత్తగా చెప్పిన పాత కథ ఇది.

-పి.వి.వి.సత్యనారాయణ
హైదరాబాద్- 500007

## వ్యక్తిత్వలేమికి దర్పణం

*(నాల్గవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

'సీత నడిచిన భూమి'లో ఇతివృత్తం పాతదే అయినప్పటికీ కథనంలో నూతనత్వం తొణికిసలాడడంతో నవలను ఆద్యంతం చదవడం కష్టమనిపించలేదు. చదువుకుని, ఉన్నత హెూదాల్లో కొనసాగుతున్న స్త్రీలల్లో కొందరు వ్యక్తిత్వలేమితో బాధపడుతున్నవైనాన్ని హర్ష పాత్రద్వారా రచయిత చాలా చక్కగా చూపించారు. నాణేనికి బొమ్మతో



పాటు బొరుసూ ఉన్నట్లుగానే హర్ష పాత్రలో మూర్తీభవించిన మూర్ఖత్వంతోపాటు అవ్యాజమైన ప్రేమానురాగాలను కూడా చూడగలుగుతాము. సెల్ఫ్‌పిటీతో కుంచించుకుపోతూ క్రమక్రమంగా ఊబిలోకి కూరుకుపోతున్న హర్ష పాత్రకు సమాంతరంగా నిండైన ఆత్మవిశ్వాసంతో ముందడుగు వేస్తున్న ఇందిర పాత్రను నడిపించడంద్వారా రచయిత జీవితపు రెండు పార్శ్వాలనూ స్పృశించినట్లయింది.

ఈ నవలలోని శ్రీను తాలూకు ఒక్కొక్క అవలక్షణం పాఠకులకు తెలుస్తున్నకొద్దీ అంతకుముందు హర్షపట్ల అతను చూపిన ప్రేమలో ఎంత మోసం, హిపోక్రసీ ఉందో అవగతమవుతుంది. ప్రేమ అంటే తమకున్న భావాలకు పొంతన కుదరక అనీజీగా ఫీలవుతారు. ప్రేమ అంటే మోసం, పెళ్లి అంటే కష్టాలమయం అన్నట్లుగా సాగిన ఈ నవల పఠితుల తలల్ని కాస్త బొప్పికట్టించిందనే చెప్పాలి. అయితే మోసగాళ్ల మేజిక్‌లో పడిపోయి తమకు మొదట్నుంచీ ఉన్న లాజిక్‌ను పోగొట్టుకోవద్దనే అంతర్లీనపు సందేశాన్ని అందించిన రచయితకు అభినందనలు!

-టి.రవిందర్‌రెడ్డి
గోదావరిఖని- 505211

## తిరోగమనమా? పురోగమనమా?

*(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

సింహప్రసాద్‌గారి నవల 'సీత నడిచిన భూమి'లోని హర్ష పాత్ర అసమంజసంగానూ, అసమగ్రంగానూ ఉంది. రచయిత ఆ పాత్రను మలచడంలో మరింత శ్రద్ధ కనపరచి వుండవలసింది. విద్యావంతురాలు, ఆర్థిక స్వాతంత్ర్యం, మంచి వ్యక్తిత్వం వున్న హర్ష ఓ సామాన్య స్త్రీలా, టీనేజ్ గాళ్‌లా ప్రవర్తించడం, శ్రీను అనబడే ఓ గోముఖ వ్యాఘ్రం వలలో అత్యంత సులభంగా ఇరుక్కోవడం అంతా నాటకీయంగా అన్పిస్తుంది. రామలింగయ్య కూతురు ఇందిరతో తనను పోల్చుకుంటూనే హర్ష ఆత్మవిశ్వాసం కోల్పోవడం అత్యంత విచారకరం. ఆర్థిక స్వాతంత్ర్యం చేజిక్కించుకుని, మగతోడు లేకుండా జీవితాన్ని తీర్చిదిద్దుకుని, తన పిల్లవాడిని చక్కగా పెంచుతున్న ఇందిరను చూసి తనకుతాను సంస్కరించుకోవాల్సిన హర్ష ఎంతో బలహీన మనస్కురాలిగా మిగిలిపోతుంది. పైగా తాను తప్పుదిద్దుకునే అవకాశాలెన్ని వచ్చినా చేజార్చుకుంటుంది. ఎన్నోసార్లు తనకు సలహాల్నివ్వవచ్చిన రామలింగయ్య గారిని, తన అన్నలను కాదని తనకు తానే గొయ్యి తవ్వుకుంటుంది. స్త్రీ తాను అబలకాదు సబల అని నిరూపించుకుంటున్న రోజులివి. గిరిజన మహిళల్లో సైతం చైతన్యం వెల్లివిరుస్తున్న రోజులివి. మరి అలాంటిది మూర్ఖంగా తన జీవితాన్ని అంతం చేసుకోవడంతో పాటూ, తన గర్భంలోని శిశువుని సైతం హత్య చేసేంతటి వివేక శూన్యమూ, విచక్షణా రహితమైన పనికి హర్ష దిగజారడం నిజంగా ఆమె తిరోగమనమా? పురోగమనమా? ఈ పాత్ర ద్వారా రచయిత ఎన్ని చూసినా, ఎంత నేర్చినా ఆడది ఆడదేనని అబలేనని చెప్పదలిచారా? చాలా అసంతృప్తిని కల్గించిన నవల ఇది.

-వి.శ్రీనివాసరావ్
బొబ్బిలి- 535558

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328 Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75291; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942, Nellore: 331250.

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78

# కొందరికి కారం అంటే మమకారం!

ఔను... ఇప్పుడు కారం కారంగా, తియ్య తియ్యగా, పుల్ల పుల్లగా, ఘాటు ఘాటుగా, మీకు నచ్చే మీరు మెచ్చే ఏ రుచి కావాలన్నా అందిస్తోంది 'ప్రియ'. 23 రకాల 'ప్రియ' పచ్చళ్లు... మీ ముందు సిద్ధం.

నోరూరించే, మైమరిపించే 'ప్రియ' ఘుమ ఘుమలు పసందైన విందును ప్రేమించే మీ కోసమే ప్రత్యేకం సుమా!

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ, ఆవనూనెతోనూ, నువ్వుల నూనెతోనూ కూడా సంసిద్ధమై లభిస్తోంది. సాటిలేని 'ప్రియ' మాధుర్యం... 300, 500 గ్రాముల సీసాల్లోనూ, 1 కే.జి., 5 కేజీలు, 20 కేజీల ప్యాకింగులలోనూ లభించును.






Mango Avakaya | Mango Thokku | Cut Mango | Tender (Vadu) Mango | Sweet Mango Chutney | Amla | Gongura | Drumstick | Lime | Tomato | Mixed Vegetable



Bitter Gourd | Green Tamarind | Ginger | Sweet Ginger | Mango Ginger | Garlic | Onion | Red Chilli | Green Chilli (Sliced) | Green Chilli (Paste) | Gongura & Red Chilli | Green Tamarind & Red Chilli

**priya**

**Pickles**

**ఏ పచ్చడంటే ఆ పచ్చడి సంసిద్ధ**

**ఉషోదయ ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్,(ప్రియ ఫుడ్స్ డివిజన్), ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్ 500 482.**